# శ్రీ తులసీరామాయణము

## ఆరణ్యకాండము.



(నిర్వచనము)

విజయవిజయ, విచిత్రవీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, అభినవభర్తృహరి,
శృంగారరస ధ్యాదిగ్రంథకర్తలగు

## భాగవతుల నృసింహశర్మగారిచే

విరచితము

printed by:-COCANADA PRINTING WORKS,
COCANADA.

published by:-**Bh. N. SERMA,**
*Proprietor*, **Vegu-Jukka Series,**
Pudipeddi vari Street,
**BERHAMPORE.**
*(Ganjam)*

**I'st Edition**
1000 COPIES.
**1929**



(వెలరు. రూ **1-0-0**) (ఖర్చులు ప్రత్యేకం)

☞ *For Copies apply to the Publisher.*

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః



# శ్రీ తులసీరామాయణము

## అరణ్యకాండము



కం॥ బృందా మానసచోరా!
బృందారక బృంద వినుత ♦ వేదోద్ధారా!
వందారు జనాధారా!
మందార సమాన దాన ♦ మహీమోదారా!. 1

సీ॥ అఖిల లోకములకు ♦ నాశ్రయంబగు ధర్మ
భూరుహ మూలమై ♦ మురియువాని
అతుల వివేకాబ్ధి ♦ కానందదంబైన
పూర్ణేందు బింబమై ♦ పొదలువాని
వైరాగ్యమను దివ్య ♦ పద్మకోశమునకు
భాస్కర బింబమై ♦ వఱలువాని
అఘ ఘన ధ్వాంతంబు ♦ నపహరింపఁగ భూరి
విజ్ఞాన దీపమై ♦ వెలుఁగువాని

గీ॥ ఘన విమోహాభ్ర పటల పా ♦ టన విధాన
మున, మహా మారుతంబయి ♦ తనరువాని
శంకరున్ బ్రహ్మకులునిఁ గ ♦ లంక శమను
రామచంద్రు ప్రియున్ భక్తిఁ ♦ బ్రస్తుతింతు. 2

మ॥ సుర సంపూజిత మస్తకంబున జటా ♦ జూటంబు శోభిల్ల, సుం
దర పీతాంబర భూషితాంగుఁడయి, సీ ♦ తా లక్ష్మణోపేతుఁడై
శర కోదండ కరద్వయుండయి, కటిన్ ♦ సంబద్ధ తూణీరుఁడై
వర కాంతారమునన్ మెలంగు వరదున్♦భావింతు నశ్రాంతమున్.

గీ॥ ఏ ననఁగ నెంత కొండాడు ♦ లేమివింత
నీ దయన్ గొంత తొలఁగును ♦ నాదు వంత
సద్గుణ నిశాంత శత్రు సం ♦ చయ కృతాంత
ప్రణత హనుమంత జానకీ ♦ ప్రాణకాంత! 4

గీ॥ రామ నీ నామరుచి నమా ♦ రమణుఁ డెఱుఁగు
ననఘ పాద ప్రభావ మ ♦ హల్య యెఱుఁగుఁ
దావక బలంబు శివుని కో ♦ దండ మెఱుఁగు
భవ దమోఘాస్త్రగతి నకూ ♦ పార మెఱుఁగు. 5

గీ॥ అవధరింపుము నీదు నా ♦ మాంకితముగఁ
బలుకుచుంటిని నీ కథా ♦ వైభవంబు;
తావక పదాబ్జ మకరంద ♦ ధారఁ బోలి
నా కవిత్వంబు నెగడుఁ బో ♦ లోకముననను. 6

క॥ రసనా నాట్యస్థలమున
ననదృశముగ వాణి నాట్య ♦ మాడఁగ నెలమిన్
రసభరితము నీ చరితము
ననమాస్త్రని వైరి గారి ♦ కానతియిచ్చెన్. 7

గీ॥ మిగుల గంభీరముగు రాము ♦ సుగుణజలధి
మునిఁగి సుజనుండు వైరాగ్య ♦ మున రహించు;
రామ విముఖుండు మఱియు ధ ♦ ర్మ రహితుండు
మాయకుం జిక్కియుండు సం ♦ సారముననను. 8

గీ॥ రామ భరతులఁ గల యను ♦ రాగముసను
వెలితి యనునది లే దణ ♦ వీసమైన

నాకుఁ దోఁచిన విధమున ♦ నీకుఁ జెప్పి
తనివిఁ గైకొంటి నొక్కింత ♦ తమ్మికంటి. 9
గీ॥ మునులు దేవత లెయ్యంశ ♦ మును గుఱించి
రాము ధ్యానించుచుండిరో ♦ రామ వినుము
దాని సాధింప ఘోర కాం ♦ తారమునను
రాముఁడు చరించె దుర్భర ♦ వ్రత నిరూఢి. 10

—§ జయంతుని గర్వభంగము §—

క॥ ఒక సమయంబున రాముం
డకలంక గుణాబ్ధిచంద్రుఁ ♦ డడవిం గల, స
ద్వికచ ప్రసూన తతితో
నొక మాలికఁ గూర్చి దేవి ♦ కొసఁగెన్ బ్రీతిన్. 11
గీ॥ కంఠమునఁ బుష్ప హారంబు ♦ కాంతులీన
భూరి మణులతోఁ గ్రాలు త ♦ ద్భూధ్రమందు
స్ఫటిక శిలమీఁదఁ గూర్చుండె ♦ జనకపుత్రి
అంతరిక్షంబునన్ జంద్రుఁ ♦ డలరు వేళ. 12
క॥ నెల నిండు పండు వెన్నెలఁ
గలయన్ వెదజల్లుచుండఁ ♦ గడు నుత్సుకయై
అల వేల్పుఱేని కోడలు
చెలికత్తెలతోడ వచ్చె ♦ శ్రీరాముఁ గనన్. 13
సీ॥ మంజుల పద కంజ ♦ మంజీర నినదంబు
రాయంచ బోదల ♦ రవళిఁ దెగడఁ
కందోయి విందగు ♦ మందయానమునకు
నైరావ తాతిశ ♦ యం బణంగఁ
కడు నింపులను నింపు ♦ గళ నాద గరిమకు
గండు గోయిల పిండు ♦ బెండువడఁగ

ముద్దులఁ గురిపించు ♦ సుద్దుల నాలించి
కౌాదమ చిల్కల గుంపు ♦ మదముఁ బాయ

సీ॥ వేల్పుసానుల వెన్నంటి ♦ వెడలకుండఁ
బ్రియునిఁ దన విలాసంబులన్ ♦ దృప్తిపఱచి
అచ్చటికి వచ్చెఁ జెలికత్తె ♦ లనుగమింప
సంత తారాధి తార్య జ ♦ యంతు భార్య. 14

గీ॥ ఏకపత్నీ వ్రతుండైన ♦ యినకులుండు
ఆమెఁ గని వచ్చితే యని ♦ యాదరించి
తనయఁగను తండ్రిసరణి దీ ♦ వన లొసంగె
నామెయున్ రాము వినుతించి ♦ యరిగె దివికి. 15

గీ॥ వెలఁది విభుఁజూచి శ్రీరాము ♦ విధముఁ దెలిపి
ఎంతయు నుతింప నంత జ ♦ యంతుఁడు విని
అరసి వచ్చెద శ్రీరాము ♦ చరిత మనుచు
భువికి వచ్చెఁ బరీక్షించు ♦ బుద్ధితోడ. 16

ఉ॥ అక్కట బుద్ధిహీనుఁడు జ♦యంతుఁడు; వారిధి లోతుఁ జూడఁగా
నెక్కనుఁగాక శక్య మగు ♦ నే చలిచీమకు? శైలపుత్రి! న
క్కక్కడ దేవలోక మది♦యెక్కడ యన్నయటుల్, తెగించి తా
నక్కడ కేగుదెంచెఁ బర♦మాత్ము ప్రభావ మెఱుంగనచ్చునే? 17

సీ॥ అతివ! యవివేకి యగుఁగాక ♦ యా జయంతుఁ
డప్పు డేకాక్షియై కాకి ♦ యై యరణ్య
సీమ కేతెంచి యొకయోర ♦ సీతఁ గాంచి
కడకు మెల్లఁగఁ జనెఁ గావు ♦ కావురనుచు. 18

ఉ॥ పొంతకు నేగుదెంచి చన ♦ వుం గలయట్లు నటించి కాకి యా
వంతయు జంక కా సతి ప ♦ దాబ్జములన్ నిజ చంచుకోటి ని
శ్చింతఁగఁ బొడ్చి గాయమును ♦ జేసిన యంత నిరంతరంబుగన్
వ్రింతలుగట్టి పాఱె రుధి ♦ రంబు, సహింపఁగనౌ నె యేరికేన్.19

ఉ॥ అంగన యూరుభాగమున ♦ నత్తఱి నిద్రించుచున్న భర్తకున్
భంగమువచ్చునేమొ యని♦బాధ నొకించుక యోర్చెఁగాక, పృ
థ్విం గడుఁ బాఱుచున్న నులి ♦ వెచ్చని నెత్తురు మేన నంటఁగన్
అంగద సంభవించెనని ♦ యా రఘురాముఁడులేచె దిగ్గనన్ 20

ఉ॥ లేచి ధరాసుతా పద జ ♦ లేజ పరిస్రుత రక్తధారలన్
జూచి, వికార కాకమును ♦జూచి, మహాగ్రహ విగ్రహోగ్రుఁడై
పోఁచనుబూని మంత్రి పరి ♦ పూతముగా నొనరించి, కాకిపై
వైచినయంత నేమనఁగ ♦ వచ్చు నమోఘ మహా ప్రభావమున్.

ఆ॥ గడ్డిపోచ ప్రళయ ♦ కాలాగ్నిపుంజమై
మింటి కెగసి పెద్ద ♦ మంటమండెఁ
గావు కావు రనుచుఁ ♦ గాందిశీకతఁ బాఱి
యా జయంతుఁ డంత ♦ నడలి సడలె. 22

ఆ॥ ఎచటి కేగుఁగాక ♦ యచటఁ దాఁ గనుపట్టు
వెడలనీదు వాని ♦ వెంబడించు
నెట్లు సన్నుతింతు ♦ నినకులోద్భవుఁడైన
రాచవాని గడ్డి ♦ పోఁచ మహిమ. 23

ఉ॥ చంపదు, వెంబడించు, నొక ♦ చాయను నిల్వఁగనీదు, తప్పు మ
న్నింపదు, గొప్పవాఁడని గ ♦ ణింపదు, తాలిమిఁజూపి వైరమున్
దెంపదు, మండి, పైబడిన ♦ తీరు నటించు, క్షమింపుమన్న నా
లింపదు, నిల్చి సుంతయుఁ జ ♦ లింపదు, పోఁచ ప్రభావమెట్టిదో.

క॥ అడలించును, నలుగడలకు
వెడలించును, వెడలినంత ♦ వెన్నంటి వడిన్
బడలించును సడలించును
ఒడ లించుక దాపనీయ ♦ దొకచో నైనన్. 25

క॥ గజగజ వణఁకుచు నంతట
నిజరూపముతోడ నతడు ♦ నెలవున కరిగెన్

కుజనుండవు మూర్ఖుండవు
వృజనాత్ముఁడ వంచుఁ దండ్రి ♦ వెడలం గొట్టెస్. 26

సీ॥ తలదాచుకొన నెంచి ♦ జలరాశిలోఁ డాఁగె
బడబాగ్నిలోఁ బోఁచ ♦ పరితపిల్లె
బ్రదికి వచ్చెద నంచు ♦ బాతాళమున కేఁగె
బలి కీకమునఁ బోఁచ ♦ ప్రజ్వలించె
శరణాగతుఁడ నంచు ♦ సత్యలోకముఁ జొచ్చె
ధాత యూడలఁ బోఁచ ♦ తాండవించె
రక్షింపుమంచు నసె ♦ బ్రతిమాలుకొన వచ్చెఁ
దిరి నయనంబులఁ బోఁచ ♦ తేజరిల్లె

గీ॥ పాహిమాం పాహి యని విష్ణు ♦ పజ్జ కరిగెఁ
జక్రముం జొచ్చి పోఁచ ప ♦ రాక్రమించె
గతి నిరోధించె నెంతయుఁ ♦ బ్రతిఘటించె
నింక దిక్కెవ్వఁడు జయంతుఁ ♦ కెట్లు బ్రదుకు. 27

క॥ శిక్షింపఁగ నొక్కమ్మఁడి
భక్షింపఁగవచ్చు దాని ♦ వారించి సహా
సాత్రి తనూజుని నకటా
రక్షించెడువాఁడు లేఁడు ♦ రమణీ వింటే. 28

క॥ పూర్వము శ్రీహరి చక్రము
దుర్వాసుని వెంబడించి ♦ దుర్భర బాధస్
గర్వాతిశయము లణఁచెను
శర్వాణీ! యంబరీషు ♦ చరితము వినవే? 29

క॥ మాయామేయుఁడు శ్రీ నా
రాయణుఁ డీ రామచంద్రుఁ ♦ డలిగిన మృత్యు
ప్రాయుండగు మిత్రుండును
పీయూషము సాటిలేని ♦ విషమగు నగజా! 30

ఆ॥ తల్లి మృత్యువగును ♦ తండ్రి కాలుండగు
జాజిపూలదండ ♦ సర్పమగును
జగము వహ్నిగోళ ♦ సరణిని దీపించు
రామ విముఖుఁడైన ♦ బ్రదుకఁగలఁడె? 31

క॥ సురరాజ సుతుఁడు రాముని
శరధాటికిఁ దాళలేక ♦ జగములనెల్లన్
దిరుగుచుఁ బడుచున్ లేచుచుఁ
బరువెత్తెన్ జూచువారు ♦ భయముం బొందన్. 32

ఉ॥ ఆయెడ కత్తటిన్ మునికు ♦ లాన్వయుఁడు నారదుఁ డేగుదెంచి "నా
రాయణ! శౌరి! మాధవ! పరాత్పర! కేశవ" యంచు నెంతయున్
హాయిగఁ బాడి యాడుచు జ ♦ యంతు నవస్థకుఁ దల్లడిల్లి రా
మా! యిది నీప్రభావ మని ♦ యాత్మఁ దలంచి వచించె నీగతిన్.

క॥ "సగుణుండగు శ్రీరాముఁడు
పగవాఁ డగునేని ప్రోచు ♦ వాఁ డెవ్వఁడికన్
మగనాలి మగడు గొట్టిన
మొగసాలా ప్రోవఁగలదు ♦ బుద్ధివిహీనా! 34

చ॥ వెఱచి జగంబులన్ దిరిగి ♦ వేసటఁబొందిన లాభముండునే?
చెఱచినవాఁడు రాముఁడట ♦ చేకొని నిన్నవఁ డాదరించు? నిన్
దఱిమిన భీకరాస్త్రమును ♦ దప్పి చరింపఁగ రామ నామమున్
మఱచితివే కుమార! మతి ♦ మంతుఁడవయ్యు జడుండవైతివే. 35

ఆ॥ గరుడివాతఁజిక్కి ♦ కాలాహి బ్రదికిన
బ్రదుకవచ్చుఁ గాక ♦ రాము శరము
బారినుండి దప్పి ♦ బ్రదుకంగ శక్యమే
కీలికైన నంతు ♦ మాలికైన. 36

గీ॥ రాముని జయింపవలె నన్న ♦ రామనామ
మంత్రమే మహాయుధ మని ♦ మతి నెఱింగి

వెడలి శ్రీరామ పాదార ♦ విందములకు
మ్రొక్కి రక్షింపుమను మింకఁ ♦ బూనెఁ గఱచి. 37

చ॥ అనవ్రతు జ్ఞానబోధ సమ ♦ యంబునకున్ లభియించె నంచు శ్రీ
వనమునకున్ పథంబు గను ♦ పట్టెఁ గృతార్థుఁడ నైతి నంచుఁ బా
వనమగు రామనామమును ♦ భక్తిని నెంచి జయంతుఁ డంత న
వ్వనమున నున్న రాఘవుని ♦ పాదములందు బడి మ్రొక్కి యిట్లనెన్.

శా॥ కంటిన్ నిన్ను గుణాభిరామ! త్రిజగ ♦ త్కల్యాణధామా! మతిన్
గొంటిన్ వైరము గన్నుఁగానక, భవ ♦ త్కోప ప్రతాపాగ్ని వె
న్నంటెన్, లోకములన్నియున్ దిరిగితిన్ ♦ బ్రాణార్తితోఁ, దాళలే
నంటిన్, దీనుఁడ నన్నుఁ బ్రోవఁగ నమో ♦ ఘాస్త్రంబు వారింపవే?

క॥ అదలించెను, దుర్మదమును
విదళించెను, వెంబడించి ♦ బింకము మేనన్
గదలించెను, నీ రాక్షసి
వదలించిన ముందలించి, ♦ బ్రదికెద ననఘా! 40

గీ॥ భవ దమోఘ ప్రతాప మ ♦ ప్రతిహతంబు
మూర్ఖుఁడ గ్రహింపఁజాలక ♦ మోసపోతిఁ
జా[illegible]ఖ్యునకుఁ దగు ♦ ఫలముఁగంటిఁ
[illegible] రక్షింపు మో రామ ♦ సమరభీమ! 41

సీ॥ శరణాగతత్రాణ ♦ బిరుదంబుఁ గలిగిన
పరమ దయామయా ♦ వందనంబు
ఆపదుద్ధారక ♦ ఖ్యాతిఁగాంచినయట్టి
భక్త సంరక్షకా ♦ వందనంబు
నిత్య సత్యవ్రత ♦ నియమంబుఁ దప్పని
పావన జీవనా ♦ వందనంబు
ఆర్తలోకావన ♦ కీర్తి నార్జించిన
భావ నారాయణా ♦ వందనంబు

గీ॥ అభయ మిమ్మని ప్రార్థించు ♦ నట్టి గర్భ
శత్రు నైనను గాపాడు ♦ సచ్చరిత్ర!
వరద! దశరథ నందనా ♦ వందనంబు
భయ నివారణ! నిత్యంబు ♦ వందనంబు. 42

గీ॥ పాహిమాం పాహి యని నిన్ను ♦ భక్తవరద!
ప్రాణదానంబుఁ గోరితిఁ ♦ బరమ పురుష
దేహి యని నిన్ను యాచించు ♦ దేహి నేను
సంకటముఁ బాపి రక్షింప ♦ ఁజనదె నీకు. 43

మ॥ అని ప్రార్థించి పదంబులన్ బడిన దీ ♦ నాలాపి నా పాపినిన్
గని రక్షింపఁదలంచి యేక నయనున్ ♦ గావించె; దద్దోష దం
డన మూహింపఁగ శీర్ష ఖండనము ద్యో ♦ నన్ వానిఁ బోనిచ్చె న
త్యనుకంపన్ వహియించి రాఘవుఁడు మో ♦ ఘాస్త్రింబు వారించుచున్.

గీ॥ "జీవుఁడా యింక బ్రొదుకుమో ♦ చావుదప్పి
కన్ను లొట్టవోయిన దన్న ♦ కరణి; తాముఁ
డింతతో నిన్నుఁ బోనిచ్చె ♦ నంతె చాలు
ననుచుఁ జనె నిర్ధ్రిసూతుఁ డన్న ♦ రనుచు ద్రివికి. 45

క॥ "వరదా! యభయం బి"మ్మని ♦
చరణంబులఁ బడిన గర్భ ♦ శత్రువు నెనస
గరుణా భరణుఁడు రాముఁడు
శరణాగత వత్సలుండు ♦ సంరక్షించున్. 46

చ॥ ముది త!జయంతుఁబో్చి, రఘు ♦ పుంగవుఁడంతటఁ జిత్రకూటమున్
వదలి; రయంబ యన్య ♦ ముని ♦ వర్యుల యోగుల నెల్లఁ జూడఁగా
నదని దియంచు నెంచి మును ♦ లందఱు జేసు లన మార్గశీర్ష శు
ద్ధ దశమినాడు మువ్వురను ♦ దక్షిణదిక్కున కేగి రేగుచున్. 47

—అత్రిమహాముని యాశ్రమము—

గీ॥ తోవ నత్రి మహాముని ♦ పాష నాశ్ర

మంబు వీక్షించి ముప్పూరు ♦ పరాని కెజంగి
అపనయించిరి శ్రమ మ త ♦ న మ్మునీంద్రు
డాత్మ నానంద భరితుండై ♦ యాదరమున, 48

శా॥ ఓహో! రాముఁడు మోక్షధాముఁడని పత్రిత్యాగ్యానముం జేసి "వ్యా
మోహాంధ్వాంత పతంగ బింబమగు నీశ్రుణ్యాంగమును జూడ, నా
దేహం బెంతయు సార్థ సోలు ననఘా ♦ దేవుండ వీ వన్న సం
దేహింపం బనిలేదు, నీ వదనమే నిక్కంబు వాక్రుచ్చెడున్. 49

గీ॥ అనుచు హర్షించి వెంతయు ♦ నతిశయించి
సరసముం జని రం డని ♦ సత్కరించి
ఘనుల వ య్యన్నదమ్ములఁ ♦ గౌఁగిలించి,
కందమూలాది ఫలముల ♦ ముందుఁ బెట్టి 50

ఉ॥ శ్యామల కోమలాంగు విమ ♦ లాంబుజపత్రి విశాలనేత్రు, శ్రీ
రాము, జనాభిరాము, దిన ♦ రాజకు లాంబుధి సోము, సద్గుణా
రాము, ఖరాది రాక్షస వి♦రాము, యశోధనకాముఁ జిత్కళా
ధాముని౯ జూచి చూచి వర♦దా! యని యత్రి నుతించె నీగతిన్.

—§ శ్రీరామ పంచచామర స్తోత్రము §—

1. అనూప రూప భూపతీ! మ ♦ హాత్మ నిన్నుఁ గొల్చెదన్
దినేశ గోత్ర మండనా! త్రి ♦ నేత్ర చాప ఖండనా!
మునీంద్రలోక రంజనా! వి ♦ మోహ పుంజ భంజనా!
మనోజ వైరి పూజితా! ర ♦ మా సతీ విరాజితా!. 52

2. నమస్కరింతు సర్వలోక ♦ నాయకా! వినాయకా!
అమోఘ రూప సాయకా! య ♦ నాది వేద గాయకా!
భ్రమ ప్రమోద వారణా! సు ♦ ర ప్రమోద కారణా!
అమేయ దివ్య లోచనా! మ ♦ దాది దోష మోచనా! 53

3. త్వదీయ పాదపద్మ సేవఁ ♦ జాయు కెల్ల వేళలన్
మదిన్ నరుండు గోల్పు హీన ♦ వత్సరుండగున్ భువిన్,

సదా వితర్క తుంగ భంగ ♦ సంఘమున్ భవాంబుధిన్
తుదిన్ దరించి నిన్ స్మరించి ♦ దోష వర్జితుం డగున్. 54

౪. విశుద్ధ బోధ శోధనా! ప ♦ విత్ర కార్య సాధనా!
యశోధనా! సురాయోధనా! మ ♦ దారి బృంద సూదనా!
కుశాగ్రబుద్ధి; రామనామ ♦ కోటి వ్రాసి శాశ్వత
ప్రశాంత సుప్రశస్త మోక్ష ♦ రాజ్యలక్ష్మిఁ గైకొనున్. 55

౫. భజింతు సంతతంబు నీదు ♦ పాద పద్మ యుగ్మమున్
సృజింతు భూతలంబునన్ వ ♦ రిష్ఠ నాక లోకమున్
త్యజింతుఁ దుచ్ఛ సంసృతిన్ స ♦ దా విరక్తి భక్తి నే
భుజింతు నీదు నామ భక్ష్య ♦ మున్ మహేశ లక్ష్యమున్. 56

శా॥ దేవా! తావక భక్తకోటి యెడ మై ♦ త్రిన్ గల్గి, నీ పాద రా
జీవ ద్వంద్వము నెల్లవేళలను సం ♦ సేవించి, ధ్యానించి మ
ద్భావం బున్నతమైన మోక్షపదవిన్ ♦ భాసిల్లు చందాన న్నన్
దీవింపందగు నప్రమేయ! సదయా! ♦ దివ్య త్రితా పోద్దయా.

చ॥ నను భవదీయ పాద నళి ♦ నంబుల సంతతమున్ భజించు దా
సుని నొకకంటితోఁ గరుణఁ ♦ జూచిన నంతియచాలు, సర్వభూ
త నిచయమందుఁ బ్రేమమును♦ధర్మమునందను రక్తి, భక్తి, నా
మనమునకున్ లభించుగతి ♦ మాధవ! వేగ ననుగ్రహింపవే 58

ఉ॥ నీ చరణారవిందముల ♦ నిత్యముఁ గొల్చెడి భాగ్య మబ్బినన్
నీచములయ్యు జన్మములఁ ♦ నేను భరించెద నెన్ని యేని; శ్ర
ద్ధాచల భక్తి యుక్తి, యన♦యంబును భూతదయాప్రసక్తి, సం
కోచముఁదక్కి నా కొసఁగఁ ♦ గోరెద నో రఘువంశమండనా.

గీ॥ అనుచు వినుతింప హర్షించి ♦ యమ్మునీంద్రు
భక్తికిన్ మెచ్చి శ్రీరామ ♦ భద్రుఁ డనియె
నఖిల జనులకు నీవు గా ♦ యతి వతి!
దేవ సన్నుత పావన ♦ జీవనుఁడవు. 60

గీ॥ శాశ్వత స్వాస్థ్యముం బొందఁ ♦ జాలు దీవు
సంశయమ్ముఁ బొందఁ బని లేదు ♦ చతురమతివి
అనిన ధన్యోస్మి యని ముని ♦ య్యల్లరేఁ వఁత
నవవిజం గాంచి యనసూయ ♦ యతని జాయ. 61

—§ అనసూయ సీత కుపదేశించుట §—

ఉ॥ రమ్మని యాదరించి, "వర ♦ రాజ తనూజవు, చిన్నదాన వా
క్యమ్మడిఁ గష్ట నష్టముల ♦ కోరిచి భోగములన్ త్యజించి, యు
గ్రమ్మగు కాననంబునకుఁ ♦ గాంతుని బాయక యేగుదెంచితే
యమ్మక చెల్ల! నీదు హృద♦యంబు గ్రహింపఁదరంబె యేరికేన్.
గీ॥ అనుచుఁ గొనియాడి, చంద్రి ద ♦ ర్శనము వలన
నలరి వికసించు చెంగల్వ ♦ యట్టు లలరి
ఆననం బిచ్చి, పొగడి యు ♦ ల్లాసమునను
కనుల నానంద బాష్పంబు ♦ లను త్యజించి. 63
గీ॥ మలిన మెన్నఁడు నంటని ♦ మనువు లిచ్చి
తగుదు వని మార్పులేని సొం ♦ దర్య మొసఁగి;
గరుడిఁ జేరునె సర్పంబు? ♦ కాంత నిన్నుఁ
గలుష మంటునె? యీ రెండుఁ ♦ గలిగియున్న. 64
మ॥ అని దీవించి పతివ్రతా తిలకమా! ♦ యార్యా మహాదేవి చే
వినుతంబయ్యె భవచ్చరిత్ర మహామా! ♦ వేదోపమానంబుగా
వినుమా! నాథులు దల్లిదండ్రులుఁ బరుల్ ♦ ప్రేమంబునన్ గాంతలన్
ధనియం జేతురు వారి వారి కొలఁదిన్ ♦ ధర్మానుసారంబుగన్. 65
గీ॥ తన్ను మనసార ప్రేమించు ♦ చున్న విభుఁడు
పతి కవంత సౌఖ్యంబుల ♦ సంఘటింపఁ
బ్రాణనాథుని సేవింప ♦ నట్టి యాలు
ఆలుగా దామె స్త్రీలలో ♦ నధమురాలు. 66

గీ॥ నీతిపరులను, శూరుల, ♦ స్నేహితులను
ధర్మవిదుల్ గ్రాంథల విప ♦ త్కాలమునను
తగఁ బరీక్షింపఁదగు నందు ♦ తత్త్వవిదుల
కష్టవేళనే నతి నీతి ♦ స్పష్టమగును. 67

చ॥ మగఁడు దరిద్రుఁడైనఁ బులు ♦ మానిసి మ్రుసలి వృద్ధుఁడైన నె
న్నగఁ గడుఁ గుష్ఠుఁడైనఁ గతి ♦ నంబును దోసముఁ గల్గియుండినన్
మగటిమిలేనివాఁడయిన ♦ మందుఁడు మూర్ఖుఁడు కుష్ఠియైననున్
భగవ దనుగ్రహంబనెను ♦ భావనతో సతి సేవలో నన్సరలెన్.

చ॥ త్రికరణశుద్ధిగా మగఁడు ♦ దేవుఁడయంచు [illegible] వాని పా
ద కమల సేవయే పరమ ♦ ధర్మముగా మది నిశ్చయించు భా
మకుఁ దలపోయ నింకఁ బర ♦ మ వ్రతమున్న [illegible] యంతకున్న భా
వుకమగు కార్యమున్నె? బుధ ♦ పూజిత సద్గుణశీల! ధరాసుతా!

ఉ॥ ఎత్తటి లోకమందుఁ గల ♦ యెల్లరు స్త్రీలను [illegible] నాథుఁడే
చిత్తజ తుల్యుఁడంచుఁ దన ♦ చిత్తమునందున దలంచి, సేవకున్
దత్తఱపాటుబొంది, కుల ♦ ధర్మముఁ దప్పక [illegible] యు
త్తమోత్తమరా లనంగ భువి ♦ నొప్పగ నొప్పు [illegible] రాజిలున్.

క॥ పర పురుషులు సోదరు లని
పరునిం బాయక సుఖించు ♦ భామామణులే
ధర మధ్యమురా లనఁగన్
బరఁగున్ లోక జనయిత్రి! ♦ వసుధా పుత్రీ! 71

గీ॥ అవసరముఁబట్టి ధర్మ మా ♦ ర్గానుసరణి
స్వకుల భయమున వర్తించి ♦ భర్తఁ గొలిచి
ఆత్మ సౌఖ్యంబె పరమార్థ ♦ మనుచు నెంచు
నువిద నధమురా లని చెప్ప ♦ నొప్పు భువిని. 72

సీ॥ తనువు శాశ్వతమంచు ♦ మనువును నిరసించి
అఖిల భోగంబుల ♦ కాసపొంది

అగ్నిసాక్షిగఁ బెండ్లి ♦ యాడిన పతిఁ బాసి
యన్యులఁ గామించి ♦ వ్యభిచరించి
నిజ కులంబుఁ ద్యజించి ♦ నీతిని వర్జించి
యవమానమున కోర్చి ♦ వ్యవహరించి
ధర్మమార్గముఁ దప్పి ♦ తగవును విడనాడి
యర్థంబు నార్జింప ♦ నతి చరించి
గీ॥ బహు పతివ్రత యను ఖ్యాతిఁ ♦ బరిఢవిల్లు
రమణియే యధమాధము ♦ రా లనంగ
బరఁగి, తుదకు నారకలోక ♦ వాసమునను
అనుకొనఁగ రాని దుఃఖంబు ♦ లనుభవించు. 78

గీ॥ సతి పతివ్రతా ధర్మాను ♦ సరణి మెలఁగి
పరమగతి నొక్క తృటిలోనఁ ♦ బడయనోపుఁ
బతికిఁ బ్రతికూలగతి నేగు ♦ సతివ, విధవ
యగుఁ బున ర్జన్మమునను బా ♦ ల్యంబునంద. 74

క॥ నీ నామము స్మరియించిన
నే నారీమణియు భర్త ♦ నెడఁబాయక యె
చ్చోనైన సుఖించుఁ గదా
తా నేర్పు మెయిన్ బతి వ్ర ♦ తా ధర్మమునన్. 75

గీ॥ ధర్మములనెల్ల నెఱిఁగిన ♦ తల్లి వీవు
నీకు నేఁ జెప్ప వలఁతి నే ♦ లోకమాత!
నా యుపన్యాస మొక లక్ష ♦ ణంబు గాఁగ
లలనలకు నీదు చరితంబు ♦ లక్ష్యమగును. 76

గీ॥ అనిన ననసూయకున్ మ్రొక్కి ♦ యవనిజాత
రౌంతయున్ సంతసించె, న ♦ నంతరమున
మౌని చరణాబ్జములకు మ్రొక్కి ♦ జ్ఞాని వనుచు
వినయ మేపార వినుతించె ♦ వినతులుంచు. 77

ఉ॥ జ్ఞానివి నీకుఁ జెప్ప వలె ♦ నా పరమార్థము నిట్టి దంచు; నే
కానసమున్ గలట్టి విధి ♦ పొద్దువు, మోక్షము నీ యధీన మో
మానివరేణ్యా! నీ మనము ♦ మాయకుఁ జిక్కునే? యాదరించి నా
కానతియిండు, ఘోర విపి ♦ నాంతర సీమకుఁ బోయి వచ్చెదన్.

గీ॥ అనిన విని నవ్వి యవ్విప్రుఁ ♦ డనియె నిట్లు
దేవ! బ్రహ్మ మహేశాది ♦ దేవతలకు
మూలపురుషుండ వని జ్ఞాని ♦ బుద్ధి నెఱుఁగు;
జగతి నిష్కాముఁడవు దయా ♦ సాగరుఁడవు. 79

ఉ॥ ధర్మ ధురీణ! నీదు పద ♦ దాసుల దైన్యముఁ బాప భూస్థలిన్
గర్మముఁ జేయఁగాఁ దలఁచి ♦ కారణ జన్ముఁడవైతి; మాయయున్
మర్మములేని మానసము ♦ నన్ విహరించెద వింక నిన్ను నే
దుర్మతి సంస్మరించి భవ ♦ దోషముఁ బాపుకొనందు రాఘవా!

గీ॥ ఆద్యుఁడవు నీవు ననుఁ గాని ♦ యాదు టరయ
నాదు భాగ్యంబుగాదె య ♦ నాథ నాథ!
ఎట్టివాఁడవో దేవ! ని ♦ న్నెల్లవేళఁ
బాయకున్నది లక్ష్మి నీ ♦ ఛాయఁబోలి. 81

గీ॥ అంతటన్ విష్ణు రూపివై ♦ యలరు నీవు
వనమునకుఁ బోయి వత్తువే ♦ పరమపురుష!
మిథ్య యగు సృష్టిలో నీవు ♦ తథ్యముగను
సంచరించుచు నున్నావు ♦ సదయ హృదయ! 82

చ॥ అని వినుతించి బాష్ప సలి ♦ లావృత నేత్రయుగంబు మోడ్చి, నె
మ్మనమునఁ దోచు జ్ఞానమయ ♦ మంగళ విగ్రహ దర్శనంబుచే
ననిమిషదృష్టిఁ బొంది, విన ♦ తాననుఁడై పులకాంకి తాంగుఁడై
ముని తిలకుండు, వెండియుఁ బ్ర ♦ బుద్ధమతిన్ వినుతించె నీగతిన్.

గీ॥ "హృదయమునకు గుణముల కిం ♦ ద్రియములకును
జ్ఞానమునకు నతీతుఁడ ♦ వైన నిన్నుఁ

గాంచినాఁడ, నా భాగ్యంబు ♦ ఘనతరంబు,
పండె నా పూర్వపుణ్యంబు ♦ పరమ పురుష." 84

గీ॥ తపములు జపంబులును దాన ♦ ధర్మములును
భక్తిని లభించు సద్దాన ♦ ముక్తి గలుగుఁ
పార్వతీ వింటివే, యతి ♦ భక్తవరుఁడు
దాశరథిఁ గొల్చి యెంతయు ♦ ధన్యుఁడయ్యె 85

చ॥ కలియుగమందు భూజనుల ♦ కల్మషమున్ హరియించి, ముక్తికిన్
సులభపథంబుఁ జూపి, భవ ♦ శోకముఁ బాపును రామభక్తి; ని
ష్ఫలములు దానధర్మములు ♦ సద్వ్రతముల్ జపముల్ తపంబులున్
ఇలను సమస్తమున్ విడచి ♦ యెత్తఱి రామునిఁ గొల్వగా వలెన్.

గీ॥ రాముఁడే పర బ్రహ్మంబు ♦ రాఘవుండె
పరమపురుషుండు, బ్రహ్మాండ ♦ భాండ వితతి
రామమయ మటంచు నెవ్వాఁడు ♦ ప్రస్తుతించు
వాఁడె సరసుండుఁ జతురుండుఁ ♦ బండితుండు. 87

గీ॥ సర్వ ధర్మంబులఁ ద్యజించి ♦ శరణుఁ జొచ్చి
అన్యథా శరణంబు లే ♦ దని భజించు
భక్తవరునకు శ్రీ రామ ♦ భద్రు కరుణ
మంగళములెల్లఁ గరతలా ♦ మలకములగు. 88

—§ శ్రీ సీతా రామ లక్ష్మణుల వన ప్రయాణము §—

సీ॥ ఆ సత్యాచార నాయకుఁ ♦ డ మ్మునీంద్రు
పాద కమలంబులకు మ్రొక్కి ♦ బయలు వెడలె;
వారి యిరువుర నడుమ న ♦ వ్వనమునందు
వినత వదనయై జానకి ♦ వెడలుచుండె. 89

క॥ జీవాత్మకుఁ బరమాత్మకు
భావింపఁగ నడుమ మాయ ♦ వలెను విధానన్

దేవీ రత్నము జానకి
ఆ వీరుల నంటి నడుమ ♦ నరుగుచు నుండెన్. 90

గీ॥ వనములన్ జీవనదులను ♦ పర్వతముల
దాటి వడివడి వెడలి రా ♦ దాశరథులు;
జగతిఁగల సర్వ జంగమ ♦ స్థావరముల
నా చరాచర విభునకు ♦ నష్టు గలదె. 91

గీ॥ త్రిభువనకు నెండ సోఁకునన్ ♦ భయము దోప
ఛత్రముంబోలి మేఘుండు ♦ సంచరింప;
దేవ నిలయంబులను మించి ♦ తేజరిల్లు
నఖిల ఋష్యాశ్రమంబుల ♦ నరయుచుండిరి. 92

గీ॥ ఆశ్రమంబుల నలు దిక్కు ♦ లందు వఖిలు
పూగ పున్నాగ వృక్ష స ♦ మూహములను
సరస ఫలభరిత రసాల ♦ సాలములను
సకల సుమ లతా వితతుల ♦ చక్కఁదనము. 93

గీ॥ కంట నొకసారి నెవ్వైనఁ ♦ గాంచిరేని
అమరులకునైనఁ జిత్త వి ♦ భ్రమము వొడము;
అచట శ్రీరాము దర్శింప ♦ నఖిల మునులు
వచ్చుచున్ బోవుచుండిరి ♦ ప్రతి దినంబు. 94

గీ॥ ఆశ్రమంబులఁ గలయట్టి ♦ యఖిలమునులు
నచ్చటికి వచ్చి స్వస్తి వా ♦ క్యములఁ బలికి
ప్రకృతి సౌందర్యముంజూచి ♦ రాముఁజూచి
సొక్కి సోలిరి బ్రహ్మంబుఁ ♦ జూచినట్లు. 95

గీ॥ తులసి గల వేదికల తోడఁ ♦ జెలువు మిగులు
నాశ్రమంబుల వీక్షించి ♦ నంత నహహా!
జానకీ రామలక్ష్మణుల్ ♦ సంత సమున
వినతు లగుచుండిరి జన్మ సా ♦ వనము లనుచు. 96

గీ॥ మునులు తమతమ యాశ్రమం ♦ బులకు నెలమి
వారి మువ్వురఁ బిల్చి స ♦ గౌరవముగఁ
గందమూ లాది ఫలముల ♦ ముందుఁ బెట్టి
విందుఁ జేయుచుండి రా ♦ నంద మెసఁగ. 97

గీ॥ త్రోవ పొడువున పావన ♦ జీవులైన
మునుల యతిథి సత్కారంబు ♦ లనుభవించి
వారలకు మ్రొక్కి మువ్వురు ♦ బయలు వెడలి
నడచుచుండిరి ఘోర కాం ♦ తార వీధి. 98

గీ॥ వెలది! "అభ్యాగత స్స్వయం ♦ విష్ణు" వనెడు
ధర్మ మచ్చోట సిద్ధించెఁ ♦ దాపసులకు;
నెంతటి తపంబుఁ జేసిరో? ♦ యెఱుఁగఁ దరమె?
అమృతధాముండు శ్రీరాముఁ ♦ డతిథి యయ్యె. 99

ఉ॥ ధీరులు రామలక్ష్మణు ల ♦ధిజ్య శరాసనులై గమించుచున్
ఘోర వనాంతవీధి నొక ♦ కోసఁ గనుంగొని రంతటన్ నరా
హారమునన్ రహించు నొక ♦ వ్యాధుని భీతమదేభ యూధునిన్
క్రూరుని, విరాధునిన్ గ్రతు ని ♦ రోధుని, యోధు, జగద్విరోధునిన్.

సీ॥ సద్యో విఖండిత ♦ జన మాంస మండిత
దంష్ట్రలఁ బచ్చి ర ♦ క్తము స్రవింపఁ
పాషాణ నిర్మిత ♦ వక్షస్స్థ లంబున
మానవావళి రుండ ♦ మాల గ్రాలఁ
కఠిన కిల్బిష పంక ♦ కలుషిత మైనట్టి
కేల నాభీల త్రి ♦ శూల మమర
దుర్మాంస సంసక్త ♦ చర్మాన్విత స్థూల
కటి తటంబున దీర్ఘ ♦ ఖడ్గ మొప్ప,
గీ॥ రక్త సంసిక్త ముఖగహ్వ ♦ ర ప్రభూత
కహకహాధ్వని కఖిల ది ♦ గ్గజము లదరఁ

కాలునింబోలి, సంవర్త ♦ కాల మేఘ
మట్లు గర్జించె నపుడు దై ♦ త్యాధముండు. 101

కం॥ గర్జించి, యాజుఁ గఱచుచుఁ
దర్జించి, కఠోర కోప ♦ తా పాస్త్రి మిమున్
భర్జించి, సద్య శోధన
మార్జించెద నంచు వచ్చె ♦ నతి శీఘ్రముగన్. 102

ఉ॥ జన్య మొనర్పఁగాఁదగిన ♦ శౌర్యముఁగల్గిన శూరులైన సౌ
జన్యముఁదక్కఁ గిందు, ననుఁ♦ జంపి జయింపుఁడు, లేకయున్న మీ
కన్య నొసంగి పొండనుచు ♦ గర్వమునన్ జనుదెంచు దైత్యు గా
ర్జన్యముఁజూచి భీతిలి సు ♦ రల్ విలపించిరి రాముఁజూచుచున్.

గీ॥ సర్పమునుబోలి యతివేగ ♦ దర్పమునను
సరస కేతెంచి యట్టహా ♦ సంబుఁ జేసి
రాఘవులు చూచుచుండ నా ♦ రాక్షసుండు
సీత నవలీలఁ గొనిపోయెఁ ♦ జెడి నశింప. 104

చం॥ చకచకలీల సీతఁగొని ♦ చాల పథంబు నతిక్రమించి, వే
షోకదరినిల్చి వెన్దిరిగి ♦ యొంటరి తుంటరి, రాముఁజూచుచున్
బకబకనవ్వి "యోరినృప ♦ బాలక చాలక చూచుచుంటివే
వికలితచిత్త! మా,దనుజ ♦ వీరుల బింకమెఱుంగ నక్కటా!"

చం॥ ఇరువురునొక్కపంటికొన ♦ కేనియుఁ జాలరు, తృప్తిదీఱదీ
తరుణియొనాకుఁ జాలు;భుజ ♦ దర్పముఁజూపు దలంపుమాని మీ
పురమునకింకఁబొండు శిర ♦ ముల్ పయికెత్తక; తాకిరేని స
త్వరముగ మిమ్ముఁబట్టి కర,వాలమునన్ వధియింతు నిర్దయన్.

చం॥ అనవుఁడులక్ష్మణుండినకు ♦ లాధ్యుని రామునిఁజూచి యక్కటా
జనకతనూజకిట్టిగతి ♦ సంఘటిలెన్ పినతల్లి కోరికన్
వినుమని వెక్కివెక్కి విల ♦ పించి, శరంబుల వింటఁగూర్చి యా
ద్దనుజుపయిన్ త్యజించె వసు♦ధాసుతయుంచుక ధైర్యమొందఁగన్.

గీ॥ రాజకీరి, దుర్జాతి మా ♦ ర్జాల మొడిసి
పట్టి, ప్రాణంబు లెబ్బులి ♦ వాతఁ బడియె
ననుచు దుఃఖించి శ్రీరాముఁ ♦ డాగ్రహించి
ధనువుఁ గైకొనె దనుజుని ♦ తెనుపఁ దునుమ, 108

గీ॥ వింట సంధించి సౌమిత్రి ♦ విడిచినట్టి
ప్రదర ముదరంబుఁజొచ్చి యా ♦ వలకు వెడలి
నంత దైత్యుండు క్రోధి తా ♦ మ్రాక్షుఁ డగుచు
సీతను త్యజించి శూలంబు ♦ చేతఁ దాల్చి. 109

ఉ॥ ఓరి,నరాధమా! యహి కు ♦ లోత్తము వాలముఁద్రొక్కినట్లహం
కారమునన్ ననున్ జెనకఁ ♦ గాఁ బ్రదరంబుఁ బ్రయోగించినావె, నే
నోరువరాదు, కాచుకొనుఁ ♦ డుగ్ర రణంబున కోపహటింప కే
శూరు వధించి శాశ్వత య ♦ శోధనముస్ గొనుఁ డింతయేటికిన్.

ఉ॥ రండనియార్చి, శూలముఁగ ♦ రంబునఁ ద్రిప్పుచు, దండతాడితో
ద్దండ భుజంగమట్లు నిజ ♦ దర్పముఁజూపఁగ వచ్చినంత, మా
ర్తాండకులాబ్ధిసోముఁడగు ♦ రాముఁడు ఖండనభీముడై సురేం
ద్రుండు నుతింప నర్ధశశి ♦ రూపశరంబును వైచె నుగ్రుఁడై. 111

సీ॥ అతిదీర్ఘ పాదలో ♦ హస్తంభనిహతిని
గండశైలంబులు ♦ పిండిగాఁగ
పటు ధావనోద్భూత ♦ చటుల వాతాహతిన్
వృక్షసందోహంబు ♦ పెల్లగిల్లఁ
కర్ణకఠోరోగ్ర ♦ కహాకహా ధ్వనులకు
గండ భేరుండంబు ♦ బెండువడఁగ
ఆభీల కోలాహ ♦ లా కర్ణనంబున
సకల జీవులు సాధ్వ ♦ సమునఁ బొఱ.

ఆ॥ వె॥ శత సహస్ర వాయు ♦ సంవేగమునమీఱి
అరుగు దెంచినట్టి ♦ అసుర వరుఁడు

అర్ధచంద్ర మార్గ ♦ ణాహతి క్రొవ్వక
ఉక్కుఁదక్కి మడసె ♦ వెక్కసముగ. 112

గీ॥ భూభరంబైన జీవి తం ♦ బును త్యజించి
లే బరంబగు వాని క ♦ శేబరంబు
పర్వతముఁబోలి వసుధ పైఁ ♦ బడినయంత
నాదిశేషుని శిరంబు ♦ లణఁగి మణఁగె. 113

ఉ॥ ఔ దలరాలి కూలిన సు ♦ రారి శరీరమునుండి పావనం
బై దిశలన్ వెలుంగునొక ♦ యద్భుత తేజము నిర్గమించి, సీ
తాదయితున్ నుతించి పర ♦ దైవతమంచు భజించి భక్తిసం
పాదిత మోక్షమార్గమును ♦ బట్టి రహించెను శాశ్వతంబుగన్.

ఉ॥ పూర్వభవంబు నందితఁడు ♦ ముఖ్యతముండని చెప్పనొప్పు గం
ధర్వుఁడు, యక్షనాయకుఁడు ♦ తన్ను శపించిన యంత దైత్యుఁడై
యుర్విజనించి, యీగతి ర♦ఘూద్వహుఁదాకి గతించి, యవ్యయున్
సర్వమయున్ నుతించి, యభి ♦ శాపవిముక్తి నిబొందె మానినీ!

గీ॥ శస్త్రవహ్నియించి శవమును ♦ సంస్కరించి
శ్రీవరుఁడు వాని యస్థుల ♦ స్వీకరించి
త్ర్యక్షలిం బూన్చె, నిజయశ ♦ స్సౌధమునకు
శంకు స్థాపించెనో యన ♦ చందమునను. 116

గీ॥ రాముఁ డొనరించి నక్త్రి కా ♦ ర్యమును గాంచి
భాపి సమక జటెంసరా ♦ భవనమునకుఁ
పక్షము పోవాని ఖిదియఁచుఁ ♦ బ్రస్తుతించి
సంతసించెను దేవతా ♦ సంచయంబు. 117

చ॥ పిద్ధప రఘురాన్నహ్నంశు పృథ♦సుతఁ దొడ్కాని కాలచోదితం
బదియని నెమ్మనిన్ దలఁచి ♦ రోసజ సచ్చాటువాసి, కొండలన్
నదుల నతిక్రమించి పయి ♦ సంక్రమ మించుక దీటఁ బేద సం
పదఁగనినట్లు చూచె నిర ♦ ఘాంగు నభంగుఁ దపోనుషంగునిన్.

—§ దేవేంద్రుని ఆగమనము §—

సీ॥ దిననాథు రథమును ♦ ధిక్కరించు విధాన
సంబరంబున స్యందన ♦ సంబు వెలుఁగ
స్యందన సంబద్ధ ♦ చతుర తురంగముల్
వాయువేగంబునఁ ♦ బరువువాఱ
ధరణిని దాకక ♦ తిరుగుచుఁ జక్రంబు
లంతరిక్ష పథంబు ♦ ననుసరింపఁ
దన వైభవముఁ జూచి ♦ ధనదుఁ డీర్ష్యవహింప
నమర కాంతలు చామ ♦ రముల వీవ
గీ॥ "అహాహా! దేవేంద్ర వైభవం ♦ బనఁగ నిదియ"
అని నుతింప, రాముని జూడ ♦ నరుగుదెంచె
నతుల సౌభాగ్య మందిరుం ♦ డఖిల భువన
సుందరుండు నా నొప్పు పు ♦ రందరుండు. 119

ఉ॥ వచ్చిన దేవ వల్లభుని ♦ వైభవముం గని సీత కత్తఱిన్
జెచ్చెర సర్వమున్ దెలియఁ ♦ జేసెను గాని రఘూద్వహుం డతం
డచ్చటి కేల వచ్చెనో త ♦ దాశయమున్ వివరింప కెంతయున్
మెచ్చుకొనంగఁ జొచ్చె నుప ♦ మింపఁగరాని సురేంద్రు సంపదన్.

చ॥ సురపతి తేరుడిగ్గి, కడు ♦ సొంపుగ దోసిలియొగ్గి, జానకీ
వరుని పరాక్రమంబు బహు ♦ భంగుల సన్నుతిఁ జేసి, లోక భీ
కరుఁడని ఖ్యాతిఁగన్న దశ ♦ కంధరు నాగమమున్ రహస్య వై
ఖరి నెఱిఁగించి, వే సెలవుఁ ♦ గైకొనియేగె నొకింత తాల్మితో.

గీ॥ అమర విభునకుఁ దగురీతి ♦ నభయమిచ్చి
వెఱపు వల దంచు మెల్లఁగ ♦ వీడుకొల్పి
తనకొఱకు వేచికొనియున్న ♦ ధన్యుఁ గాంచె
నఘ తమ పతంగు శరభంగు ♦ నతి కృశాంగు. 122

క॥ శర భంగుఁడు నీలాంగుని
సురవర రిపు శృంగ భంగుఁ ♦ జూచినయంతన్
వరదా యని కర మరుదుగఁ
బురుషార్థము దక్కె ననుచు ♦ ముప్పొరఁ గొలిచెన్. 123
గీ॥ ముప్పురకును దర్భాసన ♦ ంబుల నమర్చి
దివ్య లని మెచ్చి భక్తి నా ♦ తిథ్య మిచ్చి
పావనుఁడ నైతి నే నంచుఁ ♦ బ్రస్తుతించి
ఇంపు పెంపార శరభంగుఁ ♦ డిట్టు లనియె. 124
ఉ॥ మామక భాగధేయ! శివ ♦ మానస మానస రాజహంస! శ్రీ
రామ నృపావతంస! ముని ♦ రాజ హృదంబుజ భృంగ! నీరద
శ్యామల కోమలాంగ! భవ ♦ దాగమమున్ విని వేచియుంటి నే
నీ మహిఁ బాసి బ్రహ్మకడ ♦ కేగఁ దలంచియు లోకపావనా!
చ॥ అనిశము నీల నీరద శు ♦ భాంగము మంగళ హేతువంచు ద
ర్శనము లభించునంచు నిను ♦ సంస్మరియించుచు వేచియుంటి, సా
ధనము లెఱుంగ దీనుఁడను ♦ దాశరథీ! యువశిష్ట హీనుఁడన్
తనువుఁద్యజింతు నిన్ మదిని ♦ ధ్యానమొనర్చుచు; నాదరింపవే?
చ॥ అని చితిఁబేర్చి రాముని ప ♦ దాబ్జ యుగంబుస్మరించి, జన్మ పా
వన మని సర్వ సంగములఁ ♦ బాసి, మదీయ హృదంతరంబునం
దనిశమునిల్చియుండు మన ♦ ఘా! యనిమ్రొక్కుచు యోగవహ్ని చేఁ
దనువు దహించె, సన్మునులు ♦ ధన్యతముం డని సన్నుతింపగన్.
గీ॥ రాము కరుణను వైకుంఠ ♦ ధామమునకుఁ
జనిన శరభంగు నాత్మకు ♦ శాంతి గలిగె
నెల్ల ఋషివర్యు లచ్చటి ♦ కేగుదెంచి
ప్రస్తుతించిరి జానకీ ♦ ప్రాణ విభుని. 128
గీ॥ అంత రాముండు ఋషివర్యు ♦ లనుగమింపఁ
దనదు పయనంబు సాగించె ♦ వనమునందు;

త్రోసిన పాదమున [illegible] హర్షమున జూచి
ఋషివరులఁ జూచి పల్కెఁ [illegible] 129

కం॥ విని యా ఋషులున్ మునులున్
కనులన్ గన్నీరు గులుకఁగఁ • గని యి ట్లని రో
యనఘా! మునులన్ దనుజుల్
తినఁగా శేషించెఁ గుప్ప • లెప్పుల నెముకల్. 130

గీ॥ అనిన విని రాముఁ డెంతయు • నాగ్రహించి
ఊర్ధ్వబాహుఁడై "దైత్యుల • యుక్కణంచి
వసుధఁ బ్రోచెద భీతిల్ల • వలవ" దనుచు
నఖిల ఋషులకు మునులకు • నభయ మొసఁగె. 131

—§ సుతీక్ష్ణుఁడు §—

చ॥ ఘనుఁడు సుతీక్ష్ణుఁడన్ముని య • గస్త్యుని శిష్యుఁడు, రామభక్తుఁడై
అనిశము జానకీధవ ప • దాబ్జ మరందముఁ గ్రోలి సోలు, నె
మ్మనమున నన్యదేవతల • మాటఁ, దలంపఁడు నేడు రాముఁ డ
వ్వనమ్మున కేగుదెంచె నను • వార్త వినెన్ మది యుల్లసిల్లఁగన్.

ఉ॥ ద్విగుణిత లేచి లోఁ దనివి • దీఱఁగ రాముని సంస్మరించి, మై
గగ్గురుపాటుఁ జెంది, సము • ఖంబున రాముని జూచినట్లు లో
నగ్గలమైన భక్తి నయ • నాంబుజముల్ వికసింపఁ జేసి "నే
దగ్గఱ కేగువాఁడ" నని • తారసిలెన్ దన వృక్షరాజమున్. 133

ఆ॥ "సత్యసంధు సకల • సద్గుణమణి సింధు
దీనబంధుఁ జూచి • తృప్తిదీఱ
సన్నుతింతు" ననుచుఁ • గన్నుల ముకుళించి
పాడి యాడె నతుల • భక్తితోడ. 135

శా॥ ఎవ్వేళన్ నిను సంస్మరింతు నితరం • బేనాడు సేవింప, నే
నువ్విళ్లూరుచునుంటి నిన్నుఁ గనఁగా • నో స్వామి రావేమి, నన్

అవ్వన్ బెట్టక యేగుదెంచి కరుణన్ ♦ రక్షింపుమా యంచుఁ దా
నవ్వన్, దాండవమాడు. నేఁడు, గనులన్♦గన్నీరు మున్నీరుగా.

శా॥ "సీతన్ లక్ష్మణుఁ గూడి వచ్చిన ఘనున్ ♦ శ్రీరాము దర్శింప మ
చ్చేతం బెంతయు సంభ్రమించెడుఁ గదే♦చేకూరునే భాగ్య మో
హో తాల్మిన్ వహియింపుమా హృదయమా♦యొక్కమ్మడిన్ లోకని
ర్మాతన్ జూచి తరింప శక్యమగునే ♦ ప్రారబ్ధ మెట్లున్నదో? 135

మ॥ త్రిదశుల్ మెచ్చినభంగి, నిన్ గొలువ భ ♦ క్తి జ్ఞాన వైరాగ్య సం
పద యేవంతయులేదు, యోగమొనరిం♦పన్ శక్తియున్ లేదు, నిన్
హృదిదర్శింపఁగ యోగమార్గమెఱుఁగన్♦నిన్నాశ్రయింతున్ త్యజిం
చెద సర్వంబుఁ బ్రతిజ్ఞనిల్పుకొనుమా♦శ్రీరామ ప్రేమింపుమా.

—§ సుతీక్ష్ణ ముని కృత శ్రీరామ స్తుతి §—

శ్రీమ దయోధ్యా సేవిత రామ
భక్తజనావన పావన రామ
మాయాతీత! యమానుష రామ
మాయా కల్పిత మానవ రామ
శంకర సన్నుత జనవర రామ
ప్రాణప్రద వర పద నఖ రామ
సంతత స న్మునిజన సఖ రామ
కౌసల్యా సుఖ కారణ రామ
దానవ మర్దన దశరథ రామ
అభయద సచ్చరితామృత రామ
కాననవాస వికాసిత రామ
భీకర సంగర భీమా రామ
సూరి కులాంబుధి సోమా రామ
తత గుణమణి గణ ధామా రామ
నరహరి కవినుత నామా రామ

రామ రామ శ్రీ రామా రామ
రామ రామ జయ రాఘవ రామ. 137

మ॥ అనుచున్ నవ్వుచు నాట్యమాడుచు మదిన్ ♦ ధ్యానించుచున్ బాడుచున్
గనులన్ బాష్పములన్ ద్యజించుచుఁ గడున్ ♦ ఘర్మాంబువుల్ గ్రమ్మఁగన్ ।
తను సీమన్బులకాంకురంబు లెసఁగన్ ♦ ధన్యోస్మి ధన్యోస్మి యం
చు నుతించెన్రఘురామచంద్రునిసుతీ♦క్ష్ణుండెంతయున్ భక్తితో.

ఉ॥ ఎంతటి పాతకుండయిన ♦ నెంతటి దుర్జనుఁడైన రామునిన్
స్వాంతమునన్స్మరించి యని ♦ శంబుభజించెడువాఁడు, జానకీ
కాంతునకున్బ్రియుండయిను♦ఖంబులఁగాంచి రహించు,మానులే
కాంతమునన్ భజించుటకుఁ ♦ గారణమియ్యది యింతయే టికిన్.

గీ॥ జపతపంబులఁదపియించి ♦ సంతతంబు
ధ్యానముంజేసినన్ మౌని ♦ కందరాని
రామ పాదారవింద మ ♦ రంద ధార
భక్తి మాత్రింబునలభించు ♦ ముక్తిఁగూర్చు. 140

సీ॥ సకల భూతములందు ♦ సమహిత మతిఁగల్గి
సాత్త్విక పథమునఁ ♦ జనెడువాఁడు
జ్ఞానవృద్ధుల కంగ ♦ సంరక్షకుండయి
చిత్తానుగతి సేవఁ ♦ జేయువాఁడు
తాఁబోవు పథమునఁ ♦ దగుణులఁ బొడఁగన్నఁ
బురుషులఁ గనినట్టు ♦ లరయువాఁడు
జీవకారుణ్యంబు ♦ శ్రేష్ఠ ధర్మంబంచు
నార్తులఁగాపాడ ♦ నరుగువాఁడు

గీ॥ అనృత మెన్నండుఁ బలుకని ♦ యట్టివాఁడు
చెలఁగి ధర్మంబుఁదప్పక ♦ మెలఁగువాఁడు

సర్వసోదర భావంబు ♦ జరపువాఁడు
అనఘుఁడు మునీంద్రుఁడు సుతీక్ష్ణుఁ ♦ డనెడువాఁడు. 142

సీ॥ అఖిలచరాచర ♦ వ్యాప్త ప్రపంచంబు
బ్రహ్మమయంబంచు ♦ బ్రస్తుతించుఁ
బరిపక్వ ఫలముల ♦ భక్షించి యహహా రా
మ బ్రహ్మకృపయంచు ♦ మతిఁదలంచు
సంగవిరక్తు లౌ ♦ సద్భక్తులకు మ్రొక్కి
ధన్యోస్మియని లోనఁ ♦ దనివిఁగాంచు
మాంసభుక్కులొనర్చు ♦ హింసలఁ దలపెట్టి
యెంత యక్రమమంచు ♦ నేవగించు

గీ॥ రామభక్తియె ప్రాజ్య సా ♦ మ్రాజ్య మంచు
సతముఁ దన్మయత్వంబున ♦ సంచరించు
జ్ఞానులకు మానులకు గుఱి ♦ యైనవాఁడు
అనఘుఁడు మునీంద్రుఁడు సుతీక్ష్ణుఁ ♦ డనెడువాఁడు. 143

సీ॥ సృష్టియంతయుఁజూడ ♦ శ్రీరామమయమంచు
మాటిమాటికి మేను ♦ మఱచువాని
దిగ్భ్రమంబునుబొంది ♦ దిక్కులఁదెలియక
యానందమయవార్ధి ♦ నలరువాని
తన్మయత్వంబునఁ ♦ దన తెన్నుగానక
యడుఁగులఁదబ్బిబ్బు ♦ పడెడువాని
పూర్వపశ్చాద్భాగ ♦ ములచొప్పుఁజూడక
యటునిటుఁ దిరుగుచు ♦ నాడువాని

గీ॥ ఆత్మవత్సర్వ భూతాని ♦ యను మతంబు
ఇలను మూర్తిభవించిన ♦ ట్లె సఁగువాని
భూరుహాముపొంత రాముండు ♦ పొంచిచూచి
అతని హృదయంబునందుఁ బ్ర ♦ త్యక్షమయ్యె. 144

ఆ॥వె॥ భావవీథిఁ దోఁచు ♦ బ్రహ్మాంబు వీక్షించి
చతికిలఁబడె నోడలు ♦ జలదరింప;
ముండ్లఁబోలినట్టి ♦ పులకాంకురములతోఁ
బనసపండుఁబోలె ♦ మునివరుండు 145

చం॥నిరుపమమైన రూపముఁగ ♦ నీనికలన్ జెదరంగ నీక తా
నరసి శరీరమున్ మఱచి ♦ యమ్మునివర్యుఁడు భక్తి పెంపునన్
పరవశుఁడయ్యె; నప్పతిత ♦ పావనమూర్తి తదీయభక్తి సు
స్థిరమనిమున్ను నిల్చెఁబ్రిక్క ♦ తిన్ దనయాకృతి తేజరిల్లఁగన్.

గీ॥ ప్రణత దుఃఖహారుఁడు దీన ♦ రక్షకుండు
పద్మనేత్రుండు దారిద్ర్య ♦ భంజనుండు
మున్ను ప్రత్యక్షముగనిల్చి ♦ మునిని బిల్చి
మేలుమేలింక లెమ్మని ♦ మేలు కొలిపె. 147

గీ॥ ధ్యానసుఖమున మునివర్యుఁ ♦ డాదమఱచి
కొంతకాలంబుదనుక మే ♦ ల్కొనక తుదకు
సకల బహిరంతర ప్రదే ♦ శముల వెలుఁగు
విశ్వరూపంబు వీక్షించె ♦ విస్మయమున. 148

కం॥కనియె మునీంద్రుఁడు ఖండిత
దనుజాటోపము హృతభవ ♦ తాపము జ్ఞానాం
జనదీపము హతపాపము
మునినన్నుత విశ్వరూప ♦ మును కట్టెదురన్. 149

సీ॥ సద్భక్త జనకల్ప ♦ శాఖులై వరముల
నొసఁగెడువ్రాల్గు బా ♦ హువులతోడ
మేఘంబుపైఁగ్రాలు ♦ మెఱపన నెమ్మేన
భాసిల్లు పసిఁడి దు ♦ వ్వలువ తోడ
బండువెన్నెలసీను ♦ నిండు క్రొన్నెలఁబోలి
ముద్దుఁగుల్కెడునవ్వు ♦ మొగముతోడ

ధర్మక్షమా దయా ♦ దాక్షిణ్య గుణమణి
ఖను లనందగు గొప్ప ♦ కనులతోడ

గీ॥ సీతయును లక్ష్మణుండును ♦ చెంతనిలువ
నఖిలజగతినిఁగాపు బ్రహ్మాంబుఁగాంచి
తన్మయత్వంబుఁబొంది పా ♦ దములఁ బడిరె
నంబరమునుండి పుష్ప వ ♦ ర్షంబు గురిసె. 149

ఉ॥ కమ్మనిగాలి వీచె సుర ♦ కాంతలు పాటలఁబాడి యాడిరా
పిమ్మటజానకీ వరుఁడు ♦ ప్రీతిమెయిన్ మునిలేవఁదీసి ప్రే
మమ్మునఁగౌఁగిలింపఁగ, ద ♦ మాలముస్వర్ణలతన్ రహించు చం
దమ్మునఁజూడ సొంపుగఁద ♦నర్చెను రేందుడు తల్లడిల్లఁగన్. 150

చం॥ తనపదవిన్ మునీంద్రునకుఁ ♦ దప్పక దానమొసంగు నంచున
య్యనిమిషనాథుఁడత్తటి భ♦ యంపడెనెంతయు రాముఁజూచి;యే
మనఁదగుఁ దుచ్ఛభోగపరుఁ ♦డట్టి భయంబును బొందు టబ్రమే?
ఘనుఁడగు రామభక్తునకుఁ ♦ గావలె నే విషయైక భోగముల్ 151

చం॥ మునివరుఁడంతఁ జిత్తరువు ♦ పోలికఁ జేష్టలఁదక్కి-యానిమై
అనిమిషదృష్టిఁగొందనుక ♦ నారఘురాము ముఖాంబుజాతమున్
గనుఁగొనిపిమ్మటన్ దెలివిఁ ♦ గాంచి మనంబునఁ దాల్మిఁబూని,నా
మనవినొకించు కంత వినుమా ♦ యని యిట్లు వచించెభక్తితో॥ 152

గీ॥ స్వామి! మతిహీనుడను నిన్ను ♦ సన్నుతింప
వశమె? నీదు ప్రభావ మ ♦ పారవార్ధి
నీయెదుటనాదు జ్ఞానంబు ♦ నెగడలేదు
ద్యుమణి ముందఱఁ దోచుఖ ♦ ద్యోతమట్లు. 153

గీ॥ శ్యామ తామరసస్తోమ ♦ సమ శరీర
భూరి శరచాప తూణీర! ♦ మునివిహార

మాహృదయచోర! వరజటా ♦ మకుటభార
వినతిఁ గైకొమ్ము శ్రీరఘు ♦ వీర! ధీర. 154

సీ॥ సద్భక్తమునిజన ♦ జలజకాననభాను!
భయదకామక్రోధ ♦ వనకృశాను!
గర్వితాసురయోధ ♦ కరియూధ మృగరాజ!
విబుధలోకావన ♦ విబుధ భూజ!
భక్తివిచ్ఛేదిత ♦ భవవిషాద నిషాద!
విదళిత సురనాథ ♦ హృదయఖేద!
త్వత్సుతామానస ♦ మానస కలహంస!
హంస వంశనృపాల ♦ కావతంస!

గీ॥ జీవకారుణ్య! అరుణరా ♦ జీవనయన!
చిత్కళాభూష! నరవేష! ♦ శేషశయన!
విబుధవినుత వేదవినోద! ♦ వినతవేధ
పరిస్తుతించెదనిన్నుఁ గృ ♦ పావరూధ. 155

సీ॥ సగుణ నిర్గుణరూప! ♦ సన్నుత వరభూప!
సకలరూపాపాప! ♦ సత్ప్రతాప!
జ్ఞానగిరాతీత! ♦ సర్వ జగన్నేత!
జీవసృష్టివిధాత! ♦ చిత్ప్రపూత!
శివనుత సంగ్రామ! ♦ జితభూవరస్తోమ!
జ్ఞానికల్పారామ! ♦ సార్వభౌమ
కలివిభంజననామ ♦ ఘనభుజబలధామ!
ధర్మగుణగ్రామ! ♦ కర్మకామ.

గీ॥ పతితపావన దినకర ♦ వంశకేతు
దుష్టదానవ రాట్కుల ♦ ధూమకేతు
పాపపంకిల సంసార ♦ వార్ధిసేతు
పరమపదహేతు! నిన్ను నేఁ ♦ బ్రణుతిసేతు 156

గీ॥ సకల సజ్జన స్వాంతని ♦ శాంతవాసి
అనఘ! నీదు నంతేవాసి ♦ నైన నాకు
నీకు నడుమ నెంతేవాసి ♦ లేకయున్న
నంతియేవాసి, యన్యంబు ♦ నభిలషింప॥ 157

గీ॥ స్వామి! నీవ యంతర్యామి ♦ వేమినాదు
భాగ్యమహహా! చేకూరెనీ ♦ పాదసేవ
అనిశము మెలంగు మీా హృద ♦ యాలయమున
బుణ్యగుణశీల! యోంకార ♦ మురళిలోల. 158

గీ॥ అఖిలజీవులు నీదు మా ♦ యావశాత్మ
లో కృపావార్ధి నీకుఁ బ్రి ♦ యుండనైన
ధన్యుఁడను, నీదు పదభక్తి ♦ దక్కనితర
సేవలంగోరఁ గలనైన ♦ దేవ దేవ. 158

చ॥ అని ముని భక్తియుట్టిపడు ♦ నట్టులఁబల్కిన యట్టిపల్కులన్
విని యెనలేని కూర్మిరఘు ♦ వీరుఁడు మేలని కౌఁగిలించి యో
యనుపమభక్తశేఖర! ప్రి ♦ యంబుగనుండు వరంబు గోరుమి
త్తుననిన, నమ్మునీశ్వరుఁడు ♦ దోసిలియొగ్గి ప్రపత్తి దోపగన్ 160

ఉ॥ "కూరిమిఁగోరఁగాఁ దగిన ♦ కోరికబుద్ధికిఁ దోచకుండెనే
కోరికఁ గోరగా దగునొ ♦ కోరియొసంగుము నీవయన్న" నం
భోరుహనేత్రుఁ డిట్లనె "బ్రి ♦ సిద్ధుఁడవాదు వఖండభక్తియున్
ధీరులు మెచ్చు జ్ఞానమును ♦ నీకు నొసంగితి భక్తశేఖరా." 161

చం॥ అనవిని దేవ! నీవొసఁగి ♦ నట్టివి నాకు లభించుఁగాని నా
మనవిని యాలకించి మము ♦ మానసవీధి ధనుర్ధరుండవై
వనజదళస్థ భృంగమను ♦ భాతిని తమ్మునితోడ సీతతో
ననిశము సంచరింపు మన ♦ ఘా! యదియే పదివేలు నాకిఁకన్.162

గీ॥ అనిన విని తథాస్తనిమునిఁ ♦ దనియఁ జేసి
భద్రముగ నుండుమని రామ ♦ భంద్రుఁడపుడు

ఘనతపస్వి దేజస్వియన ♦ గస్త్యుఁ జూడ
వెడలుచుండ సుతీక్ష్ణుండు ♦ వెంబడించి. 163

గీ॥ "అనఘ! మఱియొండు విన్నప ♦ మాలకింపు
మ య్యగస్త్యుండు మద్గురు ♦ వతనిఁ జూచి
చాలకాలంబు గతియించె ♦ సమ్మతించి
ఆజ్ఞయిచ్చిన వత్తు ని ♦ న్ననుగమించి" 164

మ॥ అని శ్రీరాముని సమ్మతింబడసి బ్రి ♦ హ్మానంద సంధాయినా
కనుకూలంబుగ వచ్చెఁగా యితని పా ♦ దాబ్జద్వయిన్ గొల్వజా
లిన భక్తుండు ఘనుండు, దుస్తర భ ♦ వక్లేశంబు లేశంబుఁ బొం
దనిధన్యుండని వెంబడించెను మదిన్ ♦ ధ్యానించుచున్ రామునిన్ 165

గీ॥ జానకియె తల్లి రాముండు ♦ తండ్రియనుచు
లక్ష్మణుడు తమ్ముఁడనుచు వి ♦ లక్షణముగ
నాడుచున్ బాడుచున్ నవ్వు ♦ చరుగుదెంచు
భక్తవరుఁడొక్క బాలుని ♦ పగిదిఁ దోచె. 166

గీ॥ భక్తవరుతోడ ముగ్గురు ♦ బయలు వెడలి
లతల ఫలవృక్షములను గు ♦ ల్మములఁ గనుచు
బుట్టలన్ గట్టలనుదాటి ♦ కట్టకడకు ..
నెదుర బ్రవహించు నొకజీవ ♦ నదినిగనిరి. 166

ఉ॥ అల్లలనాడు వల్లరుల ♦ నంబుకణంబులఁ దెచ్చి చల్లి, త
త్పల్లలిత ప్రసూనముల ♦ సౌరభమెల్ల గ్రహించి, మెల్లఁగా
నుల్లములెల్ల రంజిలఁగ ♦ నుష్ణకరోద్భవ తాపమారఁగాఁ
జల్లని మారుతంబొలసె ♦ జానకి యెంతయు నుల్లసిల్లఁగన్ 168

గీ॥ జలజ సంభవు కరుణార ♦ సంబుఁ బోలు
నంబువులతోడఁ బ్రవహించు ♦ నాస్రవంతి
అచటికేతెంచు నలువుర ♦ నాదరింప
వాయుదేవుని ముందుఁగా ♦ బంపెనేమొ. 269

చం॥ సురుచిర సస్యరాజినికర ♦ శోభితమై వివిధప్రసూనవ
ల్లరులకు వృక్షకోటికి ఫ ♦ లంబులకున్ గృహమై తరంగిణీ
పరిసరమందు నెత్తయిన ♦ పర్వతమొండు రహించు, జూడఁ ద
ద్ధరణిధరంబు నీకుఁబిన ♦ తండ్రియనందగియుండుఁ బార్వతీ. 170

మ॥ దురవాపంబయి యంధకారమయమై ♦ దుర్జ్ఞేయమై, మృత్యుభీ
కరమై మార్గము దుర్గమంబయిన వీఁ ♦ కన్ జొచ్చినన్ జాల సుం
దరమై యోగి నివాస యోగ్యమని ప్ర ♦ స్తావింపఁగా నొప్పకం
దర బృందంబు ధరా ధరాంతరమునన్ ♦ వర్తిల్లుగూఢంబుగన్. 171

చం॥ పరిసర పక్కణంబులకుఁ ♦ బర్విడి యావుల లేళ్ల మేకలన్
ఖరనఖరంబులన్ దునిమి ♦ కందరసీమలఁబెట్టిమెక్కి భా
స్కరుఁడపరాబ్ధిఁ గ్రుంకుతఱి ♦ జంతుచయంబు క్రమంబుగన్ తృషా
తురతఁ దరంగిణీవిమల ♦ తోయములానఁగ వచ్చునిచ్చలున్. 172

గీ॥ ధరణి ధరమున రమ్య కం ♦ దరము లున్నఁ
దాము నివసింపఁ దగిన కం ♦ దరలఁ దక్క
యోగు లుండెడు నెలవుల ♦ కేగ వెపుడు
ఘాతుక మృగంబుల కెవండు ♦ నీతిఁ దెలిపె. 173

గీ॥ వాహినీ పక్షి కలకల ♦ ధ్వనుల కలరి
పర్వతముఁ గాంచి త ద్వైభ ♦ వంబు మెచ్చి
నదికి న ప్పర్వతమునకు ♦ నడుమ వఱలు
వనము వీక్షించి హర్షించె ♦ జనకపుత్రి. 174

ఉ॥ "ఈ వనవాటిలోఁ గల మ ♦ హీరుహ కోటి కెవండు నీరమున్
జేవ దలిర్పఁ బోసె? గృహ ♦ సీమల నున్న మహీరుహాళి ని
ర్జీవములై నశించు జల ♦ సేచన మొంతయు లేక యుండినన్
దైవము విశ్వసించిన న ♦ నాథుల కెందు సహాయముంచునే. 175

గీ॥ ప్రకృతి కరుణారసంబున ♦ వఱలు వృక్ష
మింట జల మొంతపోసిన ♦ నెసఁగఁ గలదె?

తల్లిపాలకు వర్ధిల్లఁ ♦ దగిన శిశువు
పోతపాలకు నభివృద్ధిఁ ♦ బొందఁగలదె? 176

గీ॥ అనిన భూపుత్రిఁ గాంచి యా ♦ నని హసించి
రామచంద్రుండు త ద్వన ♦ సీమఁ జొచ్చి
అతుల ఫల పుష్ప భూమిరు ♦ హాశ్రియంబు
నాశ్రమంబును వీక్షించె ♦ విశ్రమింప. 177

గీ॥ జలచరములు భూచరములు ♦ సహజ వైర
భావములఁ బాసి మైత్రితో ♦ వఱలుచుంట
సిద్ధులు మునీశ్వరులు తప ♦ స్సిద్ధి కొఱకుఁ
దపముఁ జేయుటఁ జూచి రా ♦ దాశరథులు. 178

గీ॥ పక్షులు మృగంబులున్ నైజ ♦ వైర ముడిగి
కలువుఁగోలుఁదనంబునఁ ♦ గలసి మెలసి
మెలఁగుచుండంగ సీతయు ♦ మేదినీశు
పుత్రులుం గాంచి రెనలేని ♦ మోదమునను. 179

సీ॥ తన పెంటి నెడఁబాసి ♦ వనటఁ దూలిన లేడి
నోదార్పఁగాఁ బోయె ♦ నొక్క వ్యాఘ్రి
కందర నాకటఁ ♦ గుందు బెబ్బులికూన
కడ కేగి పాలిచ్చె ♦ గంగిగోవు
అంగదం గ్రుంగిన ♦ సింగపుఁ గొదమను
పాలించి లాలించె ♦ భద్ర గజము
పొదలలో గ్రుడ్లులఁ ♦ బొదువు పక్షినిఁ బ్రోవఁ
జనుదెంచె మేఁతతో ♦ సాళువంబు

గీ॥ "ఆత్మవత్సర్వ భూతాని" ♦ యనుచు నొక్క
భూజ శాఖపై భాషించె ♦ రాజకీరి
పరమ పావనమైన య ♦ వ్వనముఁ గాంచి
రాముఁ డెంతయు హర్షించి ♦ ప్రస్తుతించె. 180

గీ॥ అంతట సుతీక్ష్ణుఁ డిది యగ ♦ స్త్యాశ్రమంబు
అధిప! యిట నధ్వగ శ్రమ ♦ మపనయింప
నర్హమగు నని ముందుగా ♦ నరిగి యొజ్జ
కెఱిఁగి యెఱిఁగించె శ్రీరాము ♦ నెఱిఁగినంత. 18

మ॥ నెనరొప్పార నగస్త్యమౌని తన యం ♦ తేవాసి వాక్యంబులన్
విని శీఘ్రంబుగ లేచి తా నెదురుగా ♦ వేంచేసి శిష్యుండు త
న్ననువర్తింపఁగ రామలక్ష్మణుల మా ♦ యాతీతులన్ జూచి హా
యని నేత్రంబుల మోడ్చి మైమఱచి లో ♦ ధ్యానించె నిచ్ఛాగతిన్

గీ॥ రామ లక్ష్మణు లతని చ ♦ రణములఁ బడి
మ్రొక్కినంతనె యిరువుర ♦ నొక్కసారి
కౌఁగిటం జేర్చి దీవించి ♦ గౌరవించి
యాశ్రమమునకుఁ గొంపోయి ♦ యాసనముల. 183

గీ॥ రండు రం డని ముగురఁ గూ ♦ ర్చుండఁ బెట్టి
అతిథి సత్కార విధుల స ♦ మాచరించి
ఏమి నా భాగ్యమని మౌని ♦ రాముఁ జూచి
ఆత్మ నుప్పొంగె ధన్యుండ ♦ నైతి ననుచు. 184

చ॥ మునుల సమాజమందు రఘు ♦ పుంగవుఁ డెంతయు సంతసించె, న
మ్మునులును జానకీవిభుని ♦ మోమును జూచి శరత్కళానిధిన్
గనిన చకోర సంచయము ♦ కైవడిఁ బెన్నిధిఁగన్న పేద ల
ట్లనిమిష దృక్కులం బఱపి ♦ రల్లన నుల్లము లుల్లసిల్లఁగన్. 185

గీ॥ స్వాతివానలోఁ జినుకుల ♦ ఁబ్రీతిఁ గ్రోలి
సంతసించిన చాతక ♦ చయము భంగి
మునులు హర్షాంబునిధిఁ దేలి ♦ మునుఁగుచుండ
న య్యగస్త్యునిఁ గని రాముఁ ♦ డనియె నిట్లు. 186

చ॥ వినుము మునీంద్ర! రాజపద ♦ విన్ తృణతుల్యముగాఁ ద్యజించి, మ
జ్జనకుని సత్యవాక్యమును ♦ జక్కఁగఁ బాలనసేయ, గోవులన్

మునులను సాధు విప్రులను ♦ బ్రోవఁగ రాక్షస వంశనాశమున్
బూనరుప నేగుదెంచితిమి ♦ భూరి వనాంతరసీమ కీగతిన్. 187

చ॥ ఎఱుఁగనివాఁడవే? తెలుప ♦ నేటికి సర్వ మెఱుఁగుదీవు, నీ
యెఱుకకు సాటి యుద్ది యని ♦ యెవ్వని కేని వచింపనౌనె? చి
చ్చఱ పిడుఁగుల్ పయింబడిన♦చాడ్పునఁ జంపఁగవచ్చు దైత్యులన్
కఱకఱ దుంచి తత్కులము ♦ గండడఁగింప నుపాయమున్న దే?

గీ॥ ఇంక భయమేల? హేమంత ♦ ఋతువునందు
కమల వని మాడి నశియించు ♦ కరణి నేడు
శిష్టజనులను మునుల ద్వే ♦ షించి చెలఁగు
చెనఁటి రక్కసి కొలము న ♦ శింపవలయు. 189

గీ॥ అసురులనె గాక వారి స్నే ♦ హమున మెలఁగు
దుష్టు నైనను లోకైక ♦ శిష్టు నైనఁ
గూల్చి చీల్చెద, సభయంబుఁ ♦ గోరి నన్ను
నాశ్రయించిన రిపునైన ♦ నాదరింతు. 190

గీ॥ శక్తిఁగలిగియు దుష్ట రా ♦ క్షసులతోడి
స్నేహవశమునఁ దా నుదా ♦ సీనుఁడగుచు
ధర్మమును విస్మరించిన ♦ దండి మగని
దొలుత వధియించి పిదప నై ♦ త్యుల వధింతు. 191

గీ॥ జ్ఞానివి త్రికాలవేదివి ♦ స న్మునీంద్ర!
ఉర్విఁగల యెల్ల విబుధుల ♦ కొజ్జవగుదు
వీ వెఱుంగని ధర్మంబు ♦ లెందు లేవు
అనుమతింపుము దయయుంచి ♦ యానతిమ్ము. 192

చ॥ అనిన నగస్త్యమౌని "పర ♦ మాత్మున కే నెఱిఁగించు వాఁడనే?
నను వినుతింప నీకుఁ దగు♦నా? నినుఁగొల్చి భవ త్ప్రభావమున్
అనిశము సంస్మరించి యిసు♦మంత గ్రహించితి జ్ఞానమార్గమున్
అనఘ! సమస్తలోకముల ♦ కాద్యుఁడ వే మని సన్నుతించెనన్.

గీ॥ అఖిల సృష్టికి నాద్యుండ ♦ వైన నిన్ను
నెఱుఁగుదునో లేక యెఱుఁగనో ♦ యీవ యెఱుఁగు
దే నెఱింగిన దిది యని ♦ యెట్లు తెలియఁ
జేయ వలయునో యెఱుఁగ నీ ♦ మాయవలన. 194

గీ॥ మాయ నీ దివ్య పాద ప ♦ ద్మములఁ గొల్చి
అనిశమున్ వేచియుండు నీ ♦ యాజ్ఞకొఱకు
దేవ! బ్రహ్మ మహేశాది ♦ దేవతలను
సిద్ధమునుల నీ మాయ సృ ♦ జించెఁ జూవె. 195

గీ॥ జీవతతికి నీ మాయ య ♦ జేయురాలు
ప్రకృతి యంతయు మాయా ప్ర ♦ భావ మయము
నే నెఱింగినది వచింతు ♦ నీ వొకఁడవ
మాయకుం జిక్కనట్టి య ♦ మాయికుఁడవు. 196

గీ॥ మాయ యను మహోదుంబర ♦ త్రాజమునకు
ఫలములై యుండు బ్రహ్మాండ ♦ భాండ వితతి
అనఘ! బ్రహ్మాండ భాండంబు ♦ లనఁగ నేమి?
తలఁప నీదు మాయయా కల్పి ♦ తములు గాక. 197

గీ॥ పై పయిన్ జూడ సొంపుగ ♦ వన్నెలీను
నియ్యుదుంబర ఫలముల ♦ నెల్లవేళ
సకల జీవులు పురుగులై ♦ సంచరింతుర్
నీ ప్రభావంబు వినుతింప ♦ నేర్తు నొక్కొ. 198

క॥ ఆద్యుండవు నిగమాగమ
వేద్యుండవు సాధు భక్త ♦ వినుత భవరుజా
వైద్యుండ వఖిలలోకా
రాధ్యుండవు నిన్నెఱుంగ ♦ బ్రహ్మకు వశమే? 199

గీ॥ పామరుని భంగి నన్నిట్లు ♦ ప్రస్తుతింపఁ
జెల్లునే? నీదు దాసుండ ♦ ఁజిత్స్వరూప!

నీకు నాయందు దయయున్న ♦ నేను గోరు
వర మొసంగుము సత్కృపా ♦ భరణ! వరద! 200

చ॥ జనక తనూజతోడ, బుధ ♦ సాధు మునీశ్వర సంచయంబుతో
సనుజులతోడ నాదు హృద ♦ యం బను పీఠమునన్ వసించి నీ
వనిశము భక్తి, జ్ఞానము, మ ♦ హాత్ముల స్నేహముఁ, జిత్తశుద్ధి, జీ
వ నికరమందుఁ బ్రేమము న ♦ పార కృపారతి నా కొసంగవే?

మ॥ వరదా! నిత్య! యనంత! భక్తశరణా! ♦ బ్రహ్మణ్య! సర్వజ్ఞ! స
త్పురుషజ్ఞేయ! యమేయ! జ్ఞాన నిలయా! ♦ బుద్ధిన్ భవన్నిర్గుణ
స్థిర రూపంబు నొకింత చూచితి, భవో ♦ త్తీర్ణుండనైతిన్; బరా
త్పర! దేవా! సగుణాకృతిన్ సతతమున్♦ధ్యానింప వాంఛించెదన్.

చ॥ అనఘ! భవత్కటాక్షమున ♦ కర్తృత్వఁ గాంచినవాఁడె సంతతం
బును పరితోషితాత్ముఁడయి ♦ భూమిని స్వర్గముగా నొనర్చి, నె
మ్మనమున నీదు దివ్య మహి♦మన్ గొనియాడఁగ నోపుగాక య
న్యునకు నెఱుంగఁగా వశమె? ♦ యో విబుధావన! లోకపావనా!

గీ॥ దాసులకు సంతతము గొప్ప ♦ తన మొసంగు
విశ్వవల్లభ! నీవు ప ♦ విత్రమైన
పంచవటియందు నివసింప ♦ వలయుఁ గాక
అన్య సీమల నివసింప ♦ సర్వమగునె? 204

గీ॥ పతితపావన విఖ్యాతిఁ ♦ బరిఢవిల్లి
నట్టి గోదావరీనది ♦ యచటఁ గలదు
నాల్గు యుగములనుండి య ♦ న్నది రహించుఁ
దావక పదాబ్జ భవ దేవ ♦ తటిని బోలి. 205

ఉ॥ పావనియై, సదా సలిల ♦ భాసురయై, భువి జీవకోటికిన్
జీవనియై, సమస్త ఋషి ♦ శేఖర సేవితయై, మునీంద్ర సం
భావితయై, లతా కుసుమ ♦ వాసితయై, శ్రిత కల్పవల్లి గో
దావరి యెల్లభంగులను ♦ దక్షిణగంగ యనంగ రాజిలున్. 206

ఉ॥ పుణ్య మునీశ్వరాది ఋషి ♦ పుంగవ పోషిత సర్వ జీవ కా
రుణ్యము, దేవతా క్రతు ని ♦ రోధ విరోధన రాద యోధ కా
ర్పణ్యము, పత్రి పుష్ప ఫల ♦ రంజిత భృంగ విహంగ సంఘ లా
వణ్యము, ప్రోల్లస ద్వివిధ ♦ బర్హి వరేణ్యము, చండ దండకా
రణ్యము, సత్వ సంచయ శ ♦ రణ్యము త న్నడిపొంత భాసిలున్

సీ॥ పంచవటీ తటీ ♦ భాగంబునన్ బూర్వ
మతి ఘోర దుర్భిక్ష ♦ మాక్రమించెఁ
గాననస్థ తపస్వి ♦ గౌతమి ఋషివర్యు
నాశ్రయింపగ వచ్చి ♦ రఖిల మునులు
తన తపో మహిమచే ♦ ధాన్యంబుఁ బండించి
దాతయై పోషించె ♦ గౌతముండు
కొంతకాలము దాక ♦ ఁజింతఁదక్కి మెలంగి
ముని లాత్మసీమకుఁ ♦ బోఁ దలంచి

గీ॥ అతఁడు పోనీయఁడని యెంచి ♦ యా క్షణంబ
కపట గోవును సృజియించి ♦ గౌతమ ముని
వర్యు పొలము పొంతకుఁ దోలి ♦ వచ్చి రంత
నావు నీక్షించి గౌతముం ♦ డాగ్రహించి. 208

గీ॥ దర్భ చేఁబూని యదలించె ♦ ఁదత్క్షణంబ
గోవు మరణించె, మునులెల్లఁ ♦ గొంప మునిఁగె
నట్లు గో హత్య గో హత్య ♦ యనుచు నతని
వెక్కసంబుగ దూషించి ♦ వెడలి రపుడు 209

గీ॥ గౌతముఁడు తెల్లఁబోయి, య ♦ క్కజముఁబొంది
తేట తెల్లంబుగా దివ్య ♦ దృష్టిఁ జూచి
మునుల కపట కృత్యంబుగా ♦ బుద్ధి నెఱిఁగి
ఉగ్రుఁడై వారల శపించె ♦ నాగ్రహమున. 210

ఉ॥ దారుణమైన కార్యముఁ గృ • తఘ్నత మీ రొనరింపఁ జెల్లునే?
క్రూరులు మీరు మానులన • గూడునె? మీకు నివాసమైన కాం
తారమునన్ సతంబు నసు • ర ప్రకరంబు వసించుఁగాక, ని
ష్కారణ వైరమూని మిముఁ • గాసిలఁజేయును గాక నిత్యమున్.

గీ॥ మౌని శాపంబునన్ జన • స్థాన సీమ
దైత్య నిలయమై నిర్జన • స్థాన మయ్యెఁ
బతిత పావనమైన నీ • పాదధూళి
దానిఁ బావనమున్ జేయఁ • దగును జూవె. 212

—§ దండకారణ్య వృత్తాంతము §—

సీ॥ దండకారణ్య వృ • త్తాంతంబుఁ జెప్పెద
నాలకింపుము రామ • యఘ విరామ
పూర్వకాలమునందు • భూపుఁ డొక్కం డుండె
దండకుం డనఁగ ను • ద్దండ బలుఁడు
అతని పాలనమున • ఖ్యాతికెక్కియట్టి
రాజ్య మీ దండకా • రణ్యసీమ
భృగు మహాముని పుత్రి • విరివింటివాని యి
ల్లాలి మించిన మంచి • యందకత్తె

గీ॥ గురువు పుత్రిక యని యైన • నరయకుండ
దండకుం డాపెఁ గామించి • తగవుమాలి
బల్మిమైఁ బట్టి యుద్యాన • వనమునందు
తెఱకువం దక్క యక్కఱఁ • దీర్చికొనియె. 213

గీ॥ గోలుగోలున నేడ్చి గ • గ్గోలు గాగ
దండకుఁడు దుండగీఁడని • తండ్రితోడ
సర్వ మెఱిఁగించె నాపె, నా • సంయమీంద్రుఁ
డవుడుఁ గఱచుచు శపియించె • నా క్షణంబ. 214

గీ॥ "రాజ్య మదమున నెవఁడు ధ ♦ ర్మంబుఁదప్పి
అకట! నా పుత్రి నీరీతి ♦ నగడుపఱచె
వాని రాజ్యంబు మృత్తికా ♦ వర్షమునను
అణఁగి సర్వంబు నాశనం ♦ బగును గాక." 215

గీ॥ రాజ్యమంతయు ధూళి వ ♦ ర్షంబువలన
నాశనంబయ్యెఁ బిదప వ ♦ నంబు బుట్టె
క్రూర జీవుల కావాల ♦ మై రహించి
దండకారణ్య మను పేరఁ ♦ దనరె నిపుడు. 216

గీ॥ అచట నీవు వసింతువే ♦ న వ్వనంబుఁ
బావనముఁజేయు భవదీయ ♦ పాద ధూళి"
అనిన మే లని మునివర్యు ♦ నభినుతించి
బయలు వెడలిరి మువ్వురుఁ ♦ బంచవటికి. 217

గీ॥ రామచంద్రుండు దండకా ♦ రణ్యసీమఁ
గాంచి యిరువురితో నేగెఁ ♦ బంచవటికి
రామచంద్రుని దృక్ప్రసా ♦ దంబువలనఁ
బుష్పవతియై ఫలించెఁ ద ♦ ద్భూమిదేవి. 218

చ॥ ఫలములతోడ వృక్షములు ♦ భవ్య సుమంబులతోడ వల్లరుల్
సలిలముతో సరస్సులు నె ♦ సంగెఁ దదీయ వనాంతరంబునన్
శిల సతిఁజేయు పాద సర ♦ సీరుహ ధూళి, వనస్థ పాద పా
ది లతలఁ జూడ సొంపుగను ♦ తీర్చుట యబ్రమె సర్వమంగళా.

గీ॥ అంతట జటాయు వనునట్టి ♦ యతుల బలుఁడు,
దశరథుని స్నేహితుండు గృ ♦ ధ్ర ప్రభుండు,
రామచంద్రుని వీక్షించి ♦ ప్రస్తుతించెఁ,
దండ్రి స్నేహంబుఁ గాపాడె ♦ దాశరథియు. 220

గీ॥ పంచవటియందు నివసింపఁ ♦ బర్ణశాల
నొండు నిర్మించి రాముఁ డం ♦ దుండె నెలమిఁ

ప్రతి దినంబును శ్రీరామ ♦ భద్రుఁ జూడ
మునివరేణ్యులు వచ్చుచుఁ ♦ బోవుచుండ్రి. 221

సీ॥ మోదావహాధార ♦ గోదావరీ నదీ
తటిఁ బంచవటినుండ ♦ దాశరథులు
వన వైభవముఁ జూడఁ ♦ గనుదోయి చాలునే
ఫల వృక్షములతోడఁ ♦ బర్వతములుఁ
దరులతా గుల్మ భా ♦ సుర మహోపత్యకల్
వాపులుఁ గూపముల్ ♦ పల్వలములు
వర తటాకంబులు ♦ సరసులు సెలయేళ్లుఁ
గల ధౌతమయ జీవ ♦ కళలతోడ

గీ॥ నిత్యమున్ జూడ సొంపుగ ♦ నెగడుచుండె
సకల పశు పక్షి మృగకోటి ♦ సహజ వైర
భావములఁ బాసి సఖ్యంబుఁ ♦ బడసి యఖిల
సౌఖ్యములఁ బొందుచుండె ని ♦ స్సంశయముగ. 222

గీ॥ వీనులకు నింపుఁ బెంపొంద ♦ భృంగ రవము
అతుల వీణా నినాద మ ♦ ట్లతిశయించె;
రామచంద్రుని కానన ♦ ప్రకృతి శోభఁ
జెలఁగి వర్ణింపఁజాలునే ♦ శేషుఁడైన. 222

గీ॥ అంత నొకనాడు వత్సరా ♦ నంతరమున
సంశయములేని జ్ఞానంబు ♦ సంగ్రహింపఁ
దలఁచి తఱి వేచి సౌమిత్రి ♦ దరికి నేగి
కొన్ని ప్రశ్నలఁ బ్రశ్నించె ♦ నన్నఁ జూచి. 224

సీ॥ పాండిత్య మదమున ♦ వాదించి యోడింపఁ
దొడరి ప్రశ్నించుట ♦ తుచ్ఛమండ్రు
తనదు వాక్చాతుర్య ♦ మును జూపు తలఁపున
నిల్చి ప్రశ్నింపఁ గ ♦ నిష్ఠమండ్రు

బుద్ధి చాతుర్యంబు ♦ బుధులకు నెఱిఁగించు
మఱిని ప్రశ్నించుట ♦ మధ్యమాండ్రు
తన సంశయముఁ బాపు ♦ కొనసెంచి తటి వేచి
తగురీతి నడుగుట ♦ త్రామమయండ్రు
గీ॥ ప్రశ్నలు రచియింపఁ బై నాల్గు ♦ పద్ధతులను
నాలుగవరీతి సౌమిత్రి ♦ నయ మెఱింగి
ప్రకృతికి నతీతుఁడగు రామ ♦ భద్రుఁ జూచి
ఇట్టు లనియె జ్ఞానాపేక్ష ♦ నెట్టుకొనఁగ. 225
ఉ॥ మాయ కధీనుఁ డైన పురు ♦ మానిసి నిన్ను నెఱుంగలేడు, నిన్
బాయక గొల్చువాని నెడఁ ♦ బాయకయుందువు, నీదు సత్కథా
గాయకకోటి మోక్షమును ♦ గాంచక యెచ్చటికేగు? నో జగ
న్నాయక! నీదు దివ్య చర ♦ ణంబులఁ గొల్చితి జ్ఞానకాంక్షతో.
క॥ ప్రాజ్ఞుఁడవో మునినుత స
ర్వజ్ఞుఁడవో యీ ప్రకృతికిఁ ♦ బ్రభుఁడవో? దేవా
తజ్జ్ఞుఁడ నిను నమ్మితి నా
యజ్ఞానము ద్రెంచి మనవి ♦ నాలింపఁగదే. 227
క॥ జ్ఞానము వైరాగ్యము నీ
ధ్యానము నీ మాయ నెఱుఁగఁ ♦ దరమే విధికేన్
దీనుఁడ జ్ఞానవిహీనుఁడ
నీ నామమె మంత్రమనుచు ♦ నిన్ను భజింతున్. 228
గీ॥ నాకు బోధింపవలయు, జ్ఞా ♦ నంబు లేక
చెడునె యెప్పుడైన నీ పాద ♦ సేవకుండు
ఎఱుఁగఁజేయుము జీవున ♦ కీశ్వరునకు
భేదమేమి? చరాచర ♦ విశ్వనాథ! 229
గీ॥ నాదు సందేహముం దీర్చి ♦ నన్నుఁ బ్రోచి
శోక మోహాదులు నశింపఁ ♦ జూడవలయు

నఖిలముఁ ద్యజించి సతము ని ♦ న్నాశ్రయించి
నమ్ముకొనియుంటి నీ చర ♦ ణ ద్వయంబు. 230

గీ॥ అని వ్యతిక్రమంబుగఁ దమ్ముఁ ♦ డడిగినంత
నినకులుండును క్రమముగా ♦ నిట్టులనియె
వినుము తమ్ముఁడ వివరింతు ♦ విపులముగను
అరయఁగా రాని దేవ ర ♦ హస్యములను. 231

గీ॥ ఈవు నేనను మమకార ♦ మిషణములును
అధిక భోగానురక్తి, దే ♦ హాభిమాన
మవని మాయా స్వరూపంబు ♦ లంద్రు బుధులు,
తథ్యముగను మాయా కల్పి ♦ తంబు లగును. 232

సీ॥ ఈ మాయయే చూవె ♦ యిల చరాచర సమూ
హంబులఁ దన బల్మి ♦ నాక్రమించు
నీ మాయచేఁ జూవె ♦ యింద్రియ దశకంబు,
అఖిల భోగంబుల ♦ ననుభవించు
వివిధ వస్త్వనురక్తి ♦ విషయ భోగాసక్తి
మాయాకృతము లని ♦ మతి నెఱుంగు
మీ మాయయే రెండు ♦ నామంబుల నెసంగుఁ
బ్రకృతి యనఁగఁ బరా ♦ పర యనంగ

గీ॥ భేదములు రెండు విద్య య ♦ విద్యనాఁగ
న య్యవిద్యకు వశులౌట ♦ నఖిల జీవు
లధిక దుఃఖంబులకుఁ జిక్కి ♦ యణఁగి మఱఁగి
కూలి దేలును సంసార ♦ కూపమునను. 233

గీ॥ విద్య యను మాయ తన ప్రభు ♦ ప్రేరణమున
జగముల సృజించును స్వతంత్ర ♦ శక్తి లేదు;
ఆపె ప్రభు సన్నిధానంబు ♦ నంద వఱలి
పృథ్విఁ ద్రిగుణాత్మకంబుగ ♦ సృష్టిఁ జేయు. 234

గీ|| ధరణి నెవఁడు వర్ణాశ్రమ ♦ ధర్మములను
విడిచి, జీవరాశులయందు ♦ భేద ముడిగి
అఖిలమున్ బ్రహ్మమయ మని ♦ యాత్మఁ దలఁచు
వాఁడె సుజ్ఞానియై మోక్ష ♦ పదవి నుండు.

గీ|| విశ్వమంతయు బ్రహ్మంబు ♦ వివిధ వస్తు
సంచయం బేకమని యెంచి ♦ సంచరించు
వాఁడె విజ్ఞానియై పర ♦ బ్రహ్మ రూప
దర్శనముఁ జేయుఁ బో మోక్ష ♦ ధామముననుఁ.

గీ|| ప్రిణుత సత్త్వ రజ స్తమో ♦ గుణము లరయ
హరి విరించన హరులయం ♦ దిరవుకొనియె
సృష్టి కీ మూఁడు గుణములే ♦ హేతు వండ్రు
వీని విడిచిన వైరాగి ♦ జ్ఞానయోగి.

గీ|| తనకు మాయకుఁ బరమాత్మ ♦ కును గల్టి
సృష్టి సంబంధ మెట్టిదో ♦ యెఱుఁగఁ డేని
జీవుఁడు సతంబు మాయకుం ♦ జిక్కియుండు
జ్ఞానపథమును వీక్షింపఁ ♦ జాలఁ డెందు.

గీ|| తనకుఁ బరమాత్మ కెందు భే ♦ దంబు లేమ
అతనికిన్ దాను ప్రతిబింబ ♦ మని తలంచు
నట్టి జీవుండు మాయకు ♦ నవశుఁడగును
ఆత్మ విజ్ఞానమునఁ దత్త్వ ♦ మరయనోపు.

గీ|| ధర్మముం గూర్చి ప్రకృతి త ♦ త్త్వంబుఁ గూర్చి
ఎంత భాషించినన్ ఫల ♦ మేమిగలదు?
అనుభవంబున సద్భక్తి ♦ నరయఁడేని
వాని యత్నంబు సర్వంబు ♦ వ్యర్థమగును.

గీ|| ఆత్మ దర్మంబున విరక్తి, ♦ యందువలన
యోగ, మద్దాన జ్ఞాన, మా ♦ యోజ మోక్ష

ము లభియించుననుచు వేద ♦ ములు వచించు;
సర్వము లభించుఁ బో భక్తి ♦ సాధనమున. 241

గీ॥ ఈశ్వరునియందుఁ బ్రేమంబు ♦ నెనసియుంట
భక్తి యనఁబడు, భక్తి పై ♦ భవ్యదంబు;
జ్ఞాన మనునది భక్తి క ♦ ధీనమగుట
భక్తియే భక్తులకుఁ గల్ప ♦ వల్లి యనఘ. 242

సీ॥ తర్కింప భక్తి స్వ ♦ తంత్రంబు, భక్తి ప
రాధీనమై యుండ ♦ దది ధ్రువంబు
సకల సౌఖ్యములకు ♦ సద్భక్తి మూలంబు
భక్తుండు సర్వంబుఁ ♦ బడయఁజాలుఁ
పరమహంసల మైత్రి ♦ వలన భక్తి లభించు
భక్తిమార్గము సుల ♦ భంబు వినుము
భక్తిమార్గంబును ♦ బడసిన జీవులు
శీఘ్రంబుగా నన్నుఁ ♦ జేరఁగలరు

గీ॥ ప్రథమమున బ్రాహ్మణులఁ గొల్వ ♦ వలయు భక్తిఁ
బిదప కుల ధర్మముల నెఱ ♦ వేర్పవలయు
రక్తినుండి చిత్తంబు మ ♦ రల్పవలయు
నంతకంతకు వైరాగ్య ♦ మందవలయు. 243

ఉ॥ నమ్మకముంచి తాఁ ద్రికర ♦ ణంబుగ, నా కథ లాలకించి, దా
స్యమ్మునొనర్చి, వందన స ♦ మర్చనలం దనురక్తిఁగల్గి, జ్ఞా
నమ్మునఁ జింతనమ్మున గు ♦ ణ ప్రణుతిన్ నిరతిన్ భజించు, ని
త్యమ్మును భక్తిమార్గమును ♦ దప్పనివానికి మోక్షమిచ్చెదన్.

సీ॥ అఖిలంబు రామ మ ♦ యంబని యెంచి నా
లీలావతారంబు ♦ లాలకించి
సత్పురుషుల పాద ♦ జలజంబులను గొల్చి
మనమున నేవేళ ♦ నను భజించి

పశు పక్షి మృగముల ♦ శిశువులఁ బ్రేమించి
విశ్వంబు నే నని ♦ విశ్వసించి
గురువుల వృద్ధుల ♦ నిరతంబు సేవించి
నన్నుగా భావించి ♦ సన్నుతించి
గీ॥ తనువు పులకరింపఁగ నన్నుఁ ♦ దలఁచి తలఁచి
కనుల నానందబాష్పంబు ♦ లను త్యజించి
నా గుణంబుల సతము గా ♦ నంబుఁ జేయు
భక్తవరులకు నేను సే ♦ వకుఁడ వినుము. 245
గీ॥ జాతి మత భేదములు లేక ♦ సంచరించి
కామ మోహ లోభా ద్యహం ♦ కారములను
జంపి, గళమున గద్గద ♦ స్వరము దోప
నన్నుఁ బాడెడు భక్తుండు ♦ నా సుతుండు. 246
గీ॥ సకల ధర్మంబులను రోసి ♦ శంకఁ బాసి
దాంభికముఁ దక్కి యెవ్వాఁడు ♦ ధ్యాన యోగ
మార్గమున నన్ను సతతంబు ♦ మతిఁ దలంచు
వాని హృదయంబు నాకు ని ♦ వాస మనఘ! 247
గీ॥ ప్రభువు శ్రీరాము డిట్టు లు ♦ పన్యసింప
విని సుమిత్రా తనూజుండు ♦ వినయమునను
"జ్ఞాన భాస్కరుఁ డుదయించె ♦ నాదు హృదయ
గగనవీధి సందేహాంధ ♦ కార మణఁగె." 248
గీ॥ అనుచు శ్రీరాము దివ్య పా ♦ దాబ్జములను
బడిన యంతనె రాముండు ♦ వానిఁ దనదు
నక్కునం జేర్చి యెంతయు ♦ నభినుతించె
నుల్లమలరంగ; నంతట ♦ నొక్క నాఁడు 249
గీ॥ పంచవటి పొంతఁ బొంచి శూ ♦ ర్పణఖ యకట
త్రాఁచుబామునుబోలు దు ♦ ర్మార్గురాలు

రావణు విధవసాదరి ♦ రాముఁ జూచి
వలచి కామరూపంబున ♦ బయలు వెడలి. 250

ఉ॥ పోలుపరాని యందమున ♦ మోమునఁ దళ్కులుతాండవింపఁ గెం
గేలఁ జెఱంగుఁబూని యొక ♦ కేలను జాఱినపైఁటఁ దార్చుచున్
వాలి నొకింతనవ్వుచు, నొ♦యారముఁజూపుచు సొక్కి సోలుచున్
వేలుపు సానులం దెగడు ♦ వేసముఁ దాలిచి వచ్చెఁ జెచ్చెరన్.

ఉ॥ వచ్చి, ధరాసుతా వదన ♦ పద్మముఁ గాంచి తిరస్కరించి, తా
నచ్చపుఁ గాంతయట్లతిశ ♦ యంబునఁ బక్కన నవ్వి రామునిన్
ముచ్చటదీఱఁజూచి, కడు ♦ బొంకముగన్ దలయూచి, సుందరుల్
మెచ్చిన వన్నెకాఁడనుచు ♦ మేలి ముసుంగును ద్రోసి యిట్లనున్.

ఉ॥ "ఎక్కడివాఁడవోయి కుసు ♦ మేషుని చెంపలవాయఁగొట్టు నీ
చక్కఁదనంబు కామినులఁ ♦ జాల భ్రమింపఁగఁజేయునోయి, నా
మక్కువదీఱ నిన్ను నొక ♦ మారు కవుంగిటఁ జేర్తు రమ్ము, నా
చెక్కులఁజూడు మేరికిని ♦ చిక్కనిదానను నీకుఁ జిక్కితిన్. 253

గీ॥ మనకు ననుకూల దాంపత్య ♦ మొనరు ననుచుఁ
దలఁచి యిరువుర సృజియించె ♦ జలజభవుఁడు;
మూడు జగములఁ దిరిగితి ♦ మోహనాంగ
చూడనైతిని నినుఁబోలు ♦ సుందరాంగు. 254

ఉ॥ కన్నెను సుందరాంగిని జ ♦ గంబుల కాది మనోజ్ఞమూర్తి నీ
వెన్నఁగరాని మోహమున ♦ నిచ్చటికే నరుదెంచితిన్, పదా
ర్వన్నె పసిండిబోఁలు నెల ♦ ప్రాయముఁ గాయముజన్నెపట్టితిన్
గన్నెఱికంబుఁబాపి కడ ♦ గంటను జూడుము ప్రాణవల్లభా! 255

ఉ॥ వాలుగడాలువాని గరు ♦ వంబును జెల్లఁగనీదు నీదు మై
డాలు, సొబంగుమీరిన క ♦ డాని సలాకనుబోలు నాదు మే
నేల కవుంగిటన్ బొదివి ♦ యేలవు? మే లవురా! సరోజనే
త్రా! లలనామనోహర! వి ♦ రాగివా? యోగివా లేక భోగివో?

క॥ పతివో? నేఁ గొల్చిన పశు
పతివో? నా పూర్వపుణ్య ♦ భాగ్యమునకు స
ద్గతివో? నే మెచ్చిన రతి
పతివో? యూహింపఁజాల, ♦ వలచిన బాలన్. 257

క॥ నా పేరు కనకసుందరి
భూపాలక నిన్నుఁగాంచి ♦ మోహించితి, నా
తాపాగ్ని మట్టుమీఱఁగ
నీ పాదము లాశ్రయింప ♦ నిలిచితి నిచటన్. 258

ఉ॥ ఓడకవచ్చి నిన్వలచి ♦ యుల్ల మొసంగెదనన్న నొక్క మా
టాడక, నన్నుఁజూడ వద ♦ నాంబుజ మెత్తక, కౌఁగిలించి ము
ద్దాడక, మిన్నకుంటి వహ ♦ హా! రతినాయక, యింతదాకఁ బెం
డ్లాడకయుంటి నీకొఱకు, ♦ నక్కట! యక్కఱఁదీర్ప వక్కనన్.

ఉ॥ చేరలఁ గొల్వవచ్చు విక ♦ సించిన నీ నయనాంబుజంబులన్
బారలఁ గొల్వవచ్చును క ♦ వాటముఁబోలిన నీదు వక్షమున్
బూరెలఁబోలు బుగ్గలకు ♦ ముద్దులనిచ్చెద వన్నెకాఁడ! రా
రా! రతిరాజశేఖర! యురమ్ము ను ♦ రమ్మునఁ గీలుకొల్పెదన్. 260

చ॥ సరసుఁడ నీకు నాకుఁ గను ♦ సన్నలతోఁ బనియేమి? నీవు నా
సరసను నిల్చియున్న నెక ♦ సక్కెములాఁడెడువాఁ డెవండు? నా
కరముఁ గరమ్మునన్ గొనుము, ♦ కమ్మనివాతెఱ నాననిమ్ముఁకన్
సురతకళాధురీణ! ననుఁ ♦ జూడక మోమ మటుఁ ద్రిప్పవచ్చునే.

గీ॥ కామినులకు విందోయి నీ ♦ కన్నుదోయి
సరసవరులకు హాయి నా ♦ చన్నుదోయి
ఆడుదానను, వలచి ము ♦ ద్దాడుదాన
రమ్ము, నీబుగ్గ కమ్మని ♦ తమ్మిమొగ్గ. 262

ఉ॥ చిక్కితినీకుఁ జేతులకుఁ ♦ జిక్కని చిక్కని చన్నుదోయికిన్
దక్కితివీవు, చిత్తమిఁకఁ ♦ దాళదు తాళదు మోహనాంగ! నా

యిక్కడకువచ్చి యెక్కడకు ♦ నేగెదు? పువ్వులుకాని కాకకున్
బొక్కితి నీకు మ్రొక్కితిని ♦ మోవిఁ జుఱుక్కన నొక్కనీయవే?

క॥ మగవాని మగువ వలచినఁ
దగవా యది? తప్పగాదు; ♦ తగవాడకు నన్
దిగనాడకు వగకాఁడా!
పగవాని విధాన మారు ♦ పలుకవు తగునా? 264

ఉ॥ క్రొన్నెలఁబోలు నామొగము ♦ గోముఁగనుంగొని మిన్నకుంటివో?
వెన్నెలఁబోలు నా నగవు ♦ ప్రేమసుధన్ జికిలింపఁ గ్రోలవో?
న న్నెలమిన్ రమించి రతి ♦ నాయక! సౌఖ్య రసాబ్ధిఁ దేలవో?
చెన్నెలరారు నన్నుఁగని ♦ సీతను బాయక యెట్టులుంటివో? 265

సీ॥ సోమునిఁ బ్రేమించి ♦ సోమించి కళలకు
గీముఁ బోలిన మోముఁ ♦ గోముఁజూడు
అరవిందముల కంద ♦ మెరవిచ్చి కామునిఁ
గామించఁజేయు నా ♦ కనులఁజూడు
జక్కవ యెక్కువఁ ♦ దక్కువఁ గావించి
సౌరుమీఱిన గబ్బి ♦ చనులఁజూడు
అప్పలిచ్చిన మబ్బు ♦ కప్పు చొప్పంగాంచి
చెప్పుచుండెడు గొప్ప ♦ కొప్పుఁజూడు

గీ॥ ముద్దులొలికెడు నా కావి ♦ మోవిఁజూడు
తావి వెదజల్లు నా మేని ♦ ఠీవిఁజూడు
జిలుఁగు వలిపంపు జలతారు ♦ చీరఁజూడు
చూడు మింకేమి చూచెదో ♦ సుందరాంగ! 266

ఉ॥ శౌర మనోహరాంగ! యిత ♦ రాంగనలన్ గనవేమొ? పల్కుబం
గారమొ? లేక యియ్యది వి ♦ కారమొ? రమ్మని లేచి కౌఁగిటన్
జేరిచి ముద్దులిచ్చి నను ♦ జెక్కుల తళ్కులఁ జూడవేమి? శృం
గార శిరోమణీ! సరస ♦ కామ కళానిధి యాదరింపవే? 267

ఉ॥ అక్కటా! యౌవనంబు గల ♦ యప్పుడె యొవ్వలకుప్పఁ జేరి పే
రక్కున నొక్కి కామకళ ♦ లంటి రమించుట యొప్పఁగాక, యీ
టెక్కులు చాలురా, సఖిని ♦ డీకొని యేల్కొనలేని జ్ఞానివా?
టక్కులు మానురా, భువి దృ ♦ ఢ వ్రతదీక్షఁగట్టి మానివా?

ఉ॥ సుందరు లెందఱో గల వ ♦ సుంధర నిన్ను వరింపఁ గామినీ
సుందర! వచ్చితిన్ గనక ♦ సుందరి నా భువి ఖ్యాతిఁ గొంటి నీ
ముందఱ నిల్చియుంటి, మొగ ♦ మున్ బయికెత్తవు నన్నుఁ జూడ, వో
ర్వం దరమా, నినున్ వలచి ♦ వచ్చిన యచ్చపు మచ్చకంటికిన్.

ఉ॥ నిక్కమెఱుంగనయ్యె, విను ♦ నీదు రహస్యము తెల్లమయ్యె, నీ
యక్కఱ దీఱె నాదు వద ♦ నాబ్జము నందముఁ జూచినంతఁ, జే
జిక్కిన కాంత నేలుకొనఁ ♦ జేవ యొకించుకయైన లేదె? నా
చక్కని సంగడీఁడ, సర ♦ సంబు తెఱుంగక మిన్నకుంటివో? 270

గీ॥ మారు మాటాడ కిరీటి ♦ మసలె దేని
తాళఁజాలను, పైఁబడి ♦ తనివిదీఱ
ముందు నాకోర్కె నీడేర్చు ♦ కొందు" ననిన
నించుక హసించి శ్రీరాముఁ ♦ డిట్టు లనియె. 271

ఉ॥ "అక్కఱకుండ, నొక్కసతి ♦ కాత్మనొసంగితిఁ, జెల్ల దన్య సం
పర్కము, పెండ్లియందు మధు ♦ పర్క మొసంగఁగ వచ్చితీవు, నీ
తర్కము మేము మెచ్చ మది ♦ ధర్మవిరుద్ధము, తాళఁజాలవేన్
దారొక్కనుమింక నా యనుగుఁ ♦ దమ్ముని, నాతఁడు సమ్మతించినన్.

గీ॥ అనిన విని మేలు మేలని ♦ యా లతాంగి
"వయసుఁగలవాఁడు బంగారు ♦ వంటివాఁడు
చూడఁ జక్కనివాఁడు నా ♦ కోషెకాఁడు
నీదు తమ్ముండు నీకంటె ♦ నీటుకాఁడు." 273

గీ॥ అనుచుఁ బకపక నవ్వె యొ ♦ య్యారమునను
లక్ష్మణునిఁ జేరి యిట్లనె ♦ లజ్జలేక

"అనఘ! నీయన్నఁ గామించి ♦ యలఁతినైతి
నిన్నుఁ బ్రేమించి వచ్చితి ♦ నెయ్యమునకు." 274

చ॥ అనవిని లక్ష్మణుండు దర ♦ హాసముఖంబున రాముఁజూచి, య
వ్వనితనుజూచి యిట్లనియె ♦ బాగుగనున్నది నీదు చంద మె
వ్వని గనినన్ మగండనెడు ♦ భ్రాంతిని పైఁబడవచ్చి రమ్ము ర
మ్మని తమకింతువీవు కుల♦కాంతవొ మా కనుమానమయ్యెడిన్.

ఉ॥ సుందర కన్యవౌదువు, వ ♦ సుంధర కెల్ల నపూర్వమైన నీ
చందము నందమున్ బొగడ ♦ శక్యమె? నీ సొబఁ గెట్టిదంచు నె
న్నం దరమా లతాంగి, భువి ♦ నొం తలఁదన్నిన వన్నెకాండ్రి నీ
వెందరిఁ జూచినావొ? విను ♦ మే నన నెంతటివాఁడఁ గామినీ!

ఉ॥ చక్కనిదానవౌదు, నెఱ ♦ జాణలకున్ నెఱజాణవౌదు, నీ
కెక్కడ చెల్లునో యచటి ♦ కేగిన మేలగుఁగాక, యక్కటా!
ముక్కుబిగించి కానలను ♦ ముక్కుచు మూల్గుచునున్న మాకు నీ
యక్కఱ యేటికింకఁ గప ♦ టాభినయంబులఁ గట్టిపెట్టుమా.

గీ॥ రామచంద్రుండు త్రిభువన ♦ ప్రభువరుండు
అతఁడు సర్వ స్వతంత్రుఁ డ ♦ త్యధిక బలుఁడు
నే నతని పాద దాసుండ ♦ నీకు నేను
తగుదునే రాజపుత్రి! సొం ♦ దర్యవతివి. 278

గీ॥ విహగమునకును నూహింప ♦ విహగ విభున
కేనుఁగునకు సింహమునకు ♦ నెంత వాసి?
అంతియే వాసి నాకు న ♦ య్యనఘునకును
బాల! ననుఁగోరి యీరీతి ♦ జాలవైతి. 279

సీ॥ తన జీవితముదాకఁ ♦ దల నమ్ముకొనినట్టి
దాసుండు సుఖయింపఁ ♦ దలఁపఁగలఁడె
అభిమాన వశమున ♦ నన్యుల నడుగక
వెడలు యాచకుఁడు జే ♦ వింపఁగలఁడె

అనిశంబు భోగ దు ♦ ర్వ్యసనంబులకుఁ జక్కు-
ధనికుండు ధనవృద్ధిఁ ♦ దనియఁగలఁడె
అన్యుల కీక తా ♦ ననుభవింపకయుండు
పిసినికిఁ గీర్తి ల ♦ భింపఁగలదె?

గీ॥ చదలు గోవని పాలను ♦ పిదుకఁగలమె
వసుధ వ్యభిచారి సద్గతిఁ ♦ బడయఁగలఁడె
ఉచిత మెఱుఁగక వగఁగూరి ♦ యో మిటారి
వెడఁగు చందాన ననుఁగోరి ♦ బేలవైతి. 280

గీ॥ అనిన విని మంచిదని మంద ♦ హాసమునను
రాముని జేరి, "రతిరాజ ♦ రాజకీటిఁ
బోలిన లతాంగిఁ బెండ్లాడఁ ♦ జాలవేని
సాటి మగవారు నవ్వరే ♦ జలజనేత్ర!" 218

గీ॥ అనుచుఁ బైఁ బడఁబోయిన ♦ నాగు మాగు
మనుచు రాముండు నామాట ♦ లాలకింపు
పెద్దవాఁడను, నాకంటెఁ ♦ బిన్నవాఁ డ
తండు, యువకుండు, వానినే ♦ తగులు మనిన. 282

ఉ॥ "ఔనని మంచిమాటయని' ♦ యార మనోహర యోరి లక్ష్మణా
మానినిఁ జూచి జంకెదవు ♦ మంచి మగండవ, సాటివారలన్
గానవుగాక రమ్మనుచుఁ ♦ గౌఁగిటఁ జేర్పఁగఁ బోయినంత న
ద్దానవిఁజూచి లక్ష్మణుఁడు ♦ తర్జనిఁజూపి వచించె నీగతిన్. 283

గీ॥ "తగిన వరుఁ జూపి పొమ్మంటెఁ ♦ దగిన యంటి
వాలుగంటివే నొకమాట ♦ చాలు నీకు
వలపుఁ దలపెట్టఁగూడని ♦ బ్రహ్మచారి
నన్నుఁ గామింపవచ్చునే ♦ సన్నుతాంగి. 284

ఉ॥ జారిణివీవు, దుర్విటుల ♦ సంగతి మెచ్చిన సాసవీవు, సం
సారిణి వెట్టులౌదు? వ్యభి ♦ చారులఁ గ్రూరుల నీతి దూరులన్

గోరి సుఖింపఁగాఁ దగిన ♦ కోమలి నో మలినాత్మురాల! మా
చేరువ నిట్టి యాగడము ♦ చెల్లదు వాక్కులు పెక్కు లేటికిన్.

గీ॥ అనిన విని యాపె యక్కట నే ♦ త్రాంచలమున
నిప్పుకల ఉప్పి శ్రీరాము ♦ నికటమునను
నిలిచి తలను తాటించి, క ♦ న్నీరు విడిచి
నెట్టుకొని వచ్చు కినుకతో ♦ నిట్టులనియె. 286

సీ॥ కామినీ! మదగజ ♦ గామినీ! యని చీరి
యింపుగా ననుఁ బల్క ♦ రింపవైతి
కాంతామణీ! కామ ♦ చింతామణీ! యని
మించి కామించి ప్రే ♦ మింపవైతి
కలవాణి! యలివేణి! ♦ కళ్యాణి పల్లవ
పాణి రా యని పాణిఁ ♦ బట్టవైతి
కుందరదన! యార ♦ విందవదన! స్మర
శ్రీ సదన! యని వ ♦ రింపవైతి

గీ॥ మోడి విడనాడి రమ్ము ప్రా ♦ బోడి యనుచు
బాడిఁ దలపెట్టి నన్ను ము ♦ ద్దాడవైతి
వీర! నాతి నీరీతిఁ బొ ♦ మ్మనుట నీతి
చెల్లఁబో నీదు సరసత ♦ తెల్లమయ్యె. 287

ఉ॥ నీ తలఁబుట్టినట్టి యవి ♦ నీతులకున్ జెవియొగ్గవా రప
ఖ్యాతికి నగ్గమై చెడుదు ♦ రన్నిట; నున్నత రాజవంశ సం
జాత కులాంగనా సురత ♦ సౌఖ్యమెఱుంగక మాటలాడె దీ
నీతులఁ గట్టిపెట్టు తరు ♦ ణీజన హింసక! ఛీ! నపుంసకా!

గీ॥ అలఁతి పొలఁతినె, యతుల లం ♦ కాధినాథు
సోదరిని, కృశోదరిని నే ♦ శూర్పణఖను
ఎగ్గులాడితి వోగ న ♦ న్నెఱుఁగలేక
అనుచుఁ దన రూపుఁ జూపించె ♦ దనుజకాంత. 289

గీ॥ తొంటి చక్కని రూపంబు ♦ గెంటుకొనుచు
భయద రూపంబు దోచె న ♦ ప్పడఁతి మేన
నవనిపుత్రిక భీకర ♦ వ్యాఘ్రిఁ జూచు
మృగము చందాన భీతిల్లె ♦ ధృతిఁ దొఱంగి. 290

గీ॥ పీడి జుంజుఱు వెండ్రుకల్ ♦ వ్రేలి యాడ
బండ్లఁ గొఱుకుచుఁ వక్ర గ ♦ హ్వరముఁ దెఱచి
చెవుల నిక్కించి గర్జించి, ♦ సీతఁ గాంచి
ఓకరించుచు హుమ్మని ♦ హుంకరించి. 262

గీ॥ మ్రింగవచ్చిన రాక్షసి ♦ రీతి నరసి
అనుజునిం జూచి శ్రీరాము ♦ డనఘ! యీమె
లోకఘాతిని, శ్రుతులకు ♦ నాకమునకుఁ
దగదు వెలిపెట్టుమనిన నా ♦ తఁడు చెలంగి. 292

గీ॥ "దానవీ! నీవు కడు మంచి ♦ దాన" వనుచు
గొప్పఁ జేఁ బూని యొక కేల ♦ క్షురికఁ బూని
చెవుల ముక్కును ఖండించి ♦ "సిగ్గులేక
బ్రదుకు"మని నేలఁ బడఁద్రోసి ♦ పలికె నిట్లు. 293

క॥ మాదరి, నెన్నందగిన కృ
శోదరి నని నిక్కి పిదప ♦ నురు లంకారాట్
సోదరి నని పల్కిన లం
బోదరి! నీ కిట్టి హాని ♦ యొప్పెనె చెపుమా. 294

ఆ॥ సిగ్గులేక మమ్ముఁ ♦ జేపట్ట నేతెంచి
పెక్కులాడి తీవు ♦ వెఱపుఁ దక్కి
వనిత తనకుఁ దాను ♦ వలచి వచ్చుటె ఖ్యాతి
చొప్పదంటవైతి ♦ చుప్పనాతి! 295

చ॥ అనవిని లేచి యేడ్చుచు, ము ♦ ఖాబ్జపరిస్రుత రక్తధారలన్
గొనకొనికొంగునన్ దుడిచి ♦ కొంచు, గొణంగుచునాల్గుదిక్కులన్

గనుఁగొని, యీడుదాని నను ♦ గాసిలఁజేసితి రింకఁ గాచుకొం
డని ఖరదూషణాదుల గృ ♦ హంబున కేగి వచించె నీగతిన్. 296

చ॥ ఇరువురు రాజపుత్త్రులు మ ♦ హిన్ గల దైత్యుల నుక్కడంచు నే
ర్పరు లట నన్నున్ బలిమిఁ ♦ బట్టి యొకించుక యైన జంక కి
క్కరణిని నాసికన్ జెవులఁ ♦ గ్రక్కునఁ ద్రుంచిరి చూడరే మనం
బెరియుచునున్న దాయుధము ♦ లెత్తుఁడు మొత్తుఁడు లెండురండిఁకన్

చ॥ పదులను చీరికింగొనని ♦ బాహుబలాఢ్యులు మీకు నాకు సో
దరులట, నాకలోకమును ♦ ద్రిప్పిన దైత్యవరేణ్యు నాత్మ సో
దరినట, నా శరీరమును ♦ దాకి, నరాధము లిట్లు శోణితం
బురలగఁ ద్రుంచి తోలిరట ♦ యోర్చితిరే బలమేల కాల్పనే?

గీ॥ రంపు నే ముందు మీకు మా ♦ ర్గంబుఁ జూపు
దాన ననినంత హుమ్మని ♦ దైత్యవరులు
వెడలి రప్పుడు పదునాల్గు ♦ వేల బలులు
వసుధయంతయు గడగడ ♦ వణఁకునట్లు. 299

ఆ॥ ముక్కు సెవులు లేక ♦ పొక్కి వెక్కుచు నున్న
విధవ యోర్తు నడుప ♦ వెంబడించి
పదియు నాల్గువేలు ♦ బలు లేగిరి జయింప
సందియంబె మంచి ♦ శకున మరయ. 300

ఉ॥ కొందఱు యుద్ధవార్త్తలను ♦ కొందఱు బాహుబలా బలంబులన్
కొందఱు శౌర్య ధైర్యములఁ ♦ గొందఱు సంగరరంగ పద్ధతిన్
గొందఱు ప్రౌఢవాక్యముల ♦ గొప్పగ నెంతయుఁ జెప్పుకొంచు ని
ట్లుందఱు నేగుచుండిరి ది ♦ గంతములన్ రణభేరి మ్రోఁగగన్.

ఉ॥ తెక్కలుగల్గియుండిన గి ♦ రి ప్రకరంబు లనంగ నేపుమై
రక్కసు లెల్లరున్ శిత శ ♦ రంబులఁ దోమర ముద్గరంబులన్
పెక్కులఁ దాల్చి, బీరము గ ♦ భీరముఁ జూపుచు, వాహనంబులన్
గ్రక్కునఁ బోయి రాయుధపుఁ ♦ గాంతులు దిక్కుల నాక్రమింపఁగన్

గీ॥ వారు చెలరేగి యేగి య ♦ వ్వనమునందు
జానకిన్ రామచంద్రు ల ♦ క్ష్మణునిఁ జూచి
రంత కొందఱు మితిలేని ♦ యాగ్రహమున
నౌదలల నూచి గుస గుస ♦ లాడి రిట్లు. 303

సీ॥ "కౌశికు జన్నంబుఁ ♦ గాపాడ నేపారఁ
దాటకం జంపిన ♦ దంట యితఁడు.
గౌతముఁ డలరంగ ♦ ఱాఁతి నాతిగఁ జేసి
ఖ్యాతిఁగాంచిన మాయ ♦ కాఁ డితండు,
క్షితిపు లెల్లరుఁ జూడ ♦ శివుని చాపముఁ ద్రుంచి
జానకిఁ గొన్నట్టి ♦ సరసుఁ డితఁడు,
కార్తవీర్యార్జును ♦ గం డడఁగించిన
రాముని గెల్చిన ♦ రాముఁ డితఁడు,

గీ॥ ఏచి మారీచు నేచిన ♦ నీచుఁ డితఁడు
మన విరాధునిఁ జంపిన ♦ జనుఁ డితండు
శూర్పణఖ ముక్కుఁ దునిమిన ♦ శూరుఁ డితఁడు
దనుజుల వధింపఁ దలఁచిన ♦ మనుజుఁ డితఁడు. 304

శా॥ "ఔరా! నేనువచించు వాక్యముల నీ♦వాలించి యోచింపుమా
శ్రీరామున్ వధియించి సీతఁగొనినన్♦ఱేఁడెంతయున్ మెచ్చురా
రారా"యన్ననొకండు, వానిఁగని"శ్రీ♦రాముండుసామాన్యుఁడే
కారింపంగల రాచవాఁ డనియె నొ♦క్కం డెక్కసక్కెంబుగాన్.

ఉ॥ అచ్చటఁజూడుఁ డాపె జన ♦ కాత్మజ, నల్లనివాఁడు రాముఁ డా
పచ్చనివాఁడు లక్ష్మణుఁడు ♦ బాహుబలంబున నెట్టి యోధులన్
మెచ్చని వీరులండ్రు, నను ♦ మించి జయింపఁగఁజాల రంచుఁ దా
నచ్చపు బంటువోలె నొకఁ ♦ డందఱిఁజూచి వచించె నవ్వుచున్.

ఉ॥ వారు మహానుభావు లని ♦ వార్య బలాఢ్యులు, దేవకోటిలోఁ
జేరినవారు మర్త్యులని ♦ చింతిలరా దని యొక్కఁ డన్న, ని

న్నార! ఖరుంకు మెచ్చుకొను ♦ నా? విను వారలు నవ్వువారలం
చారయ కిట్టులాడెదు; య ♦ మాలయముంగన లోఁ దలంచితే?

గీ॥ అనుచు మతియొక్కఁడుఁ వచించి ♦ యా క్షణంబ
మీసముల దువ్వి "యిప్పుడే ♦ మెలఁతఁ దెచ్చి
ఖరుని కిచ్చెద నా సమ ♦ క్షమునఁ జెలఁగి
కాలు లఱచెదు న న్నెఱుం ♦ గని విధాన. 308

గీ॥ అనిన విని యొక్కఁ డిట్లనె ♦ "నంత వాఁడ
వౌదువోయి నిన్నెఱుఁగని ♦ జోదు లేఁడు
పెద్దలుండంగ మన కేల ♦ పెనఁగులాట
మిన్నకుండుఁడు కార్యంబు ♦ మించి వచ్చు." 309

ఉ॥ "చాలును బుద్ధిమంతుఁడవు ♦ సంగర రంగ విశారదుండ వీ
లీలను వాదులాడిన ఫ ♦ లించునె యత్నము, లాలసించినన్
గాల మతిక్రమించుఁ బ్రభు ♦ కార్యమొనర్పఁగ సాహసింపుఁడీ
బాలుర గెల్వ కేమి యని ♦ పల్కె నొకండు ప్రగల్భధోరణిన్.

గీ॥ ఆత్మవీరుల పలుకుల ♦ నాలకించి
బింకమున హుంకరించి, య ♦ హంకరించెఁ
పరధరావర కైరవ ♦ ఖర కరుండు
సకలలోక భీకరుఁడు ము ♦ ష్కరుఁడు ఖరుఁడు. 311

క॥ దోషాన్వేషణుఁ డరి సం
శోషణుఁ డమరారి వంశ ♦ భూషణుఁ డగు న
ద్దూషణుఁ డాహవరంగ వి
భీషణుఁ డయోధ్యాధవసుతులఁ ♦ బ్రేరేపించెన్. 312

ఉ॥ అంతటరామచంద్రుఁడు ని♦జానుజు లక్ష్మణుఁజూచి, "చూచితే
పంతములాడుకొంచుఁ దమ♦బాహుబలంబుల మెచ్చుకొంచు లో
కాంతకులైనవారు కల ♦ హంబునకున్ జనుదెంచిరింకఁ బ్రా
ణాంతకశిక్షఁజూమా యులఁశి♦యించు నొకించుక యాలసించినన్

గీ॥ శీఘ్రగమనంబునన్ నీవు ♦ సీతతోడ
దాఁగియుండుము శైలకం ♦ దరమునందు
లేశమైనను క్లేశంబు ♦ లేదు మనకు
లీల నవలీల గెల్తు ని ♦ లింపు లలర. 314

గీ॥ అనిన విని లక్ష్మణుం డంత ♦ నతిరయమున
అవనిసుతతోడ డాఁగె గు ♦ హాంతరమున;
గగనసీమను పెంధూళి ♦ గ్రమ్ముకొనఁగ
రాక్షసులు వచ్చి తాఁకిరి ♦ రామచంద్రు. 315

గీ॥ సీతతోఁగూడ గిరి గుహా ♦ సీమయందుఁ
దమ్ముఁ డున్నాఁడుగద యని ♦ తాల్మిఁబూని
తాకి పైఁబడ వచ్చిన ♦ దైత్యులఁ గని
దాశరథి యించుకంతయుఁ ♦ దల్లడిలక 316

ఉ॥ రండని కేశబంధముఁ గ ♦ రంబున నించుక సంస్కరించి, కో
దండము నెక్కువెట్టి, ముని ♦ తండము మేలని సన్నుతింప, బ్ర
హ్మాండము తల్లడిల్ల నిశి ♦ తాస్త్రములన్ వెదజల్లె దైత్య వే
దండము లోహాటించి భుజ ♦ దండము లెత్తి నమస్కరింపఁగన్.

మ॥ అరవాయిన్ వెనుదీయకుం డనుచుఁ బ్ర♦ త్యాలీఢ పాదస్థుఁడై
దరహాసంబు ముఖాబ్జమందు వెలుఁగన్♦ దైత్యాస్త్రశస్త్రంబులన్
బోరి ఖండింపఁగనోపు దివ్య శరముల్ ♦ పుంఖానుపుంఖంబుగాఁ
గురియించెన్ రఘువీరపుంగవుఁడు, లో ♦ కుల్ నాకు లగ్గింపఁగన్.

గీ॥ రామ బాణముల్ రాక్షస ♦ ప్రాణ పవన
సర్పములఁ బోలి వ్యాపించె ♦ క్షణములోన
దైత్యులెల్లరు నించుక ♦ తాల్మిఁదక్కి
వెఱ చఱచినంతఁ బురికొల్పె ♦ వెండి, ఖరుఁడు. 319

ఉ॥ పట్టుఁడు కొట్టుఁ డెట్టి బల♦వంతుఁడొ చూతము, వానికాంతఁ జే
పట్టుఁడు, ముట్టడించి చల ♦ పట్టుఁడు, పైఁబడి కాలు సేతులన్

గట్టుఁడు, గట్టికాయమును ♦ గాయముఁ జేయుఁడు, దిట్టయట్టు చూ
పట్టునుగాని యల్పుఁడగు ♦ బాలుఁడు వీనికి జంకవచ్చునే? 320

గీ॥ అనిన విని దైత్యులెల్లరు ♦ నిసుమడించు
ధైర్యమున ముట్టడించిరి ♦ దాశరథిని
సకియ! మందేహ నామ రా ♦ క్షసుల నడుమఁ
గ్రాలు సూర్యునివలె నొప్పె ♦ రాఘవుండు. 321

గీ॥ మేఘరాశిని మెఱుపులు ♦ మెఱయువేళ
నీల మాణిక్య శైలంబు ♦ గ్రాలు లీల
మా మనోహరు వర జటా ♦ మకుట మొప్పె
నమర రిపులకు దిగ్భ్రమం ♦ బాపహిల్ల

గీ॥ మదగజంబులఁ జూచి సిం ♦ హము చెలంగి
కోఱలన్ గీఁటు విధముసఁ ♦ గ్రూర దైత్య
సైనికులఁజూచి శ్రీరామ ♦ చంద్రుఁ డపుడు
ఱువ్వమను వాఁడి ములుకుల ♦ ఱువ్వఁ జొచ్చె. 323

గీ॥ దండకారణ్య ఖగ మృగ ♦ తండ మపుడు
స్థానముల వీడి పరువిడె ♦ సాధ్వసమున;
రామచంద్రుని దివ్య వి ♦ గ్రహముఁ జూచి
చెనఁటి రక్కసులెల్ల ని ♦ శ్చేష్టులైరి. 324

గీ॥ అదరిపడిఁ బట్టు దరికట్టుఁ ♦ దనువె కాని
యుక్కలుం దొక్కఁడైన న ♦ య్యోధసింహుఁ
దాకఁ డెల్లరు నిటునటు ♦ దారులాడి
మసలుచుండిరి; ఖరుఁ డంత ♦ మంత్రిఁ జూచి. 325

క॥ నరనాగులఁ గిన్నర కిం
పురుషుల సుర సిద్ధసాధ్య ♦ ముఖ్యుల వర సం
గరముల జయించి రాక్షస
వరు లెల్లరుఁ బొగడఁ గీర్తిఁ ♦ బడసిరి వసుధన్. 326

గీ॥ పురుష సింహుల వీరలఁ ♦ బోలినట్టి
సుందరాకారులన్ భువిఁ ♦ జూచి యెఱుఁగ
సచివశేఖర! వీరల ♦ సంహరింప
హృదయ మంగీకరింపదు ♦ హేతు వేమొ? 327

గీ॥ నిరుపమానుల బాలురఁ ♦ గరుణవిడిచి
కసిమసంగిన నది నాకు ♦ ఘనతయగు నె?
నా బలముఁగూర్చి వచియించి ♦ నయముఁ జెప్పి
సీతఁ దోడ్కొనిరావలె ♦ శీఘ్రముగను. 328

గీ॥ ఎన్నఁగారాని చక్కని ♦ చిన్నదాని
నా కొసంగినఁజాలు, ర ♦ ణంబుఁదక్కి
విడిచిపుచ్చెద బాలురు ♦ వెడలవచ్చు
రాముసకుఁ జెప్పి నీవు శీ ♦ ఘ్రముగ రమ్ము. 329

గీ॥ అనిన దూషణుం డది లెస్స ♦ యని వచించి
మెచ్చుకొని పోయి రమ్మని ♦ హెచ్చరించె;
"స్వస్తి"మని కోటి మశకంబు ♦ లూఁదుఁగాఁక
పాదు వదలునె భువి మేరు ♦ పర్వతంబు. 330

గీ॥ అకట ఖరదూషణాది సు ♦ రాక్షకోటి
కాలవశమునఁ గడు నహం ♦ కారమునను
జ్ఞానశూన్యులై శ్రీరామ ♦ చంద్రు మహిమ
నెఱుఁగఁజాలక నశియించి ♦ రిందువదన. 331

గీ॥ దూత యంతట రామచం ♦ ద్రుని సమీప
మునకు వడిఁబోయి నిర్భత్స్య ♦ ముగను నిల్చి
తనదు దౌత్యంబు నెఱిఁగించి ♦ దనుజవిభుల
బాహుబలముల వర్ణించి ♦ పలుకఁజొచ్చె. 332

చ॥ ఇనకులుఁ డంత నాగుమని ♦ యించుక నవ్వి వచించె నిట్లు "శ్రీ
ధనఘున భాగ్యశాలినయి ♦ తిన్, భవదీయవిభుండు నాఫయిన్

నెనరునుగల్గి ధర్మమును ♦ నీతినిఁ దప్పక న్యాయ్యమార్గమున్
గను టది చాల మేలగు జ ♦ గంబునకున్; విను మోరి దానవా?

ఉ॥ క్షత్రియుఁడన్ జగంబునను ♦ శాశ్వతధర్మముఁ బాదుకొల్పెదన్
శత్రులువచ్చి పైఁబడిన ♦ జంకను, కాలుఁడు వచ్చెఁగాక నా
క్షాత్రముఁజూపి వాని సము ♦ ఖంబున నిల్చెద భీతిఁదక్కి, యీ
ధాత్రికి ద్రోహులై మెలఁగు ♦ దైత్యమృగంబుల సంహరించెదన్.

గీ॥ దుష్టులగు రాక్షసులఁజంపి ♦ శిష్టజనుల
నేను రక్షింపవచ్చితి ♦ నిది నిజంబు;
భలములేకున్న మీ గృహం ♦ బులకుఁ బొంచు
యుద్ధవిముఖుల వధియింప ♦ నోప నేను. 335

గీ॥ బలముఁ జూపింపవచ్చి యీ ♦ పలుకు లేటి
కింతమాత్రాన దయపుట్టె ♦ దెన్నఁడైన
రిపులఁ గరుణించి విడుచునే ♦ నృపవరుండు?
తొలఁగి చనుటొప్పుఁ బ్రతుకుపైఁ ♦ దలఁపుఁగొన్న. 336

చ॥ అనవిని దూత యించుక య ♦ హంకృతి మీసమునుల్పి కాచుకొ
మ్మని వడిలేచె, యాక్షణమ ♦ యచ్చోటువాసి, వచించె సర్వమున్
దనుజుల సమ్ముఖంబునను; ♦ దాశరథిన్ వడి ముట్టడింపఁ బొం
డని ఖరుఁ డానతిచ్చి తన ♦ యాయుధమున్ బయికెత్తెనత్తఱిన్.

ఉ॥ అగ్నివలెన్ జ్వలించి యసు ♦ రాధము లాగ్రహవిగ్రహోగ్రులై
దిగ్గనలేచి, యాయుధపు ♦ దీధితు లాశల నాక్రమింపఁగాఁ
బగ్గెలఁ బల్కుకొంచు నికఁ ♦ బట్టుఁడుకొట్టుఁడు కట్టుడంచు వే
దగ్గఱికేగి రెల్లరును ♦ దాశరథిన్ వడి ముట్టడింపఁగన్. 338

గీ॥ శర శరాసన తోమర ♦ శక్తి పరశు
శూల కరవాల శస్త్రాస్త్ర ♦ జాలములను
బూని, క్రోధ తామ్రాక్షులై ♦ ముట్టడింపఁ
బజ్జకేతెంచు రాక్షసా ♦ వళినిఁ జూచి. 339

ఉ॥ రాముఁడు రండు రండు సమ ♦ రంబునకంచు ఖరాది దైత్యులన్
దోమలుగాఁదలంచి తన ♦ దోర్బల మించుక చూపనెంచి, "మీ
తో మర ముద్గరంబులకు ♦ దోసిలియొగ్గునె రాచజోదు? సం
గ్రామముమాని హాయిగను ♦ గ్రామములన్ సుఖియింపుఁడెల్లరున్.

క॥ అని యెక్కువెట్టిన శరా
సనమును జూపించి "బ్రిదుకఁ ♦ జాలక యుద్ధం
బున కేతెంచుట దివ్యం
గని పైఁబడవచ్చు క్రిముల ♦ కైవడిఁ గాదే?" 341

గీ॥ చెలఁగి రా నౌనె బ్రిదుకుపైఁ ♦ దలఁపు లేక
అనుచు రౌద్రాకృతిన్ దాల్చి ♦ యాగ్రహమున
రక్కసులఁ జూచి శరధిని ♦ చక్కఁజేసి
రండు రండని యని సుస్థి ♦ రముగ నిల్చె. 342

శా॥ ఓంకారంబున కాలవాలమగు నా ♦ యోధుండు రక్షోబలా
హంకారంబు నణంపనెంచి, సుర లా ♦ హాయంచు నగ్గింపఁగా
హుంకారంబొనరించి, యుద్ధమున క ♦ త్యుత్సాహియై, వే ధను
ష్టంకారంబును జేసె దైత్యుల మన ♦ స్స్థైర్యంబు క్షీణింపఁగన్.

గీ॥ నారిపెరరేప నెఱుఁగక ♦ నారిఁ గోరి
రణమునకు వచ్చి రెప్పుడైన ♦ రాక్షసులకు
నారివలనన చావు చే ♦ కూరు ననుచు
నారి సారించె జానకీ ♦ నాథుఁ డతివ. 343

గీ॥ రాఘవుని ధనుష్టంకార ♦ రావ మపుడు
భూనభోంతరాళంబుల ♦ బోరుకలఁగి
నిండుకొనినంత దనుజుల ♦ గుండె లదరె
మతులు విచలించె నెంతయు ♦ ధృతి నశించె. 344

గీ॥ దనుజ మద గజ దర్ప నో ♦ త్సాహమునను
వీర రాఘవ సింహంబు ♦ భీకరముగఁ

జెలఁగి గర్జించె, దిగ్గజం ♦ బులు కలంగ
వనము కంపింప, దేవతల్ ♦ ప్రస్తుతింప. 346

సీ॥ బీరమ్ము మూర్తీభ ♦ వించిన చందాన
రామచంద్రుఁడు సుస్థి ♦ రముగ నిల్చి
ఖండనంబున కొండు ♦ మండనంబునుబోలి
యొక్కుమ్మడిన్ జాప ♦ మెక్కువెట్టి
కుండలీ కృత చండ ♦ కోదండ పాండిత్య
పటిమఁ గల్గిన బాహు ♦ బలముఁజూపి
సర్పంబులను బోలు ♦ శర విసరంబును
సంధించి యచల ల ♦ క్ష్యమును నిల్పి

గీ॥ విడిచినంతనె, రాక్షసుల్ ♦ విక్రమించి
భీక రాయుధ వితతిని ♦ విసరి రంత
రాఘవుఁడు వారి శస్త్రాస్త్ర ♦ రాశిఁ దునిమి
దనుజ వీరుల ఖండించె ♦ దయఁ దొలంగి. 247

గీ॥ దాశరథి తీవ్ర బాణముల్ ♦ దైత్య జీవ
పవనమున కుగ్ర కాలస ♦ ర్పంబులయ్యె
సగము సైనికుల్ కాలుని ♦ సదనమునకుఁ
జనిరి, మిగిలిన సైన్యంబు ♦ సన్నగిల్లె. 448

శా॥ ఢొక్కల్ ప్రక్కలువ్రక్కలయ్యెను,ఖ♦రుండున్ బోవరాఁడేమి? యే
ఫక్కిన్ బోయెనొ? కాలుఁడో హరుఁడొయీ♦బాలుండువీక్షింపఁగా
నొక్కండయ్యును పెక్కురన్ దునిమెనం♦చొక్కుమ్మడిన్ రక్కసుల్
ఒక్కం డొక్కనిఁజూడ కేడ్చిరపుడ♦య్యుగ్రాహవక్రీడలో, 349

గీ॥ ఖరుఁడు త్రిశిరుఁడు దూషణుం ♦ డురు బలాఢ్య
లన్నదమ్ములు ముగ్వురు ♦ నాహవమున
నెచటఁ గన్పట్ట రెచ్చోటి ♦ కేగిరొక్కొ?
అనుచుఁ గొందఱు వీక్షించి ♦ రఖిల దిశల. 350

మ. ఖరుఁ డేఁడీ ? త్రిశిరుండు దూషణుఁడు వీఁ♦క న్వచ్చిపోరాడి సం
గరనైపుణ్యముఁ జూప రేమి యని ర♦క్షస్సైనికుల్ కొంద తే
పెరవున్ గానక రాముబాణములకున్ ♦ భీతిల్లి విభ్రాంతిచే
మరణావస్థకుఁ జిక్కినట్లు మతి సం♦భావించి రప్పట్టునన్. 351

మ. ఖరుఁ డంత న్దల యెత్తి యుగ్రుఁడయి "ర♦క్షస్సేనలో నొక్కఁడేన్
దురముం బాసినసంహరింతు" ననినన్ ♦ దుఃఖించుచుం రాక్షసుల్
శరసందోహము రాముపై విసరుచున్ ♦ సంగ్రామరంగంబునన్
స్థిరులై నిల్చి పెనంగులాడి రపు డా♦శ్రీరాముఁ డత్యుగ్రుఁడై.

గీ. దనుజవీరులశస్త్రాస్త్ర♦ధాటిఁ జూచి
యోహటింపక యెల్లరి ♦ యుక్కణంచె
మోహవశమున దనుజులు ♦ మోహరించి
ముట్టడింపంగఁ దలఁచి ర♦ప్పురుషసింహు. 353

ఉ. దానవు లెల్లరుం గలిసి ♦ దాశరథిన్ వివిధాస్త్రశస్త్రసం
తానమునన్ వధింపఁగ మ♦నంబున నెంతయు నిశ్చయించి, దా
వానలకీల లేర్చి భయ♦దాటవి నొక్కట నాక్రమించుచం
దానఁ బరాక్రమించి భుజ♦దర్పముఁ జూపి రమోఘవైఖరిన్. 354

గీ. లీల విలు బూని నవ్వుచు ♦ లెక్కలేని
శరపరంపరలం రామ♦చంద్రుఁ డపుడు
దానవులపాదముల బాహు♦దండములను
శీర్షములఁ ద్రుంచె గృధ్రముల్ ♦ హర్ష మొంద. 355

పర్వతములట్లు దానవుల్ ♦ వసుధఁ గూల
భూరిరక్తప్రవాహంబు ♦ పొంగి పొరలె
ఖండనంబునఁ గలమాంస♦ఖండములను
గృధ్రములు సృగాలములు భ♦క్షించుచుండె. 356

కం. భూతప్రేతపిశాచ
వ్రాతము చెలరేఁగి దైత్య♦రక్తాసవమున్
చేతఃప్రీతిగఁ గ్రోలుచు
బేతాళునిమున్ను తాండ♦వించి రహించెన్. 357

గీ. దాశరథి బాణఖండిత♦దనుజమాంస
ఖండముల మెక్కి డుల్లిన♦ముండములను
తాళములఁ జేసి మ్రోఁగించి ♦ తాండవించెఁ
దనివి దీఱంగ నపుడు బే♦తాళుఁ డొకఁడు. 358

గీ. జలజనేత్రుని తీవ్రాస్త్ర♦శస్త్రసమితి
చిత్రవధఁ జేసె దైత్యుల♦గాత్రములను
దనుజశవములఁ బొడ్చి యాఁ♦త్రముల లాఁగి
కాకగృధ్రంబు లెగసెను ♦ గగనమునకు. 359

గీ. చంచువులనుండి దనుజాంత్ర♦సమితి వ్రేలఁ
జదల కెగసినగృధ్రరా♦జములఁ జూడ
వీరరాఘవు వలచిన♦విజయలక్ష్మి
గాలిపటముల విడిచిన♦కరణిఁ దోఁచు. 360

చం. కదనము వీరభోజ్య మను♦కైవడి శ్రీరఘురాముఁ డాడుచున్
బదిపది బాణముల్ విడిచి ♦ వైరులవక్షములన్ బగుల్పఁగా
నదవదఁ జెందుచున్ దనుజ ♦ లందఱు చిందఱవంద ఱౌట, హా
తుది యిది యంచు నాయకుఁడు♦దూషణుఁడు త్రిశిరుండు బెగ్గిలెన్.

చం. తరుణము తప్పివచ్చె నని ♦ ధైర్యముఁ బూని ఖరుండు, వానిసో
దరులును తాల్మిఁ బూని తమ♦దానవసైనికులన్ మఱల్చి "కా
తరు లయి యొక్కబాలకుని♦దంభముఁ గాంచి భయంబు బొంది సం
గరమున నోడి పాఱుదురె ♦ కాల్పనె మీభుజవీర్యశౌర్యముల్."

గీ. అనిన రాక్షసు లెల్లరు ♦ నహమహమిక
నాహవంబునఁ జెలఁగి మా♦యలను బన్ని
యొక్కటఁ ఘోరముగఁ బోరు♦చుండ సురలు
మ్రానుపడి చూచుచుండిరి ♦ దీను లగుచు. 363

గీ. మాయకున్ మాయకాఁ డయి ♦ మహి జనించి
మాయలన్ బన్ను నామహా♦మహునిమున్న
అల్పు లగుదానవులు పన్ని♦నట్టిమాయ
పనికిమాలినమాయ యై ♦ వఱలుఁ గాదె. 264

శా. "పాడిన్ దప్పినరాక్షసాధముల నే ♦ భంజించి ధర్మంబుఁ గా
పాడన్ వచ్చినవాఁడ" నంచు నిజమా♦యాశేముషీచాతురిన్
జూడన్ జాడకు రాక డాఁగె, వనమున్ ♦ శోధించి సాధింపుఁడీ
ఏఁడీ నల్లనిరాచవాఁ డని దిశల్ ♦ వీక్షించి రారాక్షసుల్. 365

ఉ. పెక్కు వచింప నేల ? రఘు♦వీరుఁడు పన్నినయట్టిమాయచే
నొక్కని నొక్కఁ డక్కట ర♦ఘూద్వహుఁ డంచుమదిభ్రమించియా
రక్కసులెల్లఁ జచ్చిరి ప♦రస్పరయుద్ధమునన్ క్షణంబులో;
లెక్కకు నొక్కఁడేన్ మిగుల♦ లే దని వేల్పులు సంతసింపఁగన్.

గీ. కడిమిఁ బదునాల్గువేలరా♦క్షసులతోడ
నొక్కరాముండు పోరాడు ♦ నొక్కొ యనుచు
సంశయించితిఁ దీఱె నా♦సందియంబు
అనుచు దేవేంద్రుఁ డెంతయు ♦ నభినుతించె. 367

గీ. కడకు ఖరదూషణాదిరా♦క్షసులు కూలి
ప్రాణములఁ బాసి రోరామ ♦ రామ యనుచు
దనుజు లేగిరి వైకుంఠ♦ధామమునకు
వారలయదృష్టమే మన♦వచ్చు నతివ. 368

గీ. హర్ష మిగురొత్తె సురపుష్ప ♦ వర్షమునను
దేవతాదివ్యదుందుభుల్ ♦ దిశల మ్రోఁగె
నభినుతించుచు నచ్చర ♦ లాడి పాడి
రఖిలదిశలఁ దేజఃపుంజ ♦ మాక్రమించె. 369

గీ. భళిర ! ని వ్వంటుకొన రామ ♦ భద్రుఁ డింక
రావణు వధించు ననుచు ధై ♦ ర్యమున నకల
నరులు, సురలును, సన్మునీ ♦ శ్వరులుఁ జెలఁగి
ప్రస్తుతించిరి రాక్షస ♦ భయముఁ దక్కి. 370

ఉ. అంతట లక్ష్మణుండు జన ♦ కాత్మజతో నట కేగుదెంచి, దే
వాంతకు లెల్లరుం బడసి ♦ రంచు నుతించెఁ; దనంతఁ దా మన
శ్శాంతిని బొంది యాత్మవిభు ♦ శ్యామలకోమలదేహకాంతి క
త్యంతముదంబుఁ బొందె జన ♦ కాత్మజ ప్రేమరసంబుఁ జిల్కుచున్.

గీ. రాక్షసులతోడి ఘోరసం ♦ గ్రామ వేళఁ
దాపవరిత ప్త మైనసీ ♦ తామయూరి
దాశరథిదేహమేఘసం ♦ దర్శనమునఁ
జల్లఁదనమును బొందెఁ దా ♦ నుల్లమునను. 372

గీ. అసురులను వధించి లోకుల ♦ కభయ మొసఁగి
దాశరథి సీతతోడ సో ♦ దరునితోడ
నఖిలమునులును దాపసు ♦ లాశ్రయింపఁ
బంచవటియందు నివసించె ♦ భద్రముగను. 373

కం. ఖరదూషణాదిదనుజుల
మరణంబును జూచి యేడ్చి ♦ మానస మెరియన్
దురహంకారముతో న
త్వరముగ నాచుప్పనాతి ♦ పఱచెన్ భీతిన్. 374

చం. నడుము వడంక, రక్తనయ♦నంబుల నశ్రువు లూఱఁ, బాదముల్
తడఁబడ, భీకరాస్యమున ♦ దైన్యము తాండవమాడ, గుండియల్
దడదడ బిట్టుకొట్టుకొన ♦ దంష్ట్రల గీఁటుచుఁ గేళ్ళు దాఁటుచున్
బడుచును లేచుచున్ దనుజ♦భామిని రావణుఁ జేరి యిట్లనున్.

శా. అన్నా ! కొంప మునింగె, సంతతము మ♦ద్యాస్వాదనాసక్తిచే
మిన్నున్మన్నును గానకుంటి విపుడే ♦ న్మేలొక్కమ్మ, నీరాజ్యము
న్నిన్ను న్నాశముఁ జేయుదోర్బలునిఁ గం♦టిన్, గాంతతోఁ దమ్ముతో
నున్నాఁ డాతనిఁ జూడు పంచవటిలో ♦ నుద్దండకోదండివై. 376

నీమతలఁ దన్నువిలుకాఁడు ♦ నీకుతలలఁ
దునుమనున్నాఁడు, కొందఱఁ ♦ దునిమినాఁడు;
వసుధఁ గలవీరులన్ జంపి, ♦ వాని విడిచి
యోరిజార్భాగ్యుఁడా యెట్టు ♦ లోర్చి తీవు. 377

వినుము తగువివేకము లేని♦విద్యకరణి
దానధర్మంబులకు రాని♦ధనముగతిని
భగవదిచ్ఛకుఁ గానిత♦పంబుభంగి
నీతి లేనినీరాజ్యంబు ♦ నిష్ఫలంబు. 378

సాంగత్యవశమున ♦ సన్న్యాసి నశియించు
రాజు నశించు దు♦ర్మంత్రివలన
మానంబువలనను ♦ జ్ఞానంబు వినశించు
సిగ్గు నశించును ♦ శీధువునను
అవినయంబునఁ బ్రీతి ♦ ఖ్యాతి నశించు, న
హంకారమున గుణ ♦ మంతరించు
చౌర్యంబువలనను ♦ ధైర్యంబు వినశించు
నవినీతివలన రా♦జ్యము నశించు

గీ. అగ్ని రోగంబు శత్రుత్వ ♦ మఘము పాము
చిన్న వని మిన్నకుండినఁ ♦ జేటుమూడు;
నహహా! యైశ్వర్యమదమున ♦ నాదమఱచి
నీవుఁ దెఱుంగక మసలెదు ♦ మేలుకొనుము. 379

శా. అన్నా! కాలము దాపరించె విను మా♦హా! నాకుఁ గన్నాకుగా
నున్నా వన్నబలంబు, దైత్యులకు ధై♦ర్యోత్సాహముల్ తగ్గె; నా
బన్నం బే మని సిగ్గు లేక సభలో ♦ వాకుత్రు; నీ వుండఁగా
వ న్నొక్కండు పరాభవించె నకటా! ♦ నాజన్మముం గాల్పనే.

గీ. అనుచుఁ దనమోళ్ల బాష్పంబు♦లను త్యజించి
మొగము నెత్తక తననత్తి ♦ మొత్తుకొనెడు
శూర్పణఖఁ జూచి లేచి ర♦క్షోవిభుండు
ఎలమిఁ గూర్చుండఁబెట్టి తా ♦ నిట్టు లనియె. 381

గీ. చెల్లెలా! యేటి కేడ్చెదు ♦ చెప్పు వేమి
జరిగినయదంత మంతయు ♦ జంకుఁ దక్కి
ఎవఁడు నీముక్కు వీనుల ♦ నిట్లు తునిమె
ననిన విని యాపె లేచి యి♦ ట్లనియె నపుడు. 382

గీ. వినవొ దశరథభూపాలుఁ ♦ డనెడువాని
నతనిపుత్త్రులు సుగుణాఢ్యు ♦ లతులబలులు
రామలక్ష్మణు లనువారు ♦ రాక్షసేంద్ర!
వేఁటకై వచ్చియుందురు ♦ విపినమునకు. 383

గీ. వార లిరువురు రాక్షస♦వీరవరుల
మల్లచఱచి వేఁటాడి రా♦మాట కేమి?
చూడఁ దగు నొక్కచక్కని♦చుక్క యహహా!
వారితో వచ్చె వీక్షింప♦వలయు నీవు. 384

గీ. అవనిఁ గలమౌనివరులకు ♦ హర్ష మెసఁగ
సకలరాక్షసవీరుల ♦ సంహరింపఁ
గంకణముఁ గట్టుకొన్నట్టి♦కరణిఁ దోఁచు
వారిచందంబు సంశయా♦స్పదము మనకు. 385

గీ. బాలురా? దైత్యులకు మహా♦కాలు రేమొ?
ధరణిభారంబు వారింపఁ ♦ దగుదు మనుచు
దలఁచి వచ్చినవరధను♦ర్ధరులు వారు
వారి మించినవిలుకాండ్రు ♦ వసుధ లేరు. 386

గీ. అందు రాముండు సాహసి♦కాగ్రగణ్యుఁ
డతని మించినబలవంతుఁ ♦ డవని లేఁడు
వానిప్రాపున నెంతయు ♦ భయము దక్కి
మసలుచున్నారు వనమున ♦ మౌనివరులు. 387

గీ. అతఁ డసురాంతకుండు కా♦లాంతకుండు
అతనిచెల్లెలు నేఁ జెప్పి♦నట్టికాంత
చక్కఁ దనమున కిక్కయై ♦ యాసన్నుతాంగిఁ
బడయఁ జాలనివానిజీ♦వనము వనము. 388

ఉ. ఆయపరంజిబొమ్మ భువి ♦ నన్నులమిన్నల కెల్ల మండనం
బా మెలనాఁగ మన్మథున ♦ కాఱవబాణము, సాటి లేనియా
తోయజపత్రనేత్ర, రతి♦తో నుపమింపఁగ రానిసాని, యా
హా! యసురేంద్ర! లోకముల ♦ కాసతిరూపము దివ్యదీప మౌ.

శా. పంతం బూని విరించి, నైపుణికి న♦బ్బామన్ సృజించెన్, రతీ
కాంతుం డాసతిరూపుఁ జూచిన రతిన్ ♦ గామించి ప్రేమింపఁ డా
వంతైనన్; చనుమా, లతాంగిఁగొనుమా♦యాలింపు మింతేటి కా
కాంతారత్నము నీమహాన్నన కలం♦కారంబుగా భాసిలున్. 390

శా. ఔరా! చక్కఁదనాలకుప్ప యగునా♦యంభోజపత్రాక్షిశృం
గారం బించుక చూచినన్ పరసతిన్ ♦ గాంక్షించి వీక్షింప వా
నారీరత్నముఁ బోలునారి గలదా ♦ నాకంబులోఁ; నట్టియొ
య్యారిం గూడనినీదుజీవనము శూ♦న్యం బంచు నూహించెదన్.

గీ. అవయవంబుల వర్ణింప ♦ నలవి గాదు
తరుణిలావణ్యము నుతింపఁ ♦ దరము గాదు
అతివయందంబుతోడ స♦హస్రకోటి
రతుల సృజియింపవచ్చును ♦ రాక్షసేంద్ర. 392

గీ. ఆలతాంగిని బెండ్లాడి♦నట్టివాఁడు
మూఁడుజగములఁ బాలించు♦తేఁడు; వినుము
అవని వాఁడు జీవన్ముక్తుఁ ♦ డనఁగఁ బరఁగు
ముదితఁ బరికించినన్ నీకు ♦ విదిత మగును. 393

ఉ. రక్కసి వంచుఁ గ్రూరుఁ డగు♦రావణుసోదరి వంచు వారు నా
ముక్కును వీనులం దునిమి ♦ పొమ్మని నేలకుఁ ద్రోసి రక్కటా
వెక్కుచుఁ బొక్కుచున్ దనుజ♦వీరవరుల్ నివసించుచక్కికిన్
గ్రక్కునఁ బోయి, మున్ఖరునిఁ♦గాంచి వచించితినాయుదంతమున్.

గీ. అతనియానతి రాక్షసు ♦ లలిగి దాడి
వెడలి రప్పుడు పదునాల్గు♦వేలమంది;
రాముఁ డొక్కండ పోరాడి ♦ రణమునందు
నందఱన్ జంపె ఖరదూష♦ణాదిబలుల. 395

గీ. శూర్పణఖనఁట రావణు♦సోదరినఁట
నిరపరాధినినఁట నాకె ♦ నీచు లైన
జనులచే నిట్టియాపద ♦ సంభవించె
నితరులకు నేమి వచ్చునో ♦ యెఱుఁగరాదు. 396

గీ. అనుచుఁ గనుదోయి బాష్పంబు♦లను త్యజించి
బోరు మని యేడ్చి, యకట నా♦మూలమునను
సకలవీరవరేణ్యులు ♦ చచ్చి రనుచు
గుండియల బాదుకొనెఁ జాన ♦ కొలువులోన. 397

ఉ. "ఆఁ" యని వక్త్రముం దెఱచి ♦ హా పదునాలుగువేలరక్కసుల్
నాయకు లొక్కబాలునిశ♦రాహతి నీల్గిరె యెంతవింత యహా
రా యని లేచి మండిపడి ♦ రావణుఁ డెంతయు నాగ్రహంబునన్
ఛీ యని యేవగించెఁ దన♦చిత్త మొకించుక తత్తఱిల్లఁగన్. 398

గీ. మంచి దని యూపె నోదార్చి, ♦ మానసమున
నడలఁ బని లేదు పో మ్మింక ♦ నంతిపురికి
ననుచుఁ దనబల్మిఁ బట్టి ధై♦ర్యంబుఁ జెప్పి
కొలువు చాలించె నపుడు ర♦క్షోవిభుండు. 399

శా. "ఏమీ మాపదునాల్గువేలదనుజుల్ ♦ హీనంబుగాఁ జచ్చిరే?
రాముం డెవ్వఁడు? లక్ష్మణుం డెవఁడు? సం♦గ్రామంబునం దోఁటిమై
నేమాడ్కి న్ఖరదూషణాదులను తా ♦ హింసించె రాముం డహో
సామాన్యం డగునొక్కబాలకునకున్ ♦ సాధ్యంబె సాధింపఁగన్.

గీ. అమర దానవ మానవ ♦ యక్ష నాగ
గరుడ గంధర్వ కిన్నరా♦ద్యురుబలాఢ్యు
లని నెదుర్పఁగ లేరు నా♦యనుచరులను
అందు ఖరదూషణాదు ల♦త్యధికబలులు. 401

మ. తలపోయన్ ఖరదూషణత్రిశిరు లే♦తన్మాత్రులే? నాకుఁ దు
ల్యులు, దేవాంతకు లన్నఖ్యాతిఁ గలధీ♦రోదారు లేరీతి వా
రలతోఁ బోరి వధించెనో యకట (శ్రీ)♦రాముండు బాలుండు త
త్ఫలమున్ రామున కందఁ జేసెదను మ♦ద్బాహాబలప్రౌఢిమన్.

గీ. నన్ను ఖరదూషణాదుల ♦ మన్నిగొనఁగ
స్వల్పకార్యంబె నరులకు ♦ సాధ్య మగు నె?
అట్టియెడ బాలుఁడఁట, భీక♦రాహవమునఁట
చెలఁగి వధియించెనఁట విశ్వ♦సింప నగు నె? 403

కం. 'పగఁ బూని రాము నాకృతి
భగవంతుం డిట్లు పాప♦భార మణఁపఁగా
దగ జనియించెనొ మానవ
జగతిన్ నే విశ్వసింపఁ ♦ జాలను కలనేన్. 404

కం. దైవంబఁట భువి మానవ
భావంబున నవతరించు♦వాఁడఁట మమ్మున్
దేవాంతకులఁగ బొరిగొని
జీవించున శంభుఁ డైన ♦ శ్రీపతి యైనన్. 405

గీ. అతఁడు దైవంబ యగుఁగాక ♦ హాని యేమి?
దైవమే యైనఁ దామస♦తనువు బాసి
సంసరణవారిధిఁ దరించి ♦ శాశ్వతముగ
ముక్తికాంతను గైకొందు ♦ ముఱియుచుందు. 406

గీ నేను గైకొన్నవరముల♦నియతిఁబట్టి
రాముఁ డొకమానవుం డైన ♦ రణమునందు
నను వధింపఁగఁ జాలఁ డే♦నాఁటి కైన;
వాని నేఁ జంపి చేకొందు ♦ వానిసతిని." 407

కం. అని యిట్లు రావణుఁడు న
మ్మనమునఁ జింతించి మంత్రి ♦ మారీచునకున్
తనభావము నెఱిఁగింపఁగఁ
జనియెన్ రథ మెక్కి యతని♦స్థానంబునకున్. 408

సీ. శ్వేతాతపత్రంబు ♦ శీర్షంబుపైఁ గ్రాల
రమణులు సితచామ♦రముల వీవ
గరుడునివేగంబు ♦ నిరసింపఁగాఁ జాలు
ఖచరముల్ గలిగిన♦ఘనరథమున
మునులచిత్తంబుల ♦ మోహింపఁగాఁ జేయు
వనముల నదులను ♦ బర్వతముల
హ్రదసరోవరముల ♦ నాశ్రమంబుల నగ
రంబులఁ బల్లెల ♦ గ్రామములను

గీ. వేగముగ దాఁటుకొనివచ్చి ♦ వివిధలతల
రమ్యముగఁ గ్రాలుజలధితీ♦రంబునుండి
అతివిశాలప్రదేశంబు♦నందుఁ జొచ్చి
ప్రకృతిసౌందర్యముం జూచి ♦ ప్రస్తుతించె. 409

సీ. సతతంబు నచ్చోట ♦ జలజంతుసంతాన
కోలాహలము భీతిఁ ♦ గొల్పుచుండు
నెలమి నాకసమున ♦ కెగసి తజ్జంతువుల్
జలదములట్లు గ♦ర్జనము సేయు
జలజంతుసముదాయ♦బలమును వర్ణింప
శక్యమే యాసర♦స్వతికి నైన
వనధితీరంబున ♦ బంగారుటిసుకపై
సంచరించుఁ దదీయ♦సంచయంబు

గీ. తరుణి! తత్తీరసంజాత♦తరులతాని
కుంజపుంజంబు మునిజన♦రంజనంబు;
తన్మనోహరప్రకృతిసౌం♦దర్య మరయఁ
గంజభవునకు నైన శ♦క్యంబు గాదు. 410

గీ. అనిన విని దైత్యనాయకుఁ ♦ డనిరొ నిట్లు;
"ఏమిచెప్పెదు విపరీత ♦ మెపుడు వినము,
బెండులు మునింగ మనుమున్ను ♦ గుండు లకట
తేలుఛే యింక శేషించె ♦ ధీవరేణ్య!. 423

ఉ. బాలుఁ డొకండు వచ్చి మన♦వారల నెల్లర సంహరించె, భూ
పాలురయింటిబిడ్డఁడఁట ♦ బాపురె వానిపరాక్రమంబు ము
వ్వేలుపులందు లేదఁట, భు♦వి మనవారికి వైరి యైనయ
య్యాలరిపేరు రాముఁడఁట, ♦ యాతనిఁ జంపక మిన్నకుందుమే?.

గీ. ఇంతులకుమేలు, వంటపా♦లంతిచూలు
ఖానియిల్లాలు పూవింటి♦వానివాలు
బాలుకేరింటిపోఁడియాలు; ♦ సకియ నేలు
ఖరువుఁ జూపింపఁ బోలు, నా ♦ కంతె చాలు. 425

గీ. మాయయును మర్మములు మహో♦పాయములును
వినుము వెన్నతోఁ బెట్టిన♦విద్య నీకుఁ
జేయఁ దగుకార్య మిది యంచుఁ ♦ జెప్పవలెనె
టక్కు లెఱిఁగినముదుసలి♦నక్క వీవు. 426

గీ. పాడి విడనాడి నేఁడు పూఁ♦బోఁడికొఱకుఁ
బైఁడిలేడి వై వంచింప♦వలయు నీవు;
శౌర్యమునఁ గాకయుండినఁ ♦ జౌర్యమునను
సీతఁ జేకొని సుఖయింతుఁ ♦ జేత మలర. 427

మ. ప్రళయం బైనను, లంకకుం జెడుఁగు సం♦ప్రాప్తించినన్, రాక్షసుల్
కలనం గూలిన, మూఁడువేలుపులు న ♦ న్గారింప దం డెత్తినన్
చల మేపారఁగ రాముఁ జంపియును నన్ ♦ చౌర్యంబుచేనైన, నా
లలనం గూడిన మూఁడులోకముల వా♦ల్లభ్యంబు లభ్యం బగున్."

గీ. అనిన నా నని తలయూచి ♦ యుపహసించి
అసురులకుఁ గాల మేతెంచె ♦ నని తలంచి
రమణిని హరింపవలె నను♦రాక్షసేంద్రు
పట్టుదలఁ జూచి మారీచుఁ ♦ డిట్టు లనియె. 429

శా. "రక్షోనాయక! దుష్టశిక్షణుఁడు శ్రీ♦రాముండు సామాన్యుఁడే
సాక్షాద్విష్ణువు గాక మానవుఁడె? యీ♦సంరంభమున్ దక్కు, లం
కాక్షేమంబుఁ దలంచి రామునిసతిన్ ♦ గామింపుమా, యానత
త్రయ్యక్షుం డబ్జదళేక్షణుండు జగద♦ధ్యక్షుఁడు వాఁ డల్పుఁడే. 430

గీ. స్వప్నమో కాక జాగ్రద♦వస్థ యగునె?
నేను విన్నది యక్కటా ♦ నిక్కువంబె?
రాముఁ డేతెంచె నేమి? త♦న్నామమునను
శత్రుకోటికి మరణంబు ♦ సంభవించు.

431

శా. అన్నా! కోపమునింగెనా యొడలు"రా"♦యన్నంతఁ గంపించు,"రా
మన్నా"యన్న మనంబు ఝల్లుమను, నో♦క్కం బేసి గెంటింపఁడే
న న్నానాఁడొక వేయియామడలకున్ ♦ వారాశిపర్యంతమున్;
విన్నావా? రఘురాముఁ డల్పుఁడె మహా♦విష్ణ్వంశసంభూతుఁ డౌ.

క. అతిధృతిఁ గల శ్రీరాముఁడు
శతధృతికిన్ దండ్రి చూవె; ♦ చచ్చినవారిన్
బ్రతికింపఁగ, ఖేదించిన
దతికింపఁగ నోపు నాతఁ ♦ డసురవరేణ్యా!. 433

చ. వనమున నొక్కతూపున సు♦బాహువుఁ దాటకఁ జంపె, లోకమం
దనుపమవీరు లైననృపు ♦ లందఱుఁ జూడఁగ శైవచాపమున్
దునిమె క్షణంబులోన, ఖర♦దూషణరక్షితరాక్షసావలిన్
మునులు నుతింపఁగా యమని♦కేతనమునకుఁ బంపె నమానుషంబుగన్.

గీ. విను మహవిరాధుఁ డెంతటి♦వీరవరుఁడు
వాని నవలీలఁ దునిమె నీ♦బాలకుండు
ఈయమానుషకార్యంబు ♦ లెంచిచూడ
మాావిభుఁడు గాక రాముండు ♦ మానవుండె ?. 435

చ. మనకు విమానముల్ గలవు ♦ మాయలఁ బన్ని రణం బొనర్పఁగా
దనుజులసేనయున్ గలదు ♦ ధాత యొసంగినమేల్ వరంబులున్
అనుపమశస్త్రముల్ గల వ♦టంచుఁ దలంచి పరాక్రమించి రా
ముని నెదురింపఁగాఁ జన ద♦మోఘము వానిశరంబు భూవరా !.

గీ. ఏ నెఱుంగుదు శ్రీరాముఁ ♦ డెట్టివాఁడొ,
భోలుఁ డని మానవుం డని ♦ వైర మెంచి
అతనియిల్లాలి నక్కటా ♦ యపహరించి
సౌఖ్యములఁ బొందలేవు రా♦క్షసవరేణ్య !. 437

గీ. వానిప్రాఁబోణిని హరించి ♦ వత్తువేని
కోరి లంకకు మృత్యువున్ ♦ గొనినయట్లు
సంశయము లేదు నీవంశ♦వంశవనికి
నరయ నాబాల ఘోరదా♦వాగ్నికీల. 438

ఆ. వె. కడుపులోనిచల్ల ♦ కదలకుండఁగ నింట
నుండలేక వాని♦యుండ కేగి
లేనిహానిఁ దెచ్చి ♦ క్లేశంబుఁ బొందంగఁ
దగదు తగదు నీకు ♦ దనుజనాథ !. 439

క. అన్యుఁ డెవఁడైన రామ య♦న్నంత నాదు
నొడలు కంపించు నెడఁదలో ♦ నడలు వొడము
స్నేహితుఁడ సుమ్ము విను మింక ♦ నాహితమ్ము
ఇతరసతిఁ గోరు మతనితో ♦ నేల పోరు ?౫. 440

మ. అనినన్ దానవనాథుఁ డిట్లనియె "బా♦హాటంబుగా దిట్టవై
మనుజుం డొక్కఁడు దైవ మంచు భళిరా ♦ మారీచ నీనీచబు
ద్ధిని జూపించితి వంతె కాక" యని యు♦ద్రేకించుకోపంబునన్
కనియెన్ గన్నులు జేవుఱింపఁగ నహం♦కారంబు ఘోరంబుగాన్.

గీ. ఉగ్రుఁడై లేచి హుమ్మని ♦ హుంకరించి
ఔదలల నూచి మే లంచు ♦ నొడుగఱచి
"దానవుఁడ వయ్యు నాసన్ని♦ధానమునను
వైరిఁ బొగడెదవో నాదు♦బలిమి మఱచి. 442

ఉ. ఆలమునందు నన్ను యముఁ ♦ డైన జయింపఁగఁ జాలఁ డష్టది
క్పాలురు నాదుసేవకులు; ♦ గాలియుఁ గీలియు నంశుమాలియున్
శూలియుఁ దమ్మిచూలియును ♦ శూరతఁ దక్కు యణంగియుండ నీ
బాలుఁడు నన్నుఁ జంపు నన♦వచ్చున చెప్పుమ మంత్రిసత్తమా!.

గీ. ప్రియతముండవె నీచమా♦రీచ కోఁచ
గురువుచందాన హితము వా♦క్రుచ్చె దీవు
నే జయింపక మిగిలిన♦రా జెవండు?
నాకు నీ డెవ్వఁ డీరేడు♦లోకములను ?. 444

గీ. ముదుసలివి నీకు నుంతయు ♦ బుద్ధి లేదు
నేను జెప్పినచొప్పునన్ ♦ వెడలవేని
విడువ" నని తర్జనిం జూపు♦విభునిఁ జూచి
సంశయముఁ బొందె నావృద్ధ♦జంబుకంబు! 445

గీ. బల్లిదుఁడు వీఁడు వీనితో ♦ వాద మేల ?
పరమపాపాత్ముఁ డితనిచేఁ ♦ బడుటకంటె
నాదినారాయణుం డిట్టు ♦ లవతరించి
ననఁ దగినరాముచేఁ జచ్చు ♦ టరయ మేలు. 446

గీ. శస్త్రధారునితోడ, భి♦షక్కుతోడఁ,
బ్రభువుతో, మర్మ మెఱిఁగిన♦వానితోడఁ,
బండితునితోడఁ, గవితోడ, ♦ బలియుతోడ,
ధనికుతో, మూర్ఖుతో, విరో♦ధంబు తగదు. 447

గీ. అనుచు లోలోనఁ దలఁచి యి♦ట్లనియె నతఁడు
నీదుపదపద్మదాసుఁడ ♦ నీదునాజ్ఞ
నతిచరింపంగ శక్యంబె ♦ యజున కైన
నసురనాయక ! రమ్ము నా ♦ కానతిమ్ము. 448

చ. అన విని సంతసించి యసు♦రాధిపుఁ డాతని వీపుఁ దట్టి "మా
దనుజకులోత్తముండ వని ♦ ధైర్యము సాహసముం గలట్టి నిన్
ఘనముగ మెచ్చుకొంటి" నని ♦ గ్రక్కున రమ్మని వానితోడ వే
వనమునకున్ బయల్వెడలెఁ ♦ బంచవటిన్ గలజోటిఁ జూడఁగన్.

గీ. అంత మారీచుఁ డెంతయు ♦ సంతసమున
నతని వెంబడి నేగుచు ♦ "సార ! నేఁటి
దినము సుదినంబు శ్రీరాము♦దివ్యమూర్తి
దర్శనముఁ జేసి తనువు సా♦ర్థక మొనర్తు. 450

గీ. తన్ను వగ నైనఁ బగ నైన ♦ నెన్నువాఁడు
మోక్షసామ్రాజ్యలక్ష్మితో ♦ మురియుఁ గాదె
దాశరథిఁ గొల్చెదన్ విరో♦ధమున నైన
నతని కర్పింతుఁ బ్రాఁడుదే♦హమును నేఁడు. 451

గీ. మునులు యోగులు నెవనిద♦ర్శనముఁ గోరి
వనమునఁ దపించుచుందు రా♦భవ్యమూర్తి
నేఁడు విలు బూని నన్ను వె♦న్నాడుఁ గాదె
పావనం బగు భళిర ! నా♦జీవనంబు. 452

గీ. రామునిశరంబు నాశరీ♦రంబుఁ ద్రుంచుఁ
పాపపంకిలసంసార♦వార్ధి దాఁటి
సంతతము మోక్షకాంతతో ♦ సంచరింతు
సఫల మగుఁ గాదె నేఁడు నా♦జన్మ మహహ". 453

గీ. ఇట్లు పరిపరివిధముల ♦ హృదయమునను
అరయుచున్ వాఁడు రావణు ♦ ననుగమించె;
వార లిరువురు దుర్గమ♦పథము దాఁటి
పంచవటిఁ జేరి మువ్వురఁ ♦ గాంచి రపుడు. 454

సీ. అపరంజి కెర విచ్చు♦నందంబు గలమేను
దిక్కుల మెఱుపుల♦దీప్తినింప
నేత్రపర్వము గాఁగ ♦ నెమ్మేనిచుక్కలు
నవరత్నములకాంతి ♦ నవధరింప
కెందమ్మిచందంబుఁ ♦ గ్రిందుసేయుచుఁ జాల
ముద్దు లొల్కెడుమోము ♦ మురువుఁ బెంప
వజ్రంపుఁదళుకులఁ ♦ బ్రిభవింపఁగాఁ జేయు
కమనీయధవళోద♦రము రహింపఁ

గీ. చూడ మిగిలినయవయవ♦స్ఫూర్తి యహహ
చక్కఁదనమున కొకసొంపు ♦ సంఘటింపఁ
కపటమృగవేష మూని రా♦క్షసులమంత్రి
పంచవటియందు నందందు ♦ సంచరించె. 455

గీ. తనదుచిత్రవిచిత్రగా♦త్రంబుఁ జూచి
రంగులహొరంగుఁ గాంచి యా♦బ్రహ్మ యైన
బుద్ధి విచలింప విభ్రాంతిఁ ♦ బొందు నన్న
నన్యులం గూర్చి వచియింప ♦ నలవి యగునె ?. 456

గీ. చూచుచుండఁగఁ దనయున్న ♦ చోద్యముగను
పూర్వరూపంబుఁ బాసి య♦పూర్వ మైన
మృగమునాకృతిఁ గొన్నమా♦రీచుఁ జూచి
అక్కజముఁ బొందె నెంతయు ♦ నసురవిభుఁడు. 457

గీ. పచ్చికబయళ్ళఁ దనదుసొం ♦ పచ్చుపడఁగఁ
చంగుచంగున దాఁటి హొ♦రంగుఁ జూపి
జానకిన్ బేలుపుచ్చంగ ♦ సంచరించుఁ,
గనవు మెసఁగుచు నెసఁగు నా♦కపటమృగము. 458

కం. వెఱచినగతిఁ జూపట్టుచు
వెఱచఱచుచు, వెఱపు లేని♦విధమునఁ బూఁనిన్
గఱచుచు, జానకి చూడఁగఁ
దఱచుగ నట కేగి క్రేళ్లు♦దాఁటుచు నుండున్. 459

గీ. ఆశ్రమముపొంత నించుక ♦ విశ్రమించు,
విశ్రమించి యొకించుక♦వెఱపుఁ జూపి
దిక్కులకుఁ జూచుఁ జంచల♦దృష్టితోడ,
వెండి యెటనుండియో బయల్♦వెడలుచుండు. 460

కం. ఇటుఁ జూచుచు నటు పాఱును
అటు పాఱుచుఁ గార్య మున్న♦యట్లెచ్చటికో
తటుకునఁ బోవుచు నాఁకటఁ
గటకటఁబడినట్లు వచ్చి ♦ కసవున్ మెసఁగున్. 461

ఉ. మందను బాసి యచ్చటి క♦మందగతిన్ జనుదెంచినట్లు లం
దందు మెలంగుఁ, బచ్చికబ♦యళ్ళను లీలఁ జరించు, నంతలో
నందడి నాలకించినటు ♦ చంగున దాఁటి సమీపమందుఁ నా
సుందరి చూడఁగన్ బెదరు♦చూపులఁ జూచి తొలంగు వెండియున్.

క. తోలఁగున్ బులుఁగులధ్వని విని
మెలఁగున్ భూదరిండ్లఁ దూఱి ♦ మెలఁకువతోడన్
కలఁగున్ దుప్పిళ్ళింతలతోఁ
జెలఁగున్ దను సీత జూడఁ ♦ జెలు వలరారన్. 463

గీ. జనకపుత్త్రిక కుసుమాప♦చయముఁ గోరి
పూవులం గోయుచున్ దన♦పొంత నెలమి
మిగులచన వున్నచందాన ♦ మెలఁగుచున్న
కనకమృగమును గాంచి యా♦శ్చర్యముఁ బొందె. 464

ఆ. వె. జంకుఁ గొంకు లేని♦జింకను పరికించి
చేష్ట లుడిగి నిల్చె ♦ క్షితితనూజ
ఆపె తన్నుఁ జూచి ♦ యలరుచున్నకొలంది
మురువు హరువుఁ జూపి ♦ మురిసె నదియు. 465

క. అవయవశృంగారముతో
నవరోధము లేక చెలఁగు♦హరిణముఁ గని తా
నవధారు దేవ యనుచును
అవనీసుత భర్తఁ బిల్చె ♦ నత్యాసక్తిన్. 466

ఉ. జంకును గొంకు లేక పలు♦చాయలఁ దిమ్మర నేగుదెంచు నే
ణాంకునియిట్టి కాదు గద, ♦ యల్బర మయ్యెను; సొంపు నింపునీ
జింకను జూడుఁడీ యహహ ♦ చిత్రవిచిత్రము దానిపొంకమున్
బింకముఁ జూడుఁడీ యిది ల♦భించు నుపాయ మొకింత చూడుఁడీ.

ఉ. చక్కనిచుక్కలైననెఱ♦జాణలకన్నుల లేనియంద మే
ఫక్కిని సంగ్రహించెఁ? సుమ♦బాణుసతీమణితోఁటనుండి యీ
చొక్కపుఁబైఁడిలేడి భువి ♦ సుందరులన్ గికురింప వచ్చెనో?
చిక్కినా చిక్కదో యకట ♦ చిత్తము తల్లడ మొందె వల్లభా!

మ. అదిగో చెంగున దాఁటుచున్ బొదలలో ♦ నందంపుఁ దట్టాడె; న
ల్లదిగో పచ్చికయందుఁ బండుకొనె మై ♦ నందంబు పెంపొంద, న
మ్ముద మేపారఁగఁ జేరవచ్చుహరిణం♦బున్ గూర్మి మాచూచె న
ల్లదిగో చూడుము, చూచి పట్టుకొనుఁడీ ♦ యాలస్య మిం కేటికిన్?.

కం. చకచకలఁ బోవుదానిని
తికమకలం బెట్టి మేని ♦ తీరు రణఁచి వడిన్
సుకరంబుగఁ బట్టుఁడు త
త్సుకుమారశరీరకాంతిఁ ♦ జూచి రహింతున్. 470

మ. కనులన్ జూచి యొకింత దానితనుశృం♦గారంబు వర్ణింపఁగా
వనజాతాననురాణి కైన వశమా ♦ భావింప; మీ రెట్టులేన్
జని బంధింపుఁడు, లేక చంపియయినన్ ♦ చర్మంబు నా కిచ్చినన్
దనివిన్ బొందెదఁ గాక, వే వెడలుఁడీ ♦ నాముద్దుఁ జెల్లింపుఁడీ.

గీ. అనిన విని రాముఁ డంత మా♦యామృగంబు
నందమున్ జందమున్ గని ♦ యమరకార్య
నాటకంబున కియ్యది ♦ నాంది యనుచుఁ
దనదునటనంబునకు వేళ ♦ తటిసె నంచు. 472

చం. జడలను సంస్కరించి తను ♦ జానకి చూచి హసింపఁ గాసెతో
నడుము బిగించి స్వర్ణహరి♦ణంబును గాంచి తదీయచేష్టలన్
సుడివడినట్లు తమ్మునకుఁ ♦ జూపుచుఁ దూణముఁ జక్కఁజేసి, యొ
వ్వడుపున నైనఁ దెచ్చెద ధ్రు♦వం బని చే విలు బూని నవ్వుచున్.

గీ. "ఇవ్వనంబున రాక్షసు ♦ లెల్లవేళఁ
దారుచుందురు నే వచ్చు♦దనుక నీవు
తమ్ముఁడా! కాచుచుండుము ♦ ధరణిసుతను
భయము లే దని బోధించి ♦ బయలు వెడలి. 474

ఉ. హాటకచేలకాంతి హరి♦దంతములందు వెలుంగఁగాఁ జగ
న్నాటకసూత్రధారి రఘు♦నందనుఁ డంతట నేపుమై ధను
ష్కోటులు వంగఁగాఁ గుణముఁ♦గూర్చి యొకించుక యెక్కువెట్టి పూఁ
దోఁట జరించునక్కపట♦ధూర్తమృగంబును వెంబడింపఁగాఁ. 475

ఉ. చంగున దాఁటి పూఁబొదల♦సందులలోన మెఱుంగి చూచుచున్
శృంగయుగంబు తీవలకుఁ ♦ జిక్కినయట్లు పెనంగులాడి యు
ప్పొంగుచు రాఘవుండు తన♦పొంతకుఁ బట్టుకొనంగ వచ్చుచుం
డం గని తక్షణంబ హరి♦ణంబు తొలంగు మఱొండుచోటికిన్.

గీ. చేరువ మెలంగు వెంటనే ♦ దూరమునను
పచ్చికబయళ్ళయందుఁ గ♦న్పట్టుచుండు
దొరకు నన్నట్లు గన్పట్టి ♦ దొరకకుండు
నద్దమునఁ దోఁచుధనమట్లు ♦ లామృగంబు 477

మ. భళిరా చిక్కె నదంచు రాఘవుఁడు చేఁ♦ బట్టంగ నేతేరఁ జం
చలచందానఁ దళుక్కునన్ మెఱసి యా♦శ్చర్యంబుగా నేడకో
తొలఁగు, న్వెండియు వచ్చి నిర్భయముగన్ ♦ దూరంబున న్గానన
స్థలిఁ దట్టాడు మృగంబు, నేత్రములసౌం♦దర్యంబుఁ జూపించుచున్.

గీ. రాముని నెఱింగి గమనించు ♦ రాక్షసుఁడు
రక్కసు నెఱింగి గమకించు ♦ రాఘవుండు
వారి యిరుపురనటనంబుఁ ♦ బలుక వశమె
ధాత కైనను మఱి వాని♦తాత కైన. 479

చ. ఎవనిగభీరభావము ము♦నీంద్రులు సైత మెఱుంగఁ జాలరో ?
ఎవని విరించియైన నుతి♦యింపఁగఁ జాలఁడొ యట్టివాఁడు రా
ఘవుఁ డొకలేడి వెంబడిని ♦ కానను దవ్వుగ నేగి వేటకా
నివిధమునన్ నటించి తన♦నేరుపుఁ జూపుచు నుండె మానినీ. 480

గీ. మలఁకలం బెట్టి వంచించి ♦ మెలఁగుచున్న
కపటమృగమును వీరరా♦ఘవుఁ డమోఘ
బాణమున సంహరింపంగఁ ♦ బ్రాణములను
విడిచె హా లక్ష్మణా యంచు ♦ విబుధవైరి. 481

గీ. మిత్రకులవర్య బాణాగ్ని♦హోత్రమునను
అఘములం బాసి మారీచుఁ ♦ డాక్షణంబ
పరమపావనయోగులుఁ ♦ బడయరాని
పదవికిన్ బోయె దేవతల్ ♦ ప్రస్తుతింప. 482

గీ. వానిపదనూపురము జాఱి ♦ పడినస్థలము
కవులు వినుతింప నూపుర♦గ్రామ మయ్యె
మృగము చాపల్యమున ♦ సంచరించుసీమ
గ్రామ మయ్యెను చాపల్య♦నామమునను. 483

మ. అనఘుం డారఘురాముఁ డేసినయమో♦ఘాస్త్రాహతిన్ గూలి యొ
య్యన మారీచుఁడు ప్రాణము ల్విడుచుచున్ ♦హాలక్ష్మణా యన్నయా
ర్తనినాదంబును భూమిపుత్త్రి విని సం♦తాపించి "యో లక్ష్మణా!
ధ్వని యాలించితివే సహోదరునహా♦పాయంబు వారింపవే?.

ఉ. చప్పునఁ బోయి నీదునను♦జన్మునియాపదఁ బాపరాదె? నీ
విప్పు డుపేక్షఁ జేసి భయ♦మే మని మెల్లఁగ మిన్నకున్నఁ బెన్
ముప్పు ఘటిల్లఁ జావె? రఘు♦పుంగవుఁ డేగతి నున్నవాఁడొ? నీ
యప్పనుదీర్చుకొందు విను♦మా చనుమా కనుమా యుపాయమున్."

చ. అన విని లక్ష్మణుండు దర♦హాసముఁ జేసి వచించె నిట్టు లో
జనని సమస్తలోకములఁ ♦ జంపఁగఁ బెంపఁగ నోపువాని కి
వ్వనమున స్వప్నమం దయిన ♦ వైశస ముండునె? నిన్నుఁ బ్రోవఁగా
నను నియమించె ని న్విడిచి♦నన్ మఱి యెంతటిహాని వచ్చునో?.

గీ. పరికృతినంతట నొక్కఁ డై ♦ వఱలుచుండె
అచ్యుతుఁడు రాముఁ డతనికి ♦ హాని గలదె ?
పెన్నిధివిధాన మాయన్న ♦ నిన్ను నాకు
నప్పగించెను విడనాడి ♦ యరుగఁ దగునె ?. 487

గీ. వలదు విభ్రాంతి యాతండు ♦ వచ్చు నిపుడు
నిన్ను విడనాడ, నన్ను మన్నింపు మమ్మ
పడఁతిఁ గాపాడ కేటికి ♦ వచ్చి తన్న
నోడ కే మని యుత్తరం ♦ బొసఁగువాఁడ". 488

చం. అన విని భూమిజాత, కుటిలాత్ముఁడ వెచ్చటిబాంధవుండ వ
య్యనఘుఁ డపాయముల్ బొరయ ♦ నాత్మ నొకించుక తల్లడిల్ల వా
తనికి భయంబు లే దనుచు ♦ ధైర్యముఁ జెప్పెదు ఘోరపాపవ
ర్తనుఁడవు నీముఖంబుఁ గన ♦ రాదు తొలంగుము వంశపాంసనా. 489

గీ. అనిన సౌమిత్రి యాలించి ♦ యుపహసించి
అత్మ నొక్కింత శాంతింపు ♦ మని వచించి
ఎలమి మంత్రించి హద్దుల ♦ నేర్పఱచి
హద్దుల నతిక్రమింపకు ♦ మమ్మ యనుచు. 490

గీ. అప్ప దేవతాకోటికి ♦ నప్పగించి
దిశలఁ బరికించి, వెనుకకుఁ ♦ దిరిగి తిరిగి
చూచుచుఁ బోవుచుండె నా ♦ శూరవరుఁడు
వత్సముల్ బాసి చను గోవు ♦ వరుస దోఁప. 491

గీ. జనకసుత నొంటిఁ బాసిన ♦ సాధ్వసమున
నన్న యే మనునో యను ♦ నడలువలన
నెండవేఁడిమికిన్ వాడి ♦ యేపు చెడిన
వల్లరివిధాన నతఁడు గ ♦ న్పట్టె నపుడు. 492

గీ. జనకసుత యొంటిపాటు నుండు సరణిఁ జూచి
తనయుపాయంబు ఫలియించె ♦ నని తలంచి
కపటసన్యాసి యై దశ ♦ కంధరుండు
పర్ణశాలను శునకంబు ♦ భంగిఁ జొచ్చె. 493

సీ. ఎవ్వాఁడు కినిసిన ♦ నింద్రాదిదేవతా
వ్రాతంబు గడగడ ♦ వడఁకుచుండు
నెవ్వాఁడు గర్జించి ♦ యెప్పుఁ జూపినయంత
యమునియంతటివీరుఁ ♦ డడలిపోవు
నెవ్వాఁడు మొఖముల ♦ నెత్తి చూచినయంతఁ
దరణి మబ్బులచాయ ♦ దాఁగియుండు
నెవ్వాఁడు పోరాడ ♦ హేతిఁ బూనినయంత
భీతిల్లి గాలియు ♦ వీవ వెఱచు

గీ. నవఁడు కన్నులఁ గెంపు ర ♦ హింపఁ జేసి
సిగ్గిడిసన్ వీక్షణాంతమ్ముఁ ♦ నిగుడువిడుచు
పట్టిరావణుండు పదార్థ ♦ మపహరింపఁ
జొచ్చుశునకంబుచందానఁ ♦ జొచ్చె నేఁడు. 494

గీ. ఎంతబలవంతుఁ డైనఁ దా ♦ నెంతఘనతఁ
గలిగియుండిన జనుఁడు దు ♦ ష్కార్యవేళ
దేహబలమును వెండియు ♦ ధీబలంబుఁ
గోలుపడి దీలుపడుఁ జూవె ♦ శైలపుత్త్రి!. 495

గీ. పర్ణశాలను జొచ్చిన ♦ వానిఁ గాంచి
అతిథి వచ్చినవాఁ డని ♦ యాదరించి
ఫలసుమంబులఁ జేకొని ♦ వచ్చుసీత
యందముం గని నిశ్చేష్టుఁ ♦ డయ్యె వాఁడు. 496

గీ. బిచ్చ మీవచ్చుసతిఁ గాంచి ♦ విబుధవైరి
తొలుత దేహళి దాఁటి రా♦వలయు నన్న
వల్లె యని భూమిపుత్త్రి యీ♦వలకు వచ్చె
హద్దు మీఱిన నేరికేన్ ♦ హాని గాదె. 497

గీ. వినుము విపరీత మయ్యె నా♦విధికృతంబు
హద్దు మీఱంగఁ దగ దని ♦ యంతరాత్మ
చెప్పిన ట్లయ్యె నక్కటా ♦ క్షితితనూజ
కపట్యమస్కరివాక్యంబు ♦ గౌరవించె. 498

చం. తెలియనివాఁడె రాఘవుఁడు ♦ దేవి యెఱుంగదె, పంక్తికంఠుఁడు
న్దెలియనివాఁడె, యెంతటిమ♦తి భ్రమ గల్గిన మంచిచెడ్డలన్
దెలియనివాఁ డెవండు? గమ♦నించి మెలంగఁగఁ గాలమానమున్
దెలిసినవాఁ డెవండు? విధి♦నిర్ణయ మేరికి దాఁట శక్యమే ?. 499

గీ. హద్దు దాఁటినసతిఁ జూచి ♦ యసురవిభుఁడు
ఇదియ తఱి యంచు నూహించి ♦ యిట్టు లనియెఁ
"కందమూలఫలాదిభి♦క్షుంబు వలదు
కామినీ ! మాకుఁ గావలెఁ ♦ గామభిక్ష. 500

చం. నయమునఁ జెప్పుచుంటిని మ♦నంబున లాఁతిగ నెంచకుండ న
రయమున వచ్చి చేకొనుము ♦ రాజముఖి! జముఁడంతవాఁడు నా
జయమున కోహటించె, ననుఁ ♦ జాలనివానిఁగ నెంచి తేని నీ
భయమున నైనఁ గైకొనెద ♦ వారిజనాభుఁడు వచ్చి యడ్డినన్. 501

కం. సుర నాగ యక్ష కిన్నర
నరకామిను లేగుదెంచి ♦ ననుఁ గోరుదు రే
నిరసింతు నట్టివారికి
ధ్వారకనిధార నయ్యె నీకు ♦ ధొరకితిఁ దరుణీ". 502

మ. జనకక్ష్మాపతిపుత్రి యంత, దొరకోల్ ♦ సన్న్యాసి సన్న్యాసిగాఁ
దనచిత్తంబున నమ్మినట్టు లనె "న్యా ♦ య్యం బౌనె సన్న్యాసు ల
య్యును మీ రీగతి నీతిఁ దప్పఁ దగునే? ♦ యూహింపుఁడీ లోకమం
దున సన్న్యాసులె యిట్టులైన ఖలులన్ ♦ దూషింపఁగా నేటికిన్".

కం. అని తన్ను మందలించిన
జనకాత్మజఁ జూచి కపట ♦ సన్న్యాసి పడిన్
తననిజరూపముఁ జూపఁగ
మనమున భీతిల్లినట్లు ♦ మగువ నటించెన్. 504

గీ. అట్లు నటియించి వెండియు ♦ నాగ్రహించి
జానకీదేవి యిట్లనె ♦ "శ్వానమట్లు
పర్ణశాలను జొచ్చితే ♦ భర్త లేని
వేళఁ బరికించి; నిలువుము ♦ భీతిఁ దక్కి. 505

కం. పదితలలఁ గలిగియుండినఁ
బదిలమె మఱి వేయితలలఁ ♦ బడసిన నీ క
భ్యుదయమె, యదయా! కిల్బిష
హృదయా! మావారు వత్తు ♦ రిప్పుడు నిలుమా. 506

కం. శివపూజానిరతుండవు
స్తవనీయయశోవిశేష ♦ సంపన్నుఁడ వా
ర్యవిధేయుఁడ వుత్తముఁడవు
శివ! శివ! నీ కిట్టిసేఁత ♦ చెల్లునె చెపుమా. 507

గీ. సర్వశాస్త్రంబు లెఱిఁగిన ♦ జ్ఞాని వయ్యు
సాధుజనహింసయున్ బర ♦ సతులవాంఛ
మద్యపానంబు, మానవ ♦ మాంసభక్ష
ణంబు విడువవు నీకు క్షే ♦ మంబె చెపుము. 508

గీ. రాజహంసినిఁ గాకి కో♦రంగఁ దగునె
సింహి మృగధూర్తకంబు వాం♦ఛింపఁ దగునె
మంచిచెడ్డల నెఱిఁగిన♦వంచకుఁడవు
నీకు బోధింపవచ్చునే ♦ నీతిదూర. 509

ఆ. వె. మాంసభక్షకుఁడవు ♦ మద్యపాయివి మూర్ఖ !
అతులధర్మమార్గ♦రతుఁడ వగుదె ?
బ్రహ్మ మెచ్చి కోటి♦వరము లిచ్చునుగాక
కామధేను వగునె ♦ గార్దభంబు. 510

క. కదనంబున బహువీరుల
విదళించిన సాటి లేని♦వీరుఁడవో ? చూ
చెద, వీఁపుచర్మ మొలిపిం
చెద, నొక్కించుక నిలిచి వ♦చింపుము ప్రజ్ఞన్. 511

చ. రవికులవర్యుఁ డైనరఘు♦రాము నెఱుంగఁగ లేక తాపస
ప్రవరునిఁ బోలు వేసమున ♦ వచ్చి సతిన్ గికురింప నెంచి, వీ
రవరుల గెల్చినాఁడ నని ♦ ప్రజ్ఞలఁ బల్కెదు సిగ్గు లేక; నీ
వెవని జయించినావో? కుసు♦మేషు జయించితె? రాక్షసాధమా!.

గీ. అనిన విని యెంతయున్ జంకి ♦ యసురవిభుఁడు
"సీత యూహింపఁగా జగ♦న్మాత యేమొ ?
ఇట్టిదే వేరిఁ గొన్న చా ♦ వేరికైన
సంభవింపకయున్న సం♦శయము గలదె?. 513

కం. నారూపముఁ జూపించిన
నారీమణి భీతిఁ దక్కి ♦ నను నిందించెన్
శ్రీరామామణియో ? సా
ధారణసతి కిట్టియచల♦ధైర్యము గలదే ?. 514

మ. సరియే లంక కెవండు రాఁగలఁడు? సన్ ♦ సాధించి బాధించు పో
టరి యెవ్వాఁ డిల? నీలతాంగిఁ బుడ్రుదో ♦ టన్ బెట్టి కాపాడెదన్
హరియో రాముఁడో వచ్చి నట్లైలి ది యీ ♦ యబ్జాక్షిఁ గొంపోయిన
న్నరణీయుం బవు డేమి చూచుకొ నెదన్ ♦ గాకేమి నేఁ డేగెదన్.

గీ. మానవుఁడో ? దేవుఁడో ? రాము ♦ మహిమ నేఁడు
చూచెదం గాక సీతఁ గూ ♦ ర్చుండఁబెట్టి
స్యందనంబున వెడలెద ♦ పతులగతిని
కీడు ఘటియిల్లునో ? పరి ♦ కింతుఁ గాక". 516

గీ. అని మదిన్ నిశ్చయించి య ♦ హంకరించి
సీతఁ గూర్చుండఁబెట్టి ని ♦ ర్భీతితోడ
రథముఁ బోనిచ్చెఁ దనమనో ♦ రథముగతిని
దిశల సతిరోదనంబు ప్ర ♦ తిధ్వనించె. 517

ఉ. "ఓ రఘురామ ! యో రవికు ♦ లోదధిసోమ ! గుణాభిరామ ! రా
వో రణరంగభీమ ! పురు ♦ షోత్తమ ! యాపద నున్నదాన, నీ
కూ్రరుఁడు దానవుం డొకఁడు ♦ గొబ్బున నన్ గొనిపోవుచుండె నం
భోరుహనేత్ర! నీరమణిఁ ♦ బ్రోవఁగఁ జాలక మిన్నకుంటివో?. 518

ఉ. వైశస ముప్పతిల్లె, జన ♦ పాలకసింహమ ! నీసతిన్, పురో
డాశము శ్వానమట్లు లక ♦ టా! యొకదైత్యుఁడు తస్కరించెఁ, బ్రా
ణేశ ! భవత్పదాబ్జముల ♦ నేగతిఁ జూతునొ ? వీనివంశమున్
నాశముఁ జేసి నన్నుఁ గరు ♦ ణన్ గొనిపొమ్ము నమస్కరించెదన్.

కం. శరణాగతవత్సల ! యో
కరుణాభరణా ! యబలను ♦ గాపాడుము నీ
చరణాబ్జములన్ నమ్మితి
వరదా! చనుదెమ్ము నాదు ♦ బన్నము దాఁకన్. 520

కం. సురథీ! సరసురనుతథీ
శరథీ! శ్రితభక్తలోక♦సంరక్షకదా
శరథీ! రిపుభయదాక్షయ
శరథీ! శిక్షింప నీకు♦జానకిఁ గనవే?. 521

శా. నిన్నో నాడినవానికిన్ ఫలముఁ గం♦టిన్ నన్ను మన్నింపు మో
యన్నా! లక్ష్మణ! యన్నతోడఁ జనుదె♦మ్మాలస్యముం జేయఁగాఁ
జన్నే? యెవ్విధి నోర్చుదాన, దొరకో♦లన్నాసి యీరావణుం
డెన్నన్ రానిభయంకరుండు, నను మీ♦ శేరీతి రక్షింతురో". 522

గీ. అటవిరోదన మన్నసా♦మ్యమున సీత
యివ్విధిన్ గోలుగోలున ♦ నేడ్చుచుండ;
సఖిలజీవులు రోదనం♦ బాలకించి
బాష్పములఁ గార్చె నొక్కరా♦వణుఁడు దక్క. 523

గీ. బ్రహ్మవరములబలమున ♦ భయముఁ దక్కి
యతులవేగంబునన్ దైత్యుఁ♦ డరుగుచుండెఁ
బృథ్విసుతకుంద విని విని ♦ గృధ్రరాజు
కడువడిన్ వచ్చె జివ్వున ♦ గగనవీథి. 524

ఉ. "ఎవ్వఁడ వోయి దానవకు♦లేంద్రుఁడవో? దశకంధరుండవో?
నెవ్వడిఁ బాడిఁ దప్పి యవ♦నీసుత రాముని ధర్మపత్ని మై
కొవ్వునఁ దస్కరించి యని♦రుద్ధగతిన్ జనుచుంటి వాఁగు మే
నెవ్వఁడనో యెఱుంగుదువో? ♦ గృధ్రకులాధిపుఁడ న్జటాయువన్.

చ. నిలు నిలు తేరు డిగ్గి యవ♦నీసుత నా కిఁక నప్పగించి వే
వెలలుము లేకయున్న రఘు♦వీరుఁడు రాముఁడు సంతసింప నీ
తలల నఖంబులన్ బునిమె♦దన్ వెనుదీయఁ, బఱంతిఁ బాయ, ని
న్నలఁతిగఁ బోవనీయ, నసు♦రావణ! రావణ! కష్టజీవనా!. 526

ఉ. తాళుము తాళు మోయి బల♦దర్పితరాక్షసవంశపాంసనా!
కాలము వచ్చెఁ బో యచిర♦కాలములో యమదర్శనంబు నీ
కాలమునన్ లభించు, నిల♦రాఁగవలం గని తస్కరింతువో
యాలరి వై, రఘూద్వహుని♦యా లనియేని యెఱుంగకుంటివో ?.

క. కోరెదవో మాఘస్నానము
దూరెదవో దోస మనక ♦ దొమ్మరికొంపన్
దూఱెద రని భీతిల్లక
పాఱెదవో పాడిఁ దప్పి ♦ పరదారలతో. 528

క. చెండాడెద నీతలలను
చెండాడెద గెల్పులచ్చెఁ ♦ జేకొని యనిలో,
నొండాడక సతి విడువుము
కొండాడెద రెల్లవారు ♦ గోటివిధాలన్. 529

క. నీయమ్మున కే లొంగను
మాయమ్మను మా కౌసఁగి ♦ మనుమా, వినుమా
నాయమ్మను, కాయమ్మున
గాయమ్మను బొందకుండఁ♦గా వే చనుమా. 530

ఉ. ఓయి పవిత్రవిప్రతన♦యుండవు దా రఁష విష్టిపాపముల్
చేయుట న్యాయమార్గ మగు♦నే? తలపోయు మొకించుకంత, నీ
కాయువు మూడె నింక, జగ♦దంబకు ద్రోహ మొనర్చి తీవు, నీ
వాయువిమానమున్ విడిచి ♦ ప్రాణములన్ హరియింతు రావణా!.

మ. పరయోషిత్తుల నెందఱిన్ బలిమిమై ♦ వంచించి భోగింపవో
అరిలోకాంతక! తృప్తిఁ బొందితివొ యా♦వంతేని? యేనాఁటికేన్
విరతిన్ బొందవొ? ఘోరపాపములకున్ ♦ భీతిల్లవో? కామివై
చిరకాలంబును తుచ్ఛభోగపరతన్ ♦ జీవింతువో? రావణా!. 532

మ. జననీ జానకి భీతిఁ బొందకుము నా♦శౌర్యంబుఁ జూపించి యీ
తని సాధించెద సంగరంబున మన♦స్స్థైర్యంబు దీపింప, నా
తనువుం బ్రాణము ధారవోసెద జగ♦ద్ధర్మావనార్థంబు, వీ
నినిఁ గారించెద సంహరించెదను దు♦ర్నీతిన్ నివారించెదన్". 533

గీ. అనిన విని రావణుం డించు♦కంత జంకి
ఆజటాయువుఁ బరికించి ♦ యనియె నిట్లు
"ఎవ్వఁడవు నీవు మైనాకుఁ ♦ డేమి యగును?
గరుడుని జయింపఁ జాలిన♦ఘనుఁడ వేమొ?. 534

చ. అవు నవు మంచివాఁడవ బ♦లా యబలాహరణాపకీర్తికిన్
దవిలినవాఁడు తాఁ జెడును ♦ దాన నఘంబును నీవు పొందవో
పవిమలచిత్త! నాగతికి ♦ వత్తువె? నన్నెదిరించిచచ్చినన్
దివి భువిఁ జూతుకొందువె? మ♦తిన్ దలపోసి వధింపుమాపయిన్.

చ. ఉఱవె? విరోధ మేల విహ♦గోత్తమ! యుత్తమధర్మశాస్త్రమున్
గఱచితి వీవ, కేవలము ♦ గ్రిద్దవె? పెద్దల బుద్ధి వొద్దు, ప
ల్లఱుల మానుమా, బలుఁడ ♦ నంచుఁ బరాకున రాకు, నీకు నే
వెఱచెడువాఁడఁ గాను, పర♦వీరభయంకరు నన్నెఱుంగవే?. 536

ఆ. నీతిమాట లేమి? ♦ నీకు న్యాయము లేల?
తొలఁగిపొమ్ము బ్రదుకఁ ♦ దలఁచితేని
నన్నెదిర్చినంత ♦ నరులైన సురలైన
మెచ్చి కప్పువారె ♦ మేఁకతోలు. 537

ఉ. వృద్ధుఁడ వోయి, యే మనుభ♦వింపఁ దలంచితి వోయి యుద్ధస
న్నద్ధుఁడ వై, విరోధమున ♦ నన్ను జయింపఁగ నౌనె, దుర్జయ
క్రుద్ధుఁడు రావణుం డసుర♦కోటివిభుండు బలుం డసాధ్యుఁ డా
సిద్ధుల సాధ్యులన్ గెలిచి ♦ జే యనిపించు సురాదివీరులన్. 538

ఆ. వె. గ్రద్ధ వైన నేమి ♦ గౌరవించెద నన్ను,
గరుడి సిగ్గుఁ బొంద ♦ బిరుదు లిత్తు
గొప్పపదవియుంచుఁ ♦ గూర్చుండఁజెప్పెద
వైర మేల మనకుఁ ♦ బక్షిరాజ!. 539

క. కావరమున ననుఁ దాఁకిన
జీవింతువె? వృద్ధగృధ్ర ♦ శేఖర! వినుమా,
లావున్ జేవన్ గలిగిన
లావరివో చాలుఁ జాలు ♦ లా వతి చెడదో. 540

క. నరమాత్రుఁ డైనరాముం
డరయఁగ నీ కెట్టిచుట్ట ♦ మాలింపుము నా
తరవారికి నర గాకుము
తరమా యెదిరించి నన్ను ♦ దండింపంగన్". 541

గీ. ఇట్లు పలికించి కడు వడి ♦ నేఁగుచున్న
రావణుం జూచి "నిలు నిలు ♦ రాక్షసేంద్ర
వెడలఁజాలవు సీతను ♦ విడువకుండ"
యని జటాయువు పైఁబడె ♦ నాక్షణంబ. 542

ఉ. తీవ్వన వచ్చి పైఁ బడిన ♦ గృధ్రవిభుం గని రావణుండు చి
ర్నవ్వు మొగంబునన్ వెలుఁగ ♦ "రమ్ము జయింపఁగ వచ్చి తీవు మై
క్రొవ్వున నాపరాక్రమము ♦ నెఱుంగని వెంగలి వౌదు వౌర! నీ
చివ్వకు నేను జంక" నని ♦ చివ్వనఁ దూపుల నేసె నేపుమై. 543

గీ. ఓజటాయువ నీయాయు ♦ వూడె ననుచు
నసురనాయకుఁ డేసిన ♦ యమ్ము లెల్ల
నాటుకొనినంతఁ బల్లటీ ♦ ల్దాఁటి దాఁటి
యజటాయువు చెలరేఁగె ♦ నాగ్రహమున. 544

గీ. పక్షివిక్షేపసంభూత ♦ వాతధూత
దళకిరీటస్థమణిపంక్తి ♦ ధరణిపుత్త్రి
పాదయుగళిని రాలె ని♦వ్వాళి గాఁగ
భళిర యని యాజటాయువు ♦ పరిహసించె. 545

క. శతకోటికోటిసఖనఖ
శితముఖదారితుఁ డయి దశ♦శీర్షుఁడు తనయు
న్నతబాణాసన మెక్కిడి
శతబాణము లేసెఁ బక్షి ♦ సంక్షోభింపన్. 546

గీ. వృద్ధుఁ డగుకారణంబున ♦ గృధ్రవిభుఁడు
వానిదెబ్బల కోర్వక ♦ వసుధ వ్రాలి
యాదమఱచినయంతఁ జం♦ద్రాయుధమునఁ
బక్షములఁ ద్రుంచి వెడలె సు♦పర్వవైరి. 547

సీ. నల్ల ప్రవహించు నెక్కలు ♦ దుల్లి పడిన
భూధర మనంగ భూమిపైఁ ♦ బొరలి పొరలి
రామ శ్రీరామ యనుచు, నా♦రావణుండు
వెడలుదెసఁ జూచి దుఃఖించె ♦ విహగవిభుఁడు. 548

ఆ. వె. రామ రామ రామ ♦ రామ సీతారామ
యనుచు నాజటాయు ♦ వాత్మయందు
స్వామికార్యమునకుఁ ♦ బ్రాణంబు లర్పింతు
సఫల మయ్యె నాదు♦జన్మ మనుచు. 549

ఆ. వె. సంతసించి రాము ♦ సంస్మరించుచునుండె
ధన్యతముఁడ ననుచుఁ ♦ దనివిఁ బొందె
వాయుపథమునందు ♦ వాయువేగము మీఱి
రావణుండు వెడలె ♦ రామతోడ. 550

ఆ. వె. శక్తికొలఁదిఁ బోరి ♦ శౌర్యంబుఁ జూపించి
తెగవు నిలువఁ దనువు ♦ ధార వోసె
రక్తధారతోడఁ ♦ బ్రాణంబు లర్పించె
బక్షి యైన నేమి ♦ ప్రస్తుతింతు. 551

ఆ. వె. వెనుకనుండి తన్ను ♦ వెంబడించునో రాముఁ
డనెడు భీతి దైత్యుఁ ♦ డరుగుచుండ
వెక్కి వెక్కి సీత ♦ విలపించె నెంతయు
మృగయుచేతఁ జిక్కు ♦ మృగముఁ బోలి. 552

గీ. అంతరిక్షపథంబున ♦ నరుగు వేళఁ
దోవ ఋశ్యమూకాద్రి సు♦గ్రీవుఁ జూచి
"హరి హరీ" యని యేడ్చి య♦య్యవనిపుత్రి
తనదుసొమ్ములఁ బడవైచె ♦ దక్షిణంబ. 553

ఉ. వాయువిమానయానమున ♦ వాయుగతిన్ దనలంక కేగి దై
తేయవిభుం డొకించుక ధృ♦తిన్ ధరణీసుతఁ గాంచి నవ్వి "మా
మాయ లెఱుంగ బ్రహ్మతర♦మా? వరమాతృని విశ్వసించి, నన్
హేయముగాఁ దలంచి, వచి♦యించెదవా, మాపురిఁ జూడు కోమలీ!.

ఉ. మాయెలమావితోఁటనదు♦మన్ గలసౌధములన్ విశాలవా
తాయనభర్మహర్మ్యముల♦యందముఁ జందముఁ జూచినావె కాం
తా యెచటైన భూతలము♦నందు? ననున్ నిరసించి మర్త్యుఁడే
నాయకుఁ డంచు నిర్జనవ♦నంబున నుండఁగ నిచ్చగించితే ?. 555

ఉ. నాయసమానవైభవము♦నన్ సతతంబు సుఖాంబురాశిలో
హాయిగ నుండఁజాలక న♦రాధముఁడే మగఁ డంచు నెవ్వఁ డీ
తోయధి దాఁటి రాఁ గలఁడు ♦ దుఃఖముఁ బాపి సుఖంపఁజేతు నో
తోయరుహాక్షి! నన్ను దయ♦తోఁ బరికింపుము యాలకింపుమా.

ఉ. కామును సంహరించి ముని◆కైవడిఁ గానల నున్న రాముఁడే
భీముఁడు కాముఁ డంచుఁ బల◆వించెద వెంచక మించుఁబోణి! నీ
కోమలహస్తపల్లవముఁ ◆ గోరితిఁ జేరితి నన్నుఁ దక్కఁగన్
క్షేమమె నీకు, రమ్మ, కరు◆ణించి వరింపుము, నీకు మ్రొక్కెదన్.

సీ. కమనీయనవరత్న◆ఘటితమందిరములు
నెచటైనఁ జూచితే ◆ యిగురుఁబోణి
స్వర్ణదంతసమేత◆భర్మహర్మ్యంబులఁ
గలనైనఁ గంటివే ◆ కమలపాణి
నవ్యభవ్యవిలాస◆దివ్యసౌధంబుల
మాటైన వింటివే ◆ మంజువాణి
హృద్యానవద్యమ◆హోద్యానములచోద్య
ములు మున్నెఱుంగుదే ◆ జలదవేణి

గీ. పరమకల్యాణి మనసరో◆వరముఁ జూచు
సైకతశ్రోణి దయ యుంచి ◆ జలకమాడు
కుందసురదనశ్రేణి న◆న్నిందుఁ గూడు
క్షోణి నిను రాణిఁ జేసెద ◆ సూడు వీవు". 558

చ. అన విని సీత "యోర! తులు◆వా! ఖలువా! పలువాక్కు లేలరా?
అనఘుఁడు రామచంద్రుఁడు న◆రాధముఁడో సురలోకవంద్యుఁడో
వనితలమోసపుచ్చు నొక◆వంచకుఁ డెట్టు లెఱుంగఁ జాలు; లా
లనమున నన్ జయింతువె? మొ◆లంకువఁ గల్గి మెలంగు మిప్పుడేన్.

ఉ. మాయజమానుఁ డీయసుర◆మాయకుఁ జిక్కునె? విష్ణుమాయకు
న్నాయకుఁ డచ్యుతుండు నర◆నాయకుఁ డంచుఁ దలంచి యీగతిన్
జేయఁగరానికార్యమును ◆ జేసితి వీవు ఘనుండవే తృణ
ప్రాయుఁడ వంచుఁ దిట్టుచుఁ గ◆రంబునఁ బోఁచను బూని యిట్లనన్.

క. పదితలలవాఁడ వయ్యును
పసుపుర వధియించినట్టి♦బలియుఁడ వయ్యున్
మది నెంతయు గర్వింపకు
ముడలించెద నిన్ను గక్షి♦పోఁచగఁ దలువా !. 561

క. సదనంబును జేరితి వని
వదనంబుల నెత్తి యిట్లు♦పలికెద వీసం
బద నీ కాపద గదరా
కదనంబున రాము గెలువఁ ♦ గలవా పలువా !. 562

చ. వెతలకుఁ దా వొసంగక వి♦వేకముఁ గల్గి మెలంగు మిప్పుడే
హతమతి నాలకింపుము, ము♦నీంద్రనుతుం డగురామచంద్రుఁ డ
చ్యుతుఁ డని విశ్వసింపుము,దు♦రూహలఁ బాయుము, స్వప్నమందు నే
న్నతులను మోసపుచ్చకుము ♦ సాధుజనాశన! ధర్మనాశనా! 563

గీ. నన్ను బలిమిమైఁ దాఁకినన్ ♦ దత్క్షణంబ
నీమశిరములుపదియును ♦ నేలఁ గూలు
నిన్ను శపియింపఁ జాలక ♦ మిన్నకుంటి
నో? రొకించుక తలపోయు ♦ మోదురాత్మ!. 564

గీ. అనిన విని రావణుండు భ♦యంబుఁ జెంది
తనకుఁ గలఘోరశాపంబు♦లను దలంచి
జనకసుత నిక్కముగ లోక♦జనని యేమొ
కడఁగి సత్యంబుఁ బరికింతుఁ ♦ గాక యనుచు. 565

గీ. స్యందనంబు నశోకవ♦నాంతరమున
కపుడ గొనిపోయి భూపుత్త్రి ♦ నచట విడిచి
అసురకాంతలు కాపుండ ♦ నాన తిచ్చి
చేర నిజసౌధమున్ దీర్ఘ♦చింతతోడ. 566

గీ. నలువ యంతట దేవేంద్రు ♦ బిలువఁబంచి
అతనితోడ ని ట్లనియె ర♦హస్యముగను
జనకసుత రావణుఁ డశోక♦వనమునందు
విడిచి తనదుసౌధమునకు ♦ వెడలె నిపుడు. 567

గీ. వేళఁ బరికించి నీ విఁక ♦ భీతిఁ దక్కి-
జానకీదేవి కమృత మొ♦సంగి రమ్ము
క్షుత్పిపాసలు లేక, య♦శోకమున న
శోకవనమున నలరు నా♦లోకజనని. 568

చ. అన విని లెస్స యంచు నమ♦రాధిపుఁ డంత సుధ గ్రహించి, మా
యను బచరించి రాత్రిసమ♦యంబున మెల్లఁగఁ జేరి జానకిన్
గనుఁగొని మ్రొక్కి- నేను సుర♦కాంతుఁడ వాక్పతియానతి న్సుధన్
గొని చనుదెంచినాఁడఁ గయికొ మ్మని భక్తి నొసంగి పిడ్కాన్.

గీ. అమరలోకేశుఁ డొసఁగిన♦యమృతముఁ గొని
క్షుత్పిపాసల వర్జించి ♦ శోక ముడిగి
మృగముకొఱ కేఁగు రాము స్మ♦రించుకొనుచుఁ
దద్వనంబున నుండె నా♦ధరణిపుత్రి. 570

గీ. సీతపలుకులు ములుకు లై ♦ చెవుల నాటఁ
దాళఁజాలక సౌమిత్రి ♦ తాల్మిఁ దూలి
ఏమి రా నున్నదో యంచు ♦ నేడ్చి యేడ్చి
అన్న కెదురుగ నేగె న♦య్యాడవియందు. 571

మ. జనకక్ష్మాపతిపుత్త్రి నాహృదయమున్ ♦ శంకించి దూషించె నీ
తను వేరీతిభరింతు నంచు నెద సం♦తాపించి శోకించుచున్
ధనమున్ గోల్పడినట్టిలోభికరణిన్ ♦ దైన్యంబునన్ వచ్చువ
య్యనుజు న్లక్ష్మణుఁ జూచి రాఘవుఁడు ♦ చింతాక్రాంతుఁడై యిట్లనున్.

ఉ. సీతను బాసి తెట్టిపని ♦ చేసితి నిర్జనమందు రాక్షస
వ్రాతము సంచరించు నను ♦ వార్తల మున్ వినియుందు విట్లు రా
హేతు వదేమొ? యేమి ఘటి ♦ యిల్లెనొ? సీతకు క్షేమమే గదా?
హా తరుణీమణీ వికసి ♦ తాంబురుహేక్షణ! యెట్టు లుంటివో ?.

గీ. అక్కటా తమ్ముఁడా! సీత ♦ యాశ్రమమున
నున్నదో లేదొ? శంకించు ♦ చుండె మనము
సీత లేకున్న నా కింక ♦ జీవ మేల?
ఆలిఁ గోల్పోవుకంటెను ♦ హాని గలదె ?. 574

గీ. అనిన సౌమిత్రి బాష్పతో ♦ యముల విడిచి
చేతులన్ మోడ్చి, సీత వ ♦ చించినట్టి
నిష్ఠురంబుల నెఱిఁగించి ♦ నిరపరాధి
నన్నయా నన్ను క్షమియింపు ♦ మనుచు నేడ్చె. 575

గీ. అంత రాముండు తమ్ముని ♦ నాదరించి
శీఘ్రముగ రమ్ము రమ్మని ♦ చిలుక లేని
పంజరము మాడ్కిఁ గనుపట్టు ♦ పర్ణశాలఁ
గాంచి విలపించె శిలలెల్లఁ ♦ గరఁగునట్లు. 576

గీ. సారదండకారణ్యకా ♦ సారనిరత
జానకీరామచంద్రు లన్ ♦ చక్రవాక
యుగళికిన్ దీఱరానివి ♦ యోగ మొదవె
రావణనిశాచరాంధకా ♦ రంబువలన. 577

ఉ. "ఎచ్చట నుంటివే జలరు ♦ హేక్షణ! స్వర్ణమృగంబుఁ దెచ్చి నీ
ముచ్చటఁ దీర్తు నంచుఁ జని ♦ మోసముఁ బొందితి, నాలసించి నే
వచ్చితి నంచు నన్ను నెడఁ ♦ బాసితొ పూఁబొదరింట డాఁగితో
నెచ్చరికించి భర్త కవ ♦ మానముఁ గూర్తురె మానినీమణీ!. 578

సీ. జలజాక్షి చనె నంచు ♦ సంతసించెద రేమొ
ఖంజనమీనమృ♦గంబులార
కలవాణి రా దని ♦ గర్వింపఁ జెల్లునే
పికశుకశారికా♦వితతులార
ఘనవేణి ననుఁ బాసె ♦ నని చెలంగెద రేమొ
చంచరీకాహీన:♦చయములార
సుముఖి లేదని యింత ♦ సోమింపవచ్చునే
శరదిందుఫుల్లాఁబు♦జంబులార
గీ. సుదతి దరి లేనితఱిఁ గాంచి ♦ సొగసు మీఱి
సిగ్గుఁ బాసితిరే మల్లె♦మొగ్గలార
మందగామిని చనె నింక ♦ మగిడి రా ద
టంచుఁ గులుకుచున్నారె రా♦యంచలార. 579
గీ. మందగామిని నెఱుఁగుదే ♦ మదగజంబ
ఇచట హరిమధ్యఁ గంటివే ♦ మృగకులేంద్ర
మృగనయనఁ జూడరే మీరు ♦ మృగములార
అళిచికురఁ గాంచినారె మ♦దాళులార. 580
ఉ. రాజముఖీలలామ, గుణ♦రాజితరాజకళాభిరామ, సు
శ్రీజితశంభుభామ, ముని♦శేఖరకాంక్షితమోక్షసీమ, హా
నాజయధామ యెయ్యెడఁ గ♦నంబడ దియ్యెడ డాఁగె నేమొ, వి
భ్రాజితమంజరీచయస♦రన్మధుపుంజమ తోనికుంజమా. 581
ఉ. చక్కనిదాని శ్వేతజల♦జంబులఁ బోల్కనుదోయిదాని, నున్
జెక్కులదాని లేఁజిగురు♦చెల్వము మెచ్చనిమోవిదాని, సొం
పెక్కినదానిఁ జిల్కల జ♦యించినపల్కులదాని నక్కటా
కక్కస మేల కాంచనము ♦ కాంచితివే దయ యుంచి చెప్పుమా.

ఉ. అంగజుఁ గన్నదాని, నఖ♦లాశ్రితులన్ నెన రున్నదాని, ఖ్యా
తిం గలచిన్నదాని, ముని♦ధీరుల మ్రొక్కులఁ గొన్నదానిఁ ద
న్వంగిని నీ వెఱుంగవె వి♦హంగము! యంగదఁ బాపు మింక నా
రంగము, మాతులుంగము, కు♦రంగము, భృంగము, మోలవంగమా.

గీ. భూసుతా! నీమనవయువం♦బులసొబంగు
పరికృతిశృంగారలక్ష్మిఁ గ♦న్పట్టుఁ గాని
లీల నినుఁ గాన కీరీతి ♦ వేల నైతి
నెందు నినుఁ గందు నెట్లు స♦హింతుఁ గుందు. 584

గీ. నీవు లే వని ఖగమృగా♦నీక మిప్పు
డతులసామ్రాజ్య మబ్బిన♦యట్టు లుండెఁ
బ్రియసఖి నీవు లతుఱి♦జృంభణంబు
సైతువే శీఘ్రముగ రమ్ము ♦ జాల మేల?" 585

గీ. ఇట్లు కామార్తుఁ విధాన ♦ నేడ్చి యేడ్చి
విరహవేదనన్ జానకిన్ ♦ వెదకి వెదకి
అడవి యంతయుఁ బరికించి ♦ యలసి సొలసె
రామచంద్రుండు త్రిభువన♦రక్షకుండు. 586

గీ. భూసుతానేత్రసౌందర్య♦మునకు నోడి
వగను సాధింప వంచుఁ జె ♦ మ్మృగ మటంచు
హరిణములఁ జూచినపు డెల్ల ♦ నాగ్రహించు
రమణిఁ దలపెట్టి విలపించు ♦ రాఘవుండు. 587

గీ. ఉర్విసుత యేది యే దని ♦ యుస్సు రనుచు
ఉస్సు రని యింక సైరింప ♦ నోప ననుచు
ఓప నని శేళ్ళఁ బరికించు ♦ నుగ్రదృష్టి
నట్లు పరికించి మూర్ఛిల్లు ♦ నాదములఁబి. 588

ఉ. "తమ్ముఁడ నే నెవండఁ?" "బర♦దైవతమూర్తివి రామచంద్ర;" "ని
క్కమ్ముగ నీ వెవండవు" "జ♦గన్నుత! నీపదసేవకుండ" "ఘో
రమ్మగు నియ్యరణ్యమున ♦ భ్రాంతిని నేమి యొనర్చుచుంటి?" "సీ
తమ్మకు నై చరింతు;" "వహా ♦ హా సుకేశి! యిదురాణ్ముఖీ! సఖీ!.

ఉ. కోటికిసాటి యైనమణిఁ ♦ గోల్పడినట్టిఫణీంద్రుకైవడిన్
నీటినిఁ బాయుచేఁపకర♦ణిన్, కడు దైన్యమునన్ "లతాంగి! హా
పాటలగంధి!" యంచు నిజ♦భామినికై విలపించె నాజగ
న్నాటకసూత్రధారి రఘు♦నందనుఁ డే మనవచ్చు దుర్విధిన్. 590

గీ. అంత సౌమిత్రి రాముని♦యార్తిఁ జూచి
ఓర్వఁజాలక యోదార్చె ♦ నోపినంత;
తనదుకార్యానుసరణి ని♦ద్రనుసటించు
వాని మేల్కొల్ప శక్యంబె ♦ బ్రహ్మకైన. 591

చ. వనములఁ బుష్పటీరములఁ ♦ బర్వతకందరలన్ సరస్తటా
కనదులఁ జూడఁగాఁ దగిన♦క్ష్మారుహసంచయమధ్యసీమలన్
గనుఁగొని యెందు జానకినిఁ ♦ గానక "కానక యప్పగించితిన్
జనకజ" నంచు రామనృప♦చంద్రుఁడు మార్గ మతిక్రమించుచున్.

గీ. చని చని పథాంతరంబునఁ ♦ దునిసిపడిన
శరశరాసనములఁ గాంచి ♦ సమర మిచట
జరగెఁ దమ్ముఁడా యని జాడ ♦ లరసి నడచి
ఆయువున్ బాయ నున్నజ♦టాయువుఁ గనె. 593

ఉ. "ధన్యుఁడ నౌదు నీభువి♦సుతన్ గొనిపోవుచు నున్నదైత్యుదా
ర్జన్యము సంహరింతు" నని ♦ జన్య మొనర్చి యసృక్కునందుఁ జై
తన్యముఁ దప్పి తత్త్వనిధి ♦ దాశరథీ యని యూరెలుంగునన్
దైన్యము రూపుఁ దాల్చినవి♦ధంబున నున్నజటాయువుం గనెన్.

కం. ప్రముక్కఁడి యగురక్కసిఁ గని
నొక్కుమ్మడి సంహరింప ♦ నుపకారమతిన్
వెక్కసముగఁ బోరి తుదిఁ
దెక్కలు తెగి పడినగృధ్ర♦ఱేనిం గాంచెన్. 595

ఉ. అంతట రామచంద్రుఁడహా♦హా విహగాధిప యెంచఁ జేసి నీ
వంతకు హేతు వే మనుచుఁ ♦ బాణితలంబున మేను దువ్వి, ని
న్నింతకుఁ దెచ్చినట్టిఖలుఁ ♦ డెవ్వఁడు వాని వధింతుఁ జెప్పు మా
వంతయు సంశయింపవల♦దంచు నిజాంకముఁ జేర్చెఁ బ్రేముడిన్.

గీ. తనదువలువను మేనిర♦క్తంబుఁ దొలఁచి
ధూళిధూసరితాంగంబుఁ ♦ దుడిచి నిమిరి
పక్షివిభుఁ గాంచి యేడ్చె బా♦ష్పముల విడిచి
రామచంద్రుండు త్రిభువన♦రక్షకుండు. 597

గీ. గంగ యన విష్ణుపాదోద♦కంబు గాదె
అట్టిగంగాజలస్నాన ♦ మాడువాఁడు
అనఘుఁ డని యండ్రు, విష్ణునే♦త్రాంబువృష్టి
స్నాన మాడె జటాయు వెం♦తటిఘనుండొ?. 598

గీ. రామచంద్రమహోపచా♦రములవలన
నాజటాయువు గోల్పోయి♦నట్టిబలము
దిరుగ సంగ్రహిం చె నసంగ ♦ ధృతి వహించి
ఈ రెటఁగు రాలుపడ నవ్వు ♦ డిట్టు లనియె. 599

గీ. "నీవు భవరోగవైద్యుండ ♦ వింత యేల
శ్రీవిభుండవు నీకు నేఁ ♦ జెప్పవలెన?
ఖలుఁడు దుర్మార్గుఁ డగుపంక్తి♦కంఠువలన
నిట్టిదురవస్థ ప్రాప్తించె ♦ వినకులాఢ్య. 600

ఉ. దానవనాయకుం డతఁడు ♦ దాశరథీ! జనకంటకుండు నీ
జానకిఁ దస్కరించి, పుష్పగ♦శోభకముం గొని నిర్గమించుచుం
డానన మట్లు దక్షిణది♦శన్ రథియై చనుచుండ నక్కటా
నేను సహింపలేక యత♦నిన్ జననీయక నిల్వరించితిన్. 601

ఆ. వె. కురరిపక్షిఁ బోలి ♦ ధరణిపుత్త్రిక యేడ్వ
భీతిఁ దక్కి వాఁడు ♦ వినువఁ డయ్యె
వానితోడఁ బోరి ♦ ప్రాణవాయువులను
నిలుపుకొంటి నిట్లు ♦ నిన్నుఁ జూడ. 602

గీ. ధన్యుఁడను నేను నీసన్ని♦ధానమునను
ప్రాణములఁ బాసి యేగెదఁ ♦ బరమపురుష"
అనిన విని రాముఁ డిట్లనె ♦ "యనఘ నీవు
బ్రదికియుండుము లోకంబు ♦ ప్రస్తుతింప". 603

గీ. అనినఁ దలయూఁచి దరహాస ♦ మంకురింప
నిట్టు లనియెను భక్తితో ♦ గృధ్రవిభుఁడు
"అధముఁడన్ నిన్నుఁ దలఁచిన ♦ ననఘుఁ డైత
రించు నంచు వేదములు వ♦చించుఁ గాదె. 604

మ. పరమాత్ముండవు గాదె నీ విటఁ బర♦బ్రహ్మస్వరూపంబుతోఁ
గరుణన్ ముందట నిల్చి యుండఁ గని యీ♦గాత్త్రంబు వర్జించుటల్;
స్థిరమే యాయువు, వజ్రపంజరమె యీ♦దేహంబు, శ్రీరామ! నీ
చరణాబ్జంబులఁ గొల్చుభక్తునకు సం♦సారంబు నిస్సార మౌ. 605

మ. అరవిందేక్షణ! యొక్కమాట వినుమా ♦ యంతంబునన్ నీసుసుం
దరరూపంబును గంటిఁ జాలు నిఁక గా♦త్త్రం బేల భూభార మౌ
వరదా! ధన్యుఁడ నైతి నీవలన నా♦భాగ్యంబు సామాన్యమే?
నరరూపంబున నున్ననిన్ను భవ♦న్నామంబుఁ గీర్తించెదన్. 606

ఉ. ఎంతతపంబుఁ జేసితినొ ♦ యీశ్వరపూజితుఁ డైనజానకీ
కాంతునినన్ని ధానమున ♦ గాత్రముఁ బాసెద రామచంద్ర! నా
కింతకుమించుభాగ్య మది ♦ యెన్నఁడుఁ జిక్కదు; నీదునామమున్
సూత జపించి నిన్నుఁ గను ♦ చుం జనెదన్ భవదీయసీమకున్. 607

గీ. దాశరథి నేఁడు నీదుసం ♦ దర్శనమున
సకలము లభించె నాకుఁ గో ♦ రికలు లేవు
ఐన, నవసానవేళయం ♦ దఖిలలోక
భక్తసంరక్షణార్థంబు ♦ పలుకుచుంటి. 608

గీ. పృథ్విసుతను వంచించి హ ♦ రించినట్టి
రావణుఁడు శైవ్యుఁ డని లేక ♦ బ్రాహ్మణుఁ డని
జంకకుము వాని నొత్తునఁ ♦ జంపు మనఘ!
పాపులం జంపవలయుఁ బా ♦ పంబు లేదు. 609

ఉ. ఇంతకుఁ గ్రూరుఁ డన్యహరి ♦ ణేక్షణలన్ హరియించుజారుఁ డ
త్యంతమదప్రభూతకలు ♦ షాత్ముఁడు, సాధుమునీంద్రదూషిత
స్వాంతుఁడు, పాపపుణ్యఫలు ♦ లయందు విచక్షణ లేనివాఁడు, కా
లాంతకు మించినట్టియసు ♦ రాంతకుఁ డెంతకు లేఁడు రాఘవా!.

చం. అన విని రామచంద్రుఁడు ము ♦ ఖాంబుజమున్ వికసింపఁ జేసి యి
ట్లనియెఁ "బరోపకారమున ♦ కై తనరక్తము ధారవోయున
య్యనఘునిపాదపద్మరజ ♦ మాదలఁ దాల్చెద; నీదునాజ్ఞ నా
జనకునియాజ్ఞగాఁ గొనెద ♦ సంశయ మొందకు మించుకేనియున్.

చం. అనఘ! ప్రతిజ్ఞఁ గొంటిఁ జతు ♦ రబ్ధుల నైన నతిక్రమించి, య
వ్వనజభవుండు వేఁడినను ♦ భర్గుఁడు హుమ్మని హుంకరించినన్
దనుజులఁ బుత్రమిత్రసహి ♦ తంబుగఁ బోరను సంహరించి, నా
జనకసుతన్ గ్రహింతు నిది ♦ సత్యము సత్యము విశ్వసింపుమా. 612

మ. దినరాడ్వంశపయోధిచంద్రుఁ డనుఖ్యాతిన్ గన్నరాముండనేన్
అనఘుం డీతఁడు లక్ష్మణుం డనుజుఁడే ♦ నార్యామహాదేవితో
నెన యాసీత పతివ్రతాతిలకమే ♦ నిందాద్రిదు లగ్గింపఁగా
విను మొక్కుమ్మడి సంహరింతుఁ ద్రిజగ♦ద్విద్రావణుఁ రావణున్.

గీ. ఈవు ప్రత్యుపకారని♦స్స్పృహుఁడ వగుట
ననఘ! సంపూర్ణకాముఁడ ♦ వగుదు వహహ
పరహితాత్ములకుఁ దుర్ల♦భములు గలవె ?
నీకు నాలోక మొసఁగితి ♦ నిర్మలాత్మ". 614

గీ. అనిన విని యజ్జటాయు వ♦త్యధిక మైన
సంతసముఁ బొంది శ్రీరాము ♦ సంస్మరించి
తచ్చరణపద్మములను నే♦త్రముల నిలిపి
రావణు శపించి నిజశరీ♦రముఁ ద్యజించి. 615

మ. హరిసారూప్యముఁబొందెనో యనఁగ ది♦వ్యాంగంబుప్రాప్తింపఁగా
సుర లోహో యనఁగాఁ జతుర్భుజములన్ ♦ శోభిల్లి పీతాంబరా
భరణంబుల్ తులకింపఁ జిర్నగవృతోఁ♦ బ్రత్యక్షమై నిల్చి యో
వరదా యంచు ననేకభంగుల నుతిం♦పం జొచ్చె శ్రీరామునిన్.616

సీ. నిరుపమానంబుగ ♦ నెగడునీరూప మ
జ్ఞానదీపమునకు ♦ జయము జయము
త్రిగుణాత్మకం బయి ♦ తేజరిల్లిననీదు
సగుణరూపమునకు ♦ జయము జయము
సృష్టించి జీవులఁ ♦ బ్రేమించునట్టినీ
చైతన్యమూర్తికి ♦ జయము జయము
సకలరాక్షసులను ♦ సంహరింపఁగ నిట్లు
సంభవించిననీకు ♦ జయము జయము

గీ. సంసరణదుఃఖవారణా! జయము జయము
సకలలోకవిభూషణా! జయము జయము
జ్ఞానమార్గపరాయణా! జయము జయము
సత్యనారాయణా! నీకు జయము జయము. 617

మ. బలిచూడామణి వై రహించినభవత్పాదాబ్జముల్ సన్నుతిం
ప లవంబేనియు శక్తి లేదు త్రిగుణాత్మా! రామ! శ్రీధామ! భ
క్తులకున్ గొంగుపసిండి వైననిను నేఁ గొండాడఁగా నానె? నా
పలుకుల్ నీసుతుమద్దుపల్కు లని సంభావింపుమా ముక్కుందకా.

మ. భవవారాశిఁ దరించి మోక్షమును సంపాదింపఁ గాంక్షించినన్
భువి జన్మించి నినున్ స్మరింపవలెఁ బో భూపాలుఁడేన్ దేవ! మా
ధవ! నారాయణ! కేశవా! జలజనేత్రా! ధర్మరక్షార్థి వై
రవివంశంబున సంభవించితివి శ్రీరామా! జగన్నాయకా!. 619

గీ. సారహీనసంసారోగ్రసంకటమున
కౌషధము లైన నీమనామాక్షరముల
దుష్టభూపాలఘూకకేతువులఁ బోలు
నీవిశాలబాహువులను నే నుతింతు. 620

సీ. అద్వైతుఁడవు నీవ యప్రమేయుఁడ వీవ
యభవుండవున్ నీవ యంబుజాక్ష!
అవ్యక్తుఁడవు నీవ యాదిదేవుఁడ వీవ
యింద్రియాతీతుఁడ వీవ దేవ!
ద్వంద్వంబుల నణంచి భక్తులఁ గాపాడు
నీనామమంత్రంబు నిరుపమాన!
నీకటాక్షంబున నెగడుజీవికి సృష్టి
కరతలామలకంబు కమలనాభ!

గీ. నీదుసుచరిత్ర మజ్ఞాన♦నేత్రములకు
అంజనంబు సజ్జనమనో♦రంజనంబు
పరమపావన! నీపవి♦త్రమును గ్రహించు
భక్తులకు నీకు నిత్యంబు ♦ వందనంబు. 621

గీ. దేవ ! నీచరణాధీన♦జీవనంబు
నభిలషించి సంతతము ని ♦ న్నాశ్రయించు
భక్తులకుఁ బరాధీనజీ♦వనము తొలఁగు
శాశ్వతానందసౌఖ్యంబు ♦ సంఘటిల్లు. 622

ఉ. నీతిని ధర్మమున్ భువిని ♦ నిల్పఁగ భక్తుల నుద్ధరింపఁ బ్ర
ఖ్యాతిగ భూతలంబున న♦రాకృతిఁ దాల్చిననిన్నుఁ బామర
వ్రాతము "మర్త్యమాత్రుఁ" డని♦పల్కినఁ బల్కును గాక, నీవు ని
ర్హేతుకజాయమానకృప ♦ నెల్లరఁ బ్రోచెద వచ్యుతుండవై. 623

గీ. నీవు దేహమన్ మోక్షమం♦దిరమునందు
భూతచయపూరితస్నేహ♦పూరమునను
తేజరిలుచుండువిజ్ఞాన♦దీపకళిక
దానిఁ బరికింప శక్యమే ♦ ధాతకైన. 624

శా. జ్ఞానధ్యానవిరాగయోగముల న♦శ్రాంతంబు సద్భక్తితో
నీనామం బనుమంత్రరాజము మదిన్ ♦ నీయంబునన్ గొల్చిరేన్
నానాకామితముల్ ఫలించు ననినన్ ♦ సందేహ మొం డుండునే
ఓనిర్హేతుకజాయమానకగుణా ! ♦ యుర్వీసుతావల్లభా!. 625

ఉ. శ్రేయము కీర్తనీయము వి♦శేషశుభప్రద మార్యసన్నుని
ధ్యేయము మోక్షధామము, సు♦ధీహితకామము, నీదునామ మ
జ్ఞేయము నప్రమేయ మని ♦ నిత్యము నాత్మ స్మరించి, యాదినా
రాయణ ! సజ్జనావనప♦రాయణ ! నీకు నమస్కరించెదన్. 626

ఆ. నేతి నేతి యనుచు ♦ నెవ్వాని నిగమముల్
పరిస్తుతించు నట్టి♦బ్రహ్మ మీవ
సత్తుఁ జిత్తు నీవ ♦ సంపూర్ణవిజ్ఞాన
మూర్తి వీవ చక్ర♦వర్తి వీవ. 627

ఆ. అగమ! సుగమ! నిర్మ♦లాత్మ! నీదుపవిత్ర
పాదపద్మములకు ♦ వందనంబు
సమవిషమచరిత్ర! ♦ సజ్జనాంబుజమిత్ర!
వనజనేత్ర! నీకు ♦ వందనంబు. 628

గీ. ఎవనిదయఁ గోరి మునులు ద♦శేంద్రియముల
పొగరు పోకార్చి నిశ్చల♦బుద్ధియందు
ధ్యానముం జేయుదురో యట్టి♦జ్ఞానమార్గ
వర్తికిఁ బవిత్రమూర్తికి ♦ వందనంబు. 629

గీ. మన్మనోనాథ! శతకోటి♦మన్మథులను
ధిక్కరించెడురూపంబు ♦ తేజరిల్ల
సతము నివసింపవలయు నా♦స్వాంతమునను
పద్మదళమున భృంగంబు♦పగిది నీవు. 630

గీ. అనుచు వినుతించి వైకుంఠ♦మునకు నేగు
నజ్జటాయువుభక్తికి ♦ నాత్మ నలరి
రామచంద్రుండు తచ్ఛరీ♦రము దహించి
ప్రియము దళుకొత్త నుత్తర♦క్రియలఁ జేసె. 631

గీ. క్షుద్ర మగుజీవి యయ్యు వై♦కుంఠనాథు
కరుణచేఁ బక్షి కుత్తమ♦గతి లభించె
సమ్మతధాముండు దీనద♦యాపరుండు
రామచంద్రుండు భక్తసం♦రక్షకుండు. 632

గీ. అత్రిభగవంతునిఁ ద్యజించి, ♦ యతిచరించి
జ్ఞానమార్గంబుఁ దప్పిన♦మానవుండు
మందభాగ్యుండు గాక, పా♦మరుఁడు గాక,
వ్యర్థుఁడున్ గాక యకట! కృ♦తార్థుఁ డగునె. 633

గీ. పుణ్యతముఁ డని యప్పక్షి♦పుంగవుండు
పితృసముం డని యుత్తమ♦గతి నొసంగి
రామచంద్రుండు భీకరా♦రణ్యసీమ
నరుగుచుండెను లక్ష్మణుం ♦ డనుసరింప. 634

గీ. అన్నదమ్ములు దుఃఖావి♦లాత్ము లగుచు
ధనముఁ గోల్పోయినట్టివ♦ర్తకులపోల్కి
మార్గమునఁ బోవుచుండ ల♦క్ష్మణునిఁ జూచి
పొంత కేతెంచెఁ బాలదిండి♦పొలఁతి యోర్తు. 635

చ. "సురుచిర మైననీతనువు♦సొంపును జూచి సహింప లేక, యీ
హరునిటలాగ్నిలోఁ బడి య♦నంగుఁ డనంగుఁ డనంగ నొప్పె నో
నరసుఁడ రమ్ము ర" మ్మని య♦జాముఖరాక్షసి రామచంద్రుసో
దరుని స్పృశించి దర్పకుని♦దర్ప మణంచెద నంచు నవ్వుచున్.

ఉ. మిక్కిలిమక్కువన్ వలచి ♦ మెచ్చినయచ్చపుముచ్చెకంటి, నా
పక్కకు రావ దేమి? మగ♦వానికి నింతటిసిగ్గు చెల్లునే?
ఎక్కడివాఁడ వోయి? కుల ♦ మెయ్యది? నీసతి నన్ను మించుమేల్
చక్కరబొమ్మయో చెపుము ♦ చానలఁ జూడనిబ్రహ్మచారివో?.

ఉ. తియ్యనివింటివాని వెసు♦దీయక కయ్యము సేయువాని నా
నెయ్యము లేకయే గెలువ♦నేర్తువె? యోర్తువె? నీటు కాఁడ వే
శయ్యకు నన్నుఁ దార్చి కను♦సన్నను మెల్లఁగ నీవిఁ జార్చి వ
న్నియ్యెడఁ గూడు మూఁకిడఁగ ♦ నెవ్వరు లే రిఁక జంక నేటికిన్.

ఉ. వల్లనివాఁడు వీఁడు నిను ♦ నన్ను సుఖింపఁగనీఁడు, వీనితో
మెల్లఁగ నెయ్య మింక విర♦మింపుము నన్ను రమింపు మింపుగాఁ
జల్లనిముద్దు లిమ్ము, వర♦శైలగుహాంతరసీమలందు న
న్నెల్లవిధంబులన్ రతుల ♦ నేలు మొకించుక తృప్తి దీఱఁగా. 639

గీ. అనిన విని యోయజాముఖి ♦ యందకత్తె
వప్రుదు వని లక్ష్మణుఁడు ముక్కు♦చెవులఁ గోసి
పొ మ్మనినయంత నక్కాంత ♦ పొక్కి వెక్కి
పడుచు లేచుచుఁ దనపిక్క♦బలిమిఁ జూపె. 640

గీ. పిదప రామసౌమిత్రు ల♦వ్విపినమునను
వ్యాఘ్రసింహాదిదుష్టస♦త్త్వములతోడ
నిండుకొనియుండుపథమునన్ ♦ వెడలుచుండి
రతులదుఃఖభారావన♦తాస్యు లగుచు. 641

గీ. కంటకావృతవిషమమా♦ర్గంబుఁ గడచి
పొదల విదళించి మెల్లఁగ ♦ నదుల దాఁటి
దనుజు లుండెడుస్థలములఁ ♦ దారి తారి
కానలోఁ గలయొకకొండ♦కోనప్రాంత. 642

గీ. అతులబాహుమదాంధుఁ గ్రి♦వ్యాదబంధు
గంధసింధురస్కంధు, మ♦హాంధకార
బంధురాజ్ఞానసింధుఁ గ♦బంధుఁ గాంచి
శాపము తొలంగ రాముండు ♦ సంహరించె. 643

మ. తరుణీ! యీతఁడు పూర్వజన్మమున గం♦ధర్వుండు, సంగీతమా
ధురిచే నారదు ధిక్కరింతు ననుచున్ ♦ దూర్వాసుఁ డాలింప, గా
నరసంబున్ గురిపించి, తత్ప్రియుతు లం♦దన్ లేక కోపించి ము
మ్కరుఁడై తిట్టె తదీయశాపహతుఁడై ♦ జన్మించె దైత్యాకృతిన్.

గీ. దైత్యుఁ డై పుట్టి జీవసం♦తతుల నేచి
జగతికిఁ గీడు వాటింప ♦ సైఁపలేక
అమరనాథుండు కినిసి వ♦జ్రాయుధమునఁ
గొట్టినఁగ వానిశీర్షంబు ♦ పొట్టఁ జొచ్చె. 645

గీ. ఆకబంధుండు చావక ♦ యట్టు లుండి
అమరనాథునిఁ బ్రార్థించి ♦ యతనికృపను
అమితదీర్ఘహస్తుం డయి ♦ యడవియందు
జీవులన్ స్వీకరించి భ♦క్షించుచుండె. 646

గీ. నిడుదకేల్గోయినడుమన♦బడినయట్టి
అన్నదమ్ములఁ దినఁబోవు♦నంతలోన
వాఁడు శ్రీరామునిహేతిని ♦ ప్రాణములను
దక్కి, శాపవిముక్తుఁ డై ♦ ధన్యుఁ డయ్యె. 647

గీ. శాపము దొరంగి శ్రీరామ♦చంద్రుఁ జూచి
అనఘ! నన్ను శపించెను ♦ మునివరుండు
ధన్యతం గంటి నేఁడు నీ♦దర్శనమున
ననుచు వినుతించె నాతఁ డ♦త్యధికభక్తి. 648

గీ. గ్రహవిముక్తినిఁ గన్నచం♦ద్రునిభంగి
భాసిలుచు నున్నగంధర్వ♦వరునిఁ జూచి
అతఁడు నిగడించువృత్తాంత ♦ మాలకించి
ఇంచుక హసించి శ్రీరాముఁ ♦ డిట్టు లనియె. 649

గీ. "జపముఁ దపమును విడువక ♦ సర్వభూత
సంచయంబును బ్రేమించి ♦ శాంతమునను
భక్తి విజ్ఞాన వైరాగ్య♦భావమునను
వఱలుసద్బ్రాహ్మణుండు నా♦ప్రాణసఖుఁడు. 650

గీ. బ్రాహ్మణులు దైవసము లను ♦ భావమునను
వసుధ వర్తించువాఁడు నా ♦ బాంధవుండు
బ్రాహ్మణులఁ జూచి నిరసించి ♦ వైర మెంచి
సంచరించెడువాఁడు నా ♦ శాత్రవుండు. 651

గీ. సత్య శౌచ దయా ధర్మ ♦ శాంతి దాంతి
సద్గుణంబులఁ గలవాఁడు ♦ తాపసుండు
తాపసునిహృదయంబు నా ♦ మందిరంబు
ఔదలం దాల్తు బ్రాహ్మణు ♦ పాదధూళి. 652

గీ. బ్రాహ్మణునిపాదచిహ్నంబు ♦ వక్షమునను
ఆభరణ మంచుఁ దాల్చెద ♦ నతులభక్తి
నవనిసురుపాదతలమున ♦ హరునినిటల
భాగమున జ్ఞాననేత్రంబు ♦ ప్రజ్వరిల్లు. 653

గీ. మించి భూమండలంబుఁ బా ♦ లించుఁ గాక
చెలఁగి యనివార్యబలమున ♦ మెలఁగుఁ గాక
రాజు బ్రాహ్మణు నిరసింప ♦ రాదు చూవె
బ్రాహ్మణద్వేషమునఁ జచ్చుఁ ♦ బార్థివుండు. 554

గీ. జపతపోధ్యానపరు లౌట ♦ శాంతు లౌట
బ్రాహ్మణప్రవరులు పర ♦ బ్రహ్మహితులు
వారిఁ బూజించువాఁ డతి ♦ పావనుండు
భూసురవరేణ్యకోపంబు ♦ నే సహింతు. 655

గీ. తనకు సద్ధర్మ మిట్లు గం ♦ ధర్వవరున
కెలమి బోధించి వీడ్కొల్పి ♦ యినకులుండు
పాదచారి యై శబరిని ♦ వాసమునకు
అమితవాత్సల్యవశమున ♦ నరుగుదెంచె. 656

ఉ. అచ్చపుభక్తితోడ విమ♦లామృత మొల్కు విధాన రామనా
మోచ్చరణం బొనర్చుచు, మ♦హోత్సుకత న్స్మరియించి మెచ్చుచు
న్గ్రిచ్చఱఁ బాడుచున్ శబరి ♦ కన్గొని ముందఱఁ బాదచారి యై
వచ్చినరామునిన్ బహుళ♦పాపవిరాముని మోక్షధామునిన్. 657

గీ. వనజనయనంబుల విశాల♦బాహువులను
అతులవనమాలతోడిభు♦జాంతరంబు
వరజటామకుటాన్విత♦శిరముఁ జూచి
శబరి శ్రీరాముచరణాంబు♦జముల కెరఁగి. 658

ఉ. ఆత్మ యకృత్రిమం బయి య♦నాది, యనంతము, నై రహించు, నీ
యాత్మయె సర్వభూతములు ♦ నాత్మయె దైవత మీజగత్త్రయం
బాత్మయె, యిట్లు నాకుబహి♦రంతరవీథుల నిండి యుండున
ర్వాత్మకు జ్ఞానరూపపర♦మాత్మకు నేను నమస్కరించెదన్. 659

సీ. వాత్సల్యవశమున ♦ భక్తురాలిని జూడ
నడచివచ్చితి వీవు ♦ నలిననేత్ర
నాపూర్వసుకృతంబు ♦ రూపుఁ దాల్చి యిట్లు
నానివాసముఁ జొచ్చె ♦ శ్రీనివాస
ఇంతకాలముదాక ♦ నేఁ గాచుకొనియుంటి
నాదుపున్నెము పండె ♦ జ్ఞాననిలయ
భాగీరథిఁ గన్న♦పాదపద్మంబులఁ
గన్నీటఁ గడిగెదఁ ♦ గమలనాథ

గీ. ఆసనముఁ గొమ్ము ఫలముల ♦ నారగింపు
మతిథి వైతివి నాకు స♦ద్గతి లభించె
విబుధు లభ్యాగతఃస్వయం♦విష్ణు వనెడు
వాక్కు నిక్కమయ్యెను నాకుఁ ♦ బరమపురుష!. 660

గీ. ప్రతిదినంబును భూరుహ ♦ ప్రతతి నుండి
తుంచి రుచిఁ జూచి ఫలముల ♦ నేంచి తెచ్చి
దాఁచియుంచితి నీ కయి ♦ వేచియుంటి
నారగింపుము శ్రీరామ! ♦ రఘువిరామ. 561

చం. అనవుఁడు రాఘవుండు దర ♦ హాసముఁ జేయుచుఁ బ్రీతితోఁ దనం
తన ఫలసంచయంబు నమృ ♦ తం బని మెల్లఁగ నారగించి, పా
వనమును నిశ్చలంబు నగు ♦ భక్తికి నెంతయు సంతసింపఁగా
నినకులుఁ జూచి యాశబరి ♦ యిట్లనియెన్ వినయానతాస్య యై.

గీ. "శిష్టుఁ డగుమతంగమునీంద్రు ♦ శిష్యురాల
నతఁడు పరమధామంబున ♦ కరుగువేళ
నరుగఁ దలఁచితి నేను ద ♦ దాజ్ఞవలన
నిన్ను దర్శింపఁ గోరి యి ♦ ట్లున్నదాన. 563

గీ. మంచిచెడ్డల నెఱుఁగని ♦ మందమతిని
అధమకులజను వేదశా ♦ స్త్రాదు లెఱుఁగ
మూర్ఖురాలను నిన్నెట్లు ♦ పొగడనేర్తు
నఖిలగుణధామ! శ్రీరామ! ♦ రఘువిరామ!. 564

గీ. అనిన విని రాముఁ డిట్లనె ♦ నాదరమునఁ
గులము జన్మంబు, సంపద ♦ బలము గుణము
దానధర్మంబులున్ దపో ♦ ధ్యానములును
వ్యర్థములు భక్తియె ప్రధాన ♦ మగును నాకు. 565

ఆ. వె. ప్రస్తుతింపఁ దగిన ♦ భక్తియోగము లేని
యోగ మేల రాజ ♦ యోగ మేల?
భక్తి లేనివాని ♦ ప్రాభవం బది యేల
జలము లేనిమబ్బు ♦ చందమునను. 566

ఉ. సత్యము నాశ్రయించి, మది ♦ సంశయమున్ ద్యజియించి దుష్టసాం
గత్యముఁ బాసి నాదుగుణ ♦ గానమునం దనురక్తిఁ గల్గినన్
నిత్యముఁ గొల్చి భూతదయ ♦ నీమముగాఁ జరియించువానికిన్
భృత్యుఁడఁ జెక్కు లేల శబ ♦ రీ! యిది నిక్కము నీకుఁ జెప్పితిన్.

సీ. దురభిమానము డుల్చి ♦ గురుజనంబులఁ గొల్చి
కపటకలుషితమా ♦ ర్గమును విడిచి
నానామము స్మరించి ♦ నామంత్రము జపించి
నిఖిలేంద్రియంబుల ♦ నిగ్రహించి
భక్తుల సేవించి ♦ వైరాగ్యము వహించి
యన్యమతంబుల ♦ నాదరించి
జీవులఁ బ్రేమించి ♦ సృష్టి నే నని యెంచి
తన కున్నదానితోఁ ♦ దనివిఁ గాంచి

గీ. పరులగుణముల మే లెంచి ♦ ప్రస్తుతించి
ఆశలన్ దుంచి నిజధర్మ ♦ మనుసరించి
హర్షశోకంబులఁ ద్యజించి ♦ యలరువాని
కింకరుఁడ నేను నీ కింక ♦ శంక వలదు. 568

గీ. అన్నివిధముల ధన్యతఁ ♦ గన్నదాన
వస్మదీయపాదాంబు రు ♦ హంబులందు
గాఢభక్తివిశ్వాసముల్ ♦ గలవు నీకు
నిన్ను గ్రహియింపఁ గలవారు ♦ నిపుణమతులు. 599

గీ. చాల మతిమంతురాలవు ♦ జనకపుత్రి
నెఱుఁగుదే జెప్పుమా యన్న ♦ వినకులాఢ్యు
పాదపద్మంబులకు మ్రొక్కి ♦ పలికె నిట్లు
కరయుగము మోడ్చి యాతామ్రకబరి శబరి. 570

గీ. ఈ వెఱుంగనివృత్తాంత ♦ మెందు గలదె?
అసురు లతిమూర్ఖు లమితమ♦దాంధు లందు
నసురనాయకుం డగురావ♦ణాసురుండు
ఎట్టిక్రూరుండొ యూహింప ♦ నేరితరము. 571

గీ. రావణుఁడు సర్వరాక్షస♦ప్రభువరుండు
అమితకామార్తుఁడు మదాంధుఁ ♦ డబ్జభవుని
వరబలంబునఁ గ్రొవ్విన♦బల్లిదుండు
విడిచిపుచ్చునె కాంత, ల♦భించెనేని. 572

చం. కలఁడు కుశధ్వజుండు ముని♦కాంతుఁడు, వేదములన్ బఠించెనేన్
జలరుహగర్భుఁడున్ బొగడఁ ♦ జాలక కోరును శేషభావముల్;
పొలుపుగ నాతఁ డధ్యయన♦ముం బొనరించుచు నాత్మవక్త్రమం
దలరులపించెవాని లలి♦తాంగిని మీఱినసుందరిన్ గనెన్. 573

గీ. వేదముఖరితముఖమున ♦ వెలసెఁ గాన
వెలఁది భువి వేదవతి నాఁగ ♦ మెలఁగె ననఘ!
ఆకుశధ్వజుఁ డాపె శ్రీ♦హరికి నొసఁగి
పెండ్లి సేయంగ నెంచి త♦పించుచుండ. 574

గీ. శంభుఁ డనుదైత్యుఁ డధికసం♦రంభమునను
పజ్జ కేతెంచి మునిఁ గాంచి ♦ పలికె నిట్లు
వీరవరుఁడను నా కిమ్ము ♦ వేదవతిని
ఎలమిఁ బెండ్లాడి ముద్దార ♦ నేలుకొందు. 575

గీ. మహి ననామకుఁ డెవఁడొ నా♦మములఁ దాల్చి
పొంత కేతెంచి హరి నంచు ♦ మోసగించి
అక్కటా! యీపెఁ బెండ్లాడి ♦ చక్కఁబోవు
విష్ణు వన నెవ్వఁ డతఁ డేడ ♦ వెంగలీఁడ!. 576

గీ. ఈజగన్మోహినీదేవి ♦ నీలతాంగి
నూరుఁ జేయను లేనియ♦యోమయాత్మ్యుఁ
డైన యెవనికో యొసఁగెద ♦ నందు వీవు
మగువ నాకిమ్ము మామ! నా♦మాట వినుము. 577

గీ. అనినఁ జిఱునవ్వు నవ్వి దు♦రాత్మ యనుచు
నమ్మునీందుృండు పా మ్మని♦నంత లేచి
మంచి దని దైత్యవరుఁడు కో♦పించి వెడలి
మగుడ నడురేయి వచ్చి యా♦మ్మాని జంపె. 578

గీ. జనకునిప్రతిజ్ఞ నెఱవేర్ప ♦ వనజనేత్రి
వనమునఁ దపించె వనజనే♦త్రునిఁ దలంచి,
అంత నొకనాఁడు రావణుం ♦ డడవియందు
నామెఁ బరికించి వలచి యి ♦ ట్లనియె నెలమి. 579

గీ. “అతివ! చక్కనిచక్క వె♦వ్వతెవు చెపుము
వైభవముతోడిభోగాను♦భవముఁ దక్కి
ఆతపంబునఁ దపియింప ♦ నర్హ మగునె?
యోర్తునే? కాముని కటారి ♦ వో మిటారి.” 580

క. ఇంతటిసుందరాంగివి, మృ♦గేక్షణ! చెల్లునె బ్రహ్మచర్య మే
కాంతవనాంతరంబులకు ♦ యావన మంతయు నప్పగింప నీ
స్వాంతమున న్దలంచితివె? ♦ బ్రాహ్మణుఁడన్ ఘనుఁడన్ దిగంతవి
శ్రాంతయశోధనాఢ్యుఁడను ♦ రావణుఁడన్ ననుఁ బెండ్లియాడవే.

ఆ. నన్నుఁ గూడె దేని ♦ నాదుసామ్రాజ్యంబు
నీదుపాలనమున ♦ నెగడు బాల
బేలతనము మాని ♦ పెండ్లాడుమా నన్ను
బ్రహ్మచర్య మింక ♦ వలదు వలదు. 582

గీ. నాదుదృష్టికిఁ జిక్కిన ♦ నాతిమిన్న
కకట ! దక్కెనె బ్రహ్మచ ♦ ర్యవ్రతంబు
నిన్నుఁ ద్రికరణశుద్ధిగ ♦ నెన్నుకొంటిఁ
దరుణి ! నాముద్దుఁ జెల్లింపఁ ♦ దగును నీకు. 583

ఆ. అనిన నాలకించి ♦ యాగ్రహంబునఁ జూచి
వేదవతి వచించె ♦ భీతిఁ దక్కి
"విష్ణుఁ దక్క నన్యుఁ ♦ బెం డ్లాడఁ జాలను
వెడఁగుమాట లేల ♦ వెడలు మింక. 584

ఆ. దానవుండ వీవు ♦ మానవిఁ బెండ్లాడ
నర్హ మగునె చెపుమ ♦ యసురనాథ !
జవ్వనంబు హరికి ♦ జన్నఁగట్టితి నన్యుఁ
గంటఁ జూడ వలను ♦ గాదు నాకు". 585

గీ. అనిన విని వాఁడు మే లని ♦ యపహసించి
దరి సమీపించి నిల్చి యా ♦ దలల నూచి
"విష్ణుఁ బెండ్లాడ నెంచితే ♦ బేల వహవా !
లేనివానికై యీతనూ ♦ గ్లాని యేలఁ? 586

చ. హరి గిరి యెవ్వఁడే చెపుము ♦ యష్టదిగీశులఁబెంపణంచి, ఖే
చరుల జయించి, కింపురుష ♦ సాధ్యుల సిద్ధులఁ గిన్నరాదులన్
గరుడులఁ బాదసేవకులు ♦ గా నొనరించితి, ముజ్జగంబులన్
హరి యనువాఁడు లేఁడు విను ♦ మంబురుహాక్షి భ్రమింప నేటికిన్". 587

గీ. అనిన విని యాపె "యంతట ♦ నలరువాని
నిందుఁ జూపింపు మనవచ్చు ♦ నే దురాత్మ!
ఈవ పరికింపఁ దగుఁ గాక ♦ యీవివాద
మేల పొమ్ము పొ" మ్మన్న దై ♦ త్యేశ్వరుండు. 588

గీ. "అంతట రక్షించువాఁడు నా♦యందు లేఁడె?
రమ్ము ర"మ్మంచు నాపెక♦రమ్ముఁ బట్టి
బలిమిమై లాఁగినంత న♦వ్వాలుఁగంటి
కేలు క్రొవ్వాఁడివాలునాఁ♦ గ్రాలె ననఘ!. 589

గీ. "ఓరి రావణ! యించుక ♦ యోర్చి యుండు
మిప్పుడే నిన్ను శపియింప ♦ నొప్పఁ గాని
శ్రేష్ఠతరతపోధనము ♦ వెచ్చింపఁజాల
నీవు తాఁకినతనువుతో ♦ నిలువఁజాల. 590

గీ. ముందుజన్మంబునందు నిన్ ♦ బొలియఁజేసి
దానవకులంబు ధ్వంసంబు♦గా నొనర్తు"
ననుచు శపియించి యక్కాంత ♦ యాగ్రహించి
అగ్నిఘాతంబునందు దే♦హమును విడిచె. 591

గీ. ఆపెయే చూడ జానకి ♦ యై జనించె
నసురనాయకుఁ జెఱఁగొని ♦ యుపహరించె
స్వకులగర్వదర్వీకర♦నకుల మనఁగ
వానిపాపంబు నేఁటికిఁ ♦ బండెఁ గాదె?. 592

గీ. అనఘ! పంపాసరోవర♦ప్రాంతమునకు
విజయముం జేయుఁ డచటఁ బ♦విత్రులైన
మునులు యోగులు నివసింతు ♦ రనుదినంబు
నచటఁ గలవారి కతులసౌ♦ఖ్యములు గలుగు. 593

గీ. ఉగ్రమృగములు సైత మ♦న్యోన్యమైత్రి
నచట నివసించుఁ బరహింస ♦ యందు లేదు
ప్రకృతిసంపద పెంపొదఁ ♦ బర్వతములు
వనములుఁ జీవనదులుఁ గ♦న్పట్టు నచట. 594

చ. ఖగములు భీతిఁ దక్కి ముని♦కన్యలతో విహరించు స్వేచ్ఛగా
మృగములు గోవువత్సముల♦రీతి మునీంద్రులపొంత నుండుఁ బ
న్నగములు పుష్పహారము ల♦నం గనుపట్టుచు నుండు నెల్లెడన్
నగములు దివ్యసౌధభవ♦నంబులభంగి నివాసయోగ్యముల్.

గీ. భూరిమంగళవిగ్రహుల్ ♦ మీర లుభయు
లచటఁ గలమహర్షులకుఁ బ్రీ♦త్యర్థ మైన
వారికోరిక లీడేఱు ♦ వారివలన
సత్వరము నీకు కార్యంబు ♦ సఫల మగును. 596

గీ. తొలుత సుగ్రీవుసఖ్యంబు ♦ గలుగు నీకుఁ
బిదప వాలిని రావణుఁ ♦ బిలుకుమార్చి
పుష్పకవిమాన మెక్కి భూ♦పుత్త్రితోడ
నాత్మపురమున కేగెద ♦ వంబుజాక్ష!. 597

గీ. ఘనుఁడు పావనుండు మతంగ♦మునివరుండు;
అతనివృత్తాంత మియ్యది ♦ యద్భుత మగునె?
అర్కకులవారినిధిసోమ! ♦ రఘువిరామ!
సద్గుణస్తోమ! శ్రీరామ! ♦ సమరభీమ!. 598

గీ. అనుచు శ్రీరాముని నుతించి ♦ యతనిరూపు
భావఫలకంబున రచించి ♦ భక్తిఁ గొల్చి
అతులపావన మైనయో♦గాగ్నియందు
గాత్రము దహించి విష్ణులో♦కమున కేగె. 599

గీ. అధమకులమున జన్మించి♦నట్టిశబరి
రామభక్తిచేఁ జనె మోక్ష♦ధామమునకు;
అట్టిరాముని విడనాడి ♦ యైహికములు
శాశ్వతము లంచు మూఢులు ♦ సంచరింత్రు. 600

సీ. ఓంకారనాద మ♦హంకారవశమునఁ
జెవులార వినలేని ♦ చెవిటులార!
ప్రకృతిలో లీనమై ♦ భాసిల్లుబ్రహ్మంబుఁ
బరికింప లేనిదా♦ర్భాగ్యులార!
అచలవిశ్వాసంబు ♦ నతులవైరాగ్యంబు
జ్ఞానంబు లేనియ♦జ్ఞానులార!
సన్మార్గమున్ ద్రొక్కి ♦ సద్భక్తులన్ గొల్చి
జీవింపఁ జాలని♦చెనఁటులార!
గీ. శబరిమార్గంబుఁ బట్టి సం♦శయము విడిచి
రామపాదారవిందమ♦రందపాన
మత్తచిత్తులై మెలఁగిన ♦ నుత్తమగతి
క్షణములో మీకుఁ జేకూరు ♦ శాశ్వతముగ. 601
గీ. శబరికిట్లు మోక్ష మొసఁగి త♦త్క్షణమ రామ
చంద్రుఁడుఁ లక్ష్మణుండు నా♦స్థలముఁ బాసి
విపినమార్గంబునం బడి ♦ వెడలుచుండి
రాశ్రమంబులఁ జూచుచు ♦ నచ్చటచట. 602
గీ. మార్గముం దప్పివచ్చుసిం♦హములపోల్కి
విపినముల రామలక్ష్మణుల్ ♦ వెడలుచుండ
నఖలదిశలను మాధవుం ♦ డలరఁజొచ్చెఁ
బుష్పవతి యైనవనలక్ష్మి♦పొందుఁ గలిగి. 603
గీ. అవ్వసంతాగమ మనుచం♦ద్రోదయమునఁ
దనదువిరహాబ్ధి యుప్పొంగె ♦ ననఁగ రాముఁ
డధికసంతాపముం బొంది ♦ యలసి సొలసి
ప్రకృతిఁ గోల్పోయి మతిఁ దప్పి ♦ పలువరించె. 604

గీ. "డంబు దీపింప భళిర! పై ♦ కంబుకొంతకు
నాగ సహకార పూగ పు ♦ న్నాగములను
దారిలోఁ బేర్చినావో వ ♦ ర్తకుని పోల్కి
నుసుగు మీఁక నేటి కీసంత ♦ యోవసంత!. 605

గీ. సకలవనముల ధీరుఁడై ♦ సంచరించి
పుణ్యజనులను జూచి, య ♦ మోఘబలుఁడు
అవనిజాశయ మెఱిఁగిన ♦ యలఘుయశుఁడు
దక్షిణమునుండి పవనసం ♦ దనుఁడు వచ్చె. 606

గీ. ఖగమృగంబులు తమతమ ♦ మగువలందు
మక్కువం గల్చి విహరించి ♦ యక్కటకట
పడఁతి నెడఁబాయఁ దగున దౌ ♦ ర్భాగ్య యనుచు
నన్ను నిందింపఁ బరికింపు ♦ చున్న వేమొ?. 607

చ. పురుషమృగంబు నన్నుఁ గని ♦ పోఁ దలపోయుచునుండ స్త్రీమృగం
బరయక పాఱిపోఁ దగునె ♦ యారేఁడు స్వర్ణమృగార్థి వెండియుఁ గా
విరహి యటంచు నాథునకు ♦ వేమఱుఁ జెప్పినరీతిఁ దోఁచె; నా
వరుసన నాలిఁ గోల్పడిన ♦ వాఁ డిలఁ జుల్కన గాదె యేరికిన్. 608

గీ. పురుషగజము కరంబునఁ ♦ గరిణికరముఁ
బట్టుకొని ప్రేమమున వచ్చు ♦ వరుసఁ జూడఁ
"బొమ్ము నీభార్య నిట్లు తో ♦ డ్తెమ్ము వేగ"
మనుచు నా కుపదేశించె ♦ ననఁగఁ దోఁచు. 609

గీ. భార్యఁ బాయక హృదిఁ బూన ♦ వలయుఁ జూవె
ప్రతిదినము శాస్త్రములఁ జూడ ♦ వలయుఁ జూవె
ప్రభువు నిరతంబు సేవింప ♦ వలయుఁ జూవె
ప్రాలుమాలినఁ దనదు కై ♦ వసము దప్పు. 610

సీ. పలుగాకిపక్షుల ♦ బలగంబుగాఁ గూర్చి
వనదేవతలు తోడు♦పడుటఁ జూచి
క్రొవ్విన తేఁటుల♦కోలాహలముతోడఁ
గొమరారుపుష్పబా♦ణములతోడ
విధురబాధకుఁ జిక్కి ♦ మెయి వణఁగిననన్ను
బలహీనుఁగా నెంచి ♦ పంచశరుఁడు
తా జయింపఁ దలంచి ♦ దండెత్తె నూహించి
నీవు నాయుఁడను ♦ నిల్చియుండ

గీ. జయము చేకూర దని యోర్చి ♦ జరిగెఁ గాక
తమ్ముఁడా! వానియోధుల♦దర్ప మెన్న
నలవియే యెట్టివానికి ♦ నైనఁ గాని
ఏమి సేయుదు నీబాధ ♦ యెట్టు లణఁగు?. 611

గీ. అల్లిబిల్లిగ మ్రాఁకుల ♦ నల్లుకొనిన
వల్లికలు వితానంబు లై ♦ పరిఢవిల్లె
భూరిరంభాతరుస్తంభ♦ములును దీర్ఘ
తాళవృక్షంబులుఁ బతాక♦తతులఁ బోలె. 612

గీ. వివిధపుష్పసమన్విత♦వృక్షకోటి
బారులై దీర్చి నిలిచిన♦భటులఁ బోలె;
నచ్చటచ్చటఁ దనరుమ♦హాకుజములు
శిబిరములభంగి నెంతయుఁ ♦ జెలువు మీఱె. 613

గీ. పల్లవగ్రాసలాలస♦పైకరవము
సమదసామజకులబృంహి♦తములఁ బోలె;
విహగములు పదాతులలీల ♦ విక్రమించెఁ
గరలి యామనిదుముదారు♦దొరను బోలె. 614

గీ. కీరములుఁ బావురంబులు ♦ శారికలును
రాజహంసంబు లహహ కు♦క్కుటములు గాఁగ
రమ్యపుష్పనికుంజముల్ ♦ రథము లయ్యె
వివిధభృంగఝంకారంబు ♦ భేరిఁ బోలె. 615

గీ. ప్రణయసామ్రాజ్యలక్ష్మీధు♦రంధరుండు
సద్యశస్స్ఫూర్తి శృంగార♦చక్రవర్తి
యోగుల వియోగుల జయించు♦నుక్కడీఁడు
దర్పకుఁడ నంచు దర్పించి ♦ దాడి వెడలె. 616

గీ. ఏగతి వచింతుఁ గాముని♦యాగడంబుఁ
గామునకు భీతిఁ జెందని♦ఘనుఁ డెవండు ?
అతనిబల మంతయున్ స్త్రీల♦యంద గలదు
తరుణుల జయించుపురుషుండు ♦ ధన్యతముఁడు. 617

మ. బలియుం డీమదనుండు దుర్జయుఁడు, లో♦భక్రోధమోహాదిశ
త్రులతో జ్ఞానుల యోగులన్ మునులఁ గ్రూ♦రుం డై నిరోధించి కాం
తలకున్ దాసులఁ జేయుచుండు వినుమా ♦ తమ్ముండ, యీ కాముని
న్గెలువం జాలినవాఁడు ధర్మ్యుఁ డగు న♦క్షీణప్రభావాఢ్యుఁ డై".

మ. త్రిగుణాతీతుఁడు రామచంద్రుఁ డను పరా♦ధీనుండౌ? దీనుఁడౌ? ప
న్నగతల్పుండు పరాత్పరుండు, సకలాం♦తర్యామి, నిష్కామి, యె
న్నఁగ నాస్వామి, చరాచరాన్వితధరా♦నాథుండు, సామాన్యమ
ర్త్యగతిన్ గాముకుఁ డై నటించె విరహా♦ర్తిం బొందు దుఃఖంబులన్.

గీ. అతనికరుణను సజ్జన♦స్వాంతము లను
ధైర్యము వసించికొండచం♦దమున నుండు
అతనిమాయాగుణంబు ల♦త్యంతభక్తి
యుక్తులను దాఁక దన్న న♦త్యుక్తి యగున ?. 620

గీ. అతనిచే నరిషడ్వర్గ ♦ మంతరించు
నతనిఁ గొలిచిన సకలసౌ♦ఖ్యములు గలుగు
రామచంద్రుండె యాదినా♦రాయణుండు
విను మనంతరవృత్తాంత♦మును లతాంగి. 621

గీ. రాముఁడు వియోగదుఃఖభా♦రము నటించి
లక్ష్మణునితోడ నటవీస్థ♦లంబునుండి
రమణపంపాసరోవర♦ప్రాంతమునకు
మెల్ల మెల్లఁగ నేతెంచె ♦ నుల్ల మలర. 622

చ. నరులు మునుంగఁగాఁ దగిన♦నాలుగురేవులతో రహించి, స
త్పురుషులచిత్తమ ట్లమల♦తోయసమన్వితమై గభీరమై
కరము పవిత్రమై దివిజ♦గంగకు సాటి యనంగఁ దత్సరో
వరము మనోజ్ఞమై మునుల♦ప్రస్తుతి కెక్కె ననేకభంగులన్.

గీ. పుష్పభూరుహంబులు తీర♦ముల రహింప
నెల్లమధుపంబులనినాద ♦ మింపుఁ బెంప
సన్మునీంద్రులు మే లని ♦ సన్నుతింపఁ
బంవ తనసొంపు నింప వ♦ర్ణింప నొప్పె. 624

గీ. అడిగినది యిచ్చు నని దాత ♦ నాశ్రయించి
వేచి యుండెడుయాచక♦వితతిఁ బోలి
పక్షిసముదాయ మీసరో♦వరముపొంత
వేచి యున్నది తమ్ముఁడా ♦ చూచినావె 625

గీ. జలజకైరవపత్రసం♦ఛన్నమైన
ఈసరోవరసలిలంబు ♦ నెఱుఁగ వశమె?
మాయచేఁ గప్పఁబడినసం♦సారమునను
ఎవఁడు నిర్గుణబ్రహ్మంబు ♦ నెఱుఁగఁగలఁడు? 626

గీ. ఈగభీరసరస్సున ♦ నేకరీతి
మత్స్యములు సంతసంబున ♦ మలయుమాడ్కి
నిలను ధర్మాత్మునిదినంబు ♦ లేకరీతిఁ
గష్టములు లేక హాయిగఁ ♦ గడచుఁ గాదె ?. 627

గీ. పలుతెఱంగులరంగులఁ ♦ బరిఢవిల్లు
కలువపూవులఁ దమ్ములఁ ♦ గాంచినావె ?
తమ్ముఁడా ! నిక్కముగ నాకుఁ ♦ దమ్ములందు
హేతు వేమియొగాని సం♦ప్రీతి మెండు. 628

కం. కలహంససారసంబుల
జలకుక్కుటముల బకములఁ ♦ జక్రంబులఁ ద
త్కలకలనాదంబుల నా
జలరుహగర్భాండుఁ బొగడఁ ♦ జాలఁడు వినుమా. 629

గీ. శారికాకీరపరభృత♦సంచయంబు
అనిశమున్ జేయుకలవరం ♦ బాలకింపఁ
గొలఁకున మునింగి శ్రమఁ దీర్చు♦కొనుఁ డటంచు
బాటసారులఁ బిలిచిన♦పగిదిఁ దోఁచు. 630

గీ. ప్రజలకుఁ బాధ లేకుండఁ ♦ బన్నులఁ గొను
రాజనీతిపరుం డగు♦రాజునోజఁ
గమలము లొకించుకంతయుఁ ♦ గందకుండ
మధువుఁ గ్రోలెడుఁ జూచితే ♦ మధుపవితతి. 631

గీ. ఈసరోవరతీరస్థ♦వృక్షములకు
సాటి గలవృక్షములు లేవు ♦ జగతియందు
అచటిమున్యాశ్రమంబుల ♦ నరసినావె
పావనక్షేత్రములభంగిఁ ♦ బరిఢవిల్లు. 632

గీ. చంపక కదంబ వకుళ రసాల సాల
పాటల పలాశ హింతాళ ♦ పణస తాళ
జంబు జంబీరభూరుహ♦సంచయంబుఁ
గాంచినాడవె కన్నుల♦కఱవు దీఱ. 633

గీ. ఈరసాలంబు వర్ణింప ♦ నెవనితరము?
చూచితివె బాళరమ్ముల ♦ సుమములందు
మోద మిగురొత్తఁ బల్లవం♦బుల మెసంగి
కూయుచున్నది కో యని ♦ కోకిలంబు. 634

గీ. గంధములఁ దెచ్చి వెదచల్లు ♦ గంధవహుఁడు
రొదలు సేయుచుఁ బొదలఁ దు♦మ్మెదలు మెదలు
కో యనుచుఁ గూయుచుండును ♦ కోకిలంబు
మీనములు భ్రమింపకున్నవె ♦ మునుల కిచట. 635

ఉ. నీయనురాగ మెట్టిదియొ ♦ నీకనుదోయి తొఱంగఁజేయు, నీ
వేమొడకేని పెంటిఁ ద్యజి♦యింపక తోడ్కొనిపోదు వందుచే
హాయిగఁ బంచమధ్వని ది♦గంతములందుఁ బ్రతిధ్వనింపఁగాఁ
"గో" యని పాటఁ బాడెదవు ♦ కోకిల! నాకిల సౌఖ్య మున్నదే?

గీ. సంపదలఁ గల్గియుండిన♦సజ్జనుండు
అవనతుండయి యుపకారి ♦ యై మెలంగు
ననుచు బోధించుకరణి నీ♦యవనిరుహము
ఫలభరంబున వంగి తా ♦ ఫలము లొసఁగు". 637

గీ. ఇట్లు వర్ణించి పిదప స♦ఝ్యువకులుండు
సరసున మునింగి తని వోవ ♦ స్నానమాడి
తమ్మునిం గూడి వృక్షమూ♦లమ్మునందు
చిత్త మిగురొత్త నించుక ♦ సేదఁ దేఱె. 638

ఉ. అంతట నారదుం డతిర♦యంబున నచ్చటి కేగుదెంచి శ్రీ
మంతుఁడు రామచంద్రుఁడు ర♦మాధవుఁ డంచు నమస్కరించి "యా
ద్యంతవిహీన ! నిక్కముగ ♦ నాలినిఁ గోల్పడువానికంటె న
త్యంతవియోగశోకరస ♦ మాదటఁ జూపితి వేను మెచ్చితిన్. 639

చ. దుడుకున నిన్ శపించితిని ♦ దుఃఖవశంబున, సన్మతించి యి
ప్పుడమిని మానవాకృతిని ♦ బుట్టి సుఖంబుల సేవగించి యా
యడవులఁ జిక్కి నాకొఱకు ♦ నాలినిఁ గోల్పడి కుందుచుంటివే ?
జ్ఞుఁడను నన్ క్షమింపు మహ♦దార మొనర్చితి జానకీవరా !.

చ. ఇనకులమందు నాదశర♦థేశ్వరుపుత్త్రుఁడ వై జనించి, స
న్మునులనుతింప యాగమున♦బ్రోచి, త్రినేత్రునివిల్లు ద్రుంచి, య
జ్జనకజఁ బెండ్లియాడి సిరి ♦ శాశ్వతమే యని యేవగించి యి
వ్వనములఁ జొచ్చి తీర్చు పితృ♦వాక్పరిపాలన మన్ నెపంబునన్. 641

గీ వాకతంబున నీ కిట్టి♦శోక మొదవె
మాధవా ! వసాంతుని యంచు ♦ మహతిఁ బూని,
మధురగతిఁ బాడఁజొచ్చె ♦ రామాయణమును
నారదుండు సంగీతవి♦శారదుండు. 642

గీ. రామభక్తియె ప్రాజ్యసా♦మ్రాజ్య మనుచు
రామనామంబె మునులకుఁ ♦ బ్రాణ మనుచు
రామ ! గుణధామ ! సంగ్రామ♦భీమ యనుచుఁ
దనదుగానన్నెపుణిఁ జూపె ♦ మునివరుండు. 643

గీ. రామచంద్రుండు వానిగా♦నామృతమున
కాత్మ నెనలేనియానంద ♦ మనుభవించి
చిన్నినగవులు మోమునఁ ♦ జెంగలింప
మునివరుని కౌఁగిటం జేర్చి ♦ వినుతిఁ జేసె. 644

గీ. నారదుం డంతఁ గేల్మోడ్చి ♦ నయనయుగళి
మోడ్చి, ధ్యానించి శ్రీరామ♦మూర్తిఁ దలఁచి
అతనిచిత్తంబుఁ బరికించి ♦ యభినుతించి
వినతు లర్పించి యీరీతి ♦ విన్నవించె. 645

మ. పరమోదారుఁడ వీవు, నీమహిమలన్ ♦ వర్ణింప, నీరూపమున్
బరికింపం దర మానె పామరులకున్ ♦ భద్రాత్మకా! దివ్యసుం
దర మై, మన్మథుఁ గన్ననీమసొబగున్ ♦ దర్శించితిన్ నేఁడు; నీ
చరణాబ్జంబుల సన్నుతించుచు నమ♦స్కారంబు లర్పించెదన్. 646

మ. వరదుం డార్తిహరుండు పావనుఁడు స♦ర్వజ్ఞుండు, రాముండు భా
స్కరవంశాంబుధిపూర్ణసోముఁ డని లో♦కంబుల్ ప్రశంసింప, శ్రీ
హరుఁ డోహో యని సన్నుతింప, నజుఁ డౌ♦నౌ నంచు వర్ణింప నే
నసుదారన్ విని నేఁడు నిన్నుఁ గని బ్ర♦హ్మానందముం బొందితిన్.

గీ. భక్తులకుఁ గాని నినుఁ జూచు♦భాగ్య మబ్బ
దాదినారాయణా! నీకు♦నాశ్రితుఁడను
వర మొసంగుము వాంఛతో ♦ వచ్చినాఁడ
ననిన శ్రీరామచంద్రుఁ డి♦ట్లనియె నెలమి. 648

గీ. “అఖిలజీవములందు నే ♦ నవతరింతు
ననఘ! నాజన్మ మవతార ♦ మనఁగ నొప్పు
న న్నెఱింగినవారిక♦న్నన్న మెలఁగి
సకలశుభములఁ గూర్తు ని♦స్సంశయముగ. 649

గీ. ఈవు మద్భావ మెఱుఁగుదు ♦ విద్ధచరిత
మాకు భక్తులయెడల మ♦ర్మంబు గలదె
భక్తవరులకు నీరాని♦వస్తు వెద్ది?
సకల మొసఁగెద నాత్మవి♦శ్వాస మున్న. 650

చ. అన విని నారదుండు దరహాస మొకించుక యంకురింప ని
ట్లనె నిను విశ్వసించినఁ గృతార్థుఁడు గానియభాగ్యుఁ డుండునే?
వనరుహపత్రనేత్ర! నిజభక్తకృతాఘలతాలవిత్ర! యో
యినకులవార్ధిచంద్ర! పరమేశ! రమేశ! యుమేశసన్నుతా!.

## —— శ్రీరామనామమహిమ ——

చ. కమలదళాక్ష! రామ! త్రిజగన్నుత! నీదు ననంతకోటినా
మములు పరస్పరాతిమహిమంబుఁ గలట్టివి, సన్నుతింప శ
క్యమె భవదీయభక్తునకుఁ గాక, మ తెంతటివానికేని, వే
దములకునేని, నీకునిజతత్వ మెఱింగినబ్రహ్మకేనియుఁ గా. 652

గీ. రామ! సాటి లేనట్టినీనామకోటి
ఘనత నొకదాని నొకటి మించిన దటంచు
వేదములు చెప్పఁ గాని, పవిత్రమైన
రామనామంబు రమ్యాతిరమ్య మందు. 653

ఆ. వేఁటకానివలను విహగంబులు నశించు
మాడ్కి, రామనామమంత్రమునను
అఖిలపాపరాశి యంతరించును గాదె
రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!. 654

గీ. నీదుభక్తులహృదయంబు నింగి గాఁగ
కోటినామముల్ నక్షత్రకోటి గాఁగ
రామనామంబు పూర్ణసుధామయూఖ
బింబమై రాజిలుం గాక వేదవేద్య!. 655

ఉ. పున్నమినాఁటిపూర్ణశశిపోలిక నీదుపవిత్రనామ మ
త్యున్నతమైన జ్ఞానమనుజ్యోత్స్నను నాహృదయాంబరంబునన్
గ్రన్ననఁ జల్లుగాక, కలికాలము నా కిది యే యమోఘసం
పన్నిధియై రహించు, వినుమా రఘునాయక! మోక్షదాయకా!.

చ. అడిగెద నొక్కమాటఁ గరు♦ణాభరణా! దయ నానతిమ్ము, నే
వెడలితి విశ్వమోహినిని ♦ పెండిలియాడఁగ, నాదుకోర్కె నీ
వడఁచితి మాయఁ బన్ని పరి♦హాసముఁ జేసితి వెల్లవేళ నీ
యడుగులఁ గొల్చుభక్తునెడ ♦ నట్లొనరింపఁగ నీకుఁ బాడియే?"

గీ. అనిన విని నవ్వి రాముఁ డి♦ ట్లానతిచ్చె
"నాలకింపుము ధర్మర♦హస్య మనఘ!
భక్తులను నేను రక్షింప♦వలయుఁ గాదె
జనని బాలకుఁ గాపాడు♦చందమునను. 658

గీ. బాలుఁ డెఱుఁగక చెలఁగి స♦ర్పమును పట్టఁ
దాఁకఁబోయిన వారించి ♦ తల్లి ప్రోచు
నట్లు ననునమ్మికొనియున్న♦యట్టిభక్తు
నేను రక్షింపవలెఁ గాదె ♦ మౌనివర్య!. 659

గీ. అన్నిచింతల విడనాడి ♦ నన్ను నమ్మి
ఎవఁడు నానామము భజించు ♦ నెల్లవేళ
వానియోగంబు క్షేమంబు ♦ నేను సతము
నరయుచుందును నిస్సంశ♦యముగ ననఘ!. 660

ఉ. జ్ఞానులు నాదుజ్యేష్ఠతను♦జాతులు వారు స్వతంత్రజీవు లే
హానియుఁ బొంద రెల్లెడల ♦ హాయిగ స్వేచ్ఛగ సంచరింతు, ర
జ్ఞానులు నా కనిష్ఠతను♦జాతులు వారలక్షేమభారముఁ
నేన వహింతు నన్ సతము ♦ నెమ్మది నమ్మినభక్తులౌటచే. 661

మ. అరిషడ్వర్గము మత్తనూభవుల న♦త్యంతంబు బాధించు, సుం
దరు లూహింపఁగఁ గామమోహములకున్ ♦ స్థానంబులైనన్ను సు
స్థిరభక్తిన్ భజియించు నాసుతులభ♦క్తిజ్ఞానవైరాగ్య వ
ల్లరులన్ నాశముఁ జేయ గ్రీష్మఋతులీ♦లన్ గాలుచున్నారిలన్.

గీ. కాంత మోహాకాంతారవ సంతతుఁ బ్ర
మగువ యూహింపఁగా మహా మాయ చూవె
జపముఁ దపమును వ్రతము నాశనముఁ జేయు
కామినీమణి యెంతయుఁ గఠినహృదయ. 663

సీ. వానకాలమునఁ గప్పలు చెలంగినభంగిఁ
గామాదులు చెలంగుఁ గాంతవలనఁ
గలువలకున్ శరత్కాలంబులీల దు
ర్వాసనలకుఁ గాంత బల మొసంగు
హిమవంతఋతువుచేఁ గమలంబులవిధాన
రమణిచే సకలధర్మము లణంగు
నంధకారంబు దివాంధంబులకుఁబోలెఁ
బాపాత్ములకుఁ గాంత ప్రమద మొసఁగుఁ

గీ. గాలవశమున మీనంబు గాలమునకుఁ
దగిలి వినశించునరణిఁ గాంతలకుఁ జిక్కి
బుద్ధిబలమును గోల్పడి పురుషవరుఁడు
కడకు నామావశిష్టుఁ డై చెడును గాదె?. 664

గీ. దుర్గుణంబులకును సర్వదుఃఖములకుఁ
దరుణియే మూల మని యండ్రు ధర్మవిదులు;
అక్కతంబున నీవి వాయ ప్రయత్న
మే నివారించితిని జూవె మానివర్య!," 665

గీ. అనిన రాముని పలుకుల నాలకించి
ముదివరేణ్యుండు దేహంబు పులకరింపఁ
గమల నానందబాష్పంబులను త్యజించి
బహువిధంబుల భక్తి మైఁ బ్రస్తుతించి. 666

గీ. "భక్తవరు నింత ప్రేమించు♦ప్రభువరుండ
వహహా ! నిను విశ్వసింపని♦యజ్ఞుఁ డెవఁడు?
జ్ఞానహీనుండు దౌర్భాగ్యుఁ ♦ డైనవాఁడు
భక్తి నినుఁ గొల్వఁజాలక ♦ భ్రష్టుఁ డగును. 667

గీ. శాశ్వతుఁడవు విజ్ఞానవి♦శారదుఁడవు
జననమరణకలుషితసం♦సారఘోర
సంకట మణంగు నీకటా♦క్షంబువలన
నమృతగుణధామ ! శ్రీరామ ! ♦ రఘువిరామ !. 668

గీ. మూఁడులోకంబులుభరించు♦పుణ్యమూర్తి !
సకల మెఱిఁగిన సర్వజ్ఞ♦చక్రవర్తి !
సత్పురుషలక్షణంబుల ♦ సంగ్రహముగ
నానతి మ్మన్న రాముఁ డి♦ట్లనియె నెలమి. 669

చం. అరయఁగ సర్వజీవములుఁ ♦ బ్రాణసమానము లంచు నెంచుస
త్పురుషులపాదపద్మముల♦ధూళి శిరంబునఁ దాల్తు; వారి సు
స్థిరసుగుణంబులన్ దెలియ ♦ శేషున కైనఁ దరంబు గాదన
నరులకు శక్యమా? చెపుమ ♦ నారద ! గానకళావిశారదా!. 670

కం. నిరతము వినిర్మలాంతః
కరణముఁ గలవాఁడు, ధర్మ♦కర్మపరుఁడున్
అరిషడ్వర్గాంతకుఁడున్
పరమార్థపరుండుఁ బురుష ♦ వరుఁడు మునీంద్రా!. 671

కం. సత్యాసత్యము లివి యని
నిత్యము విభజించువాఁడు ♦ నీతిపరుం డై
సత్యముఁ దప్పని♦యనఘుఁడు
సత్యంబుగఁ బురుషవరులు ♦ సంయమివర్యా !. 672

గీ. విశ్వనుతపండితుండు, యో♦గీశ్వరుండు
విషయవిముఖుండు మఱియు జి♦తేంద్రియుండు
ధైర్యవంతుండు నుత్తమ♦ధార్మికుండుఁ
బురుషవరు లనఁ బరఁగిన♦పుణ్యఖనులు. 673

గీ. సంసరణపంకగతుఁ డయ్యు ♦ సంతతంబుఁ
గుమ్మరిపురుగువిధమునఁ ♦ గ్రుమ్మరిలుచు
నన్ను మది విశ్వసించిన♦జ్ఞానపరుఁడు
పురుషవరుఁ డనఁ జెల్లు నో♦మునివరేణ్య!. 674

గీ. చెలఁగి యాత్మస్తవంబును ♦ జేసికొనక
పరులసుగుణంబులన్ విని ♦ ప్రస్తుతించి
భూర్యహంకారమమకార♦ములఁ ద్యజించి
భువి మెలంగినఘనుఁడు స♦త్పురుషుఁ డనఘ!. 675

సీ. అఖిలభూతములఁ దా ♦ నని యెంచి ప్రేమించి
  సమభావముం గల్గి ♦ సంచరించి
జపతపోవ్రతముల ♦ శ్రద్ధతో నొనరించి
  యార్తులఁ గాపాడి ♦ యాదరించి
శ్రద్ధక్షమాదయా♦సంయమాదులఁ గల్గి
  వేదశాస్త్రాదుల ♦ విశ్వసించి
దుర్మార్గముఁ ద్యజించి ♦ దురభిమానముఁ దక్కి
  కామమోహాదుల ♦ గండడంచి
గీ. నాదులీలావతారగా♦నం బొనర్చి
చెలఁగి యాత్మస్తవంబును ♦ జేసికొనక
స్వార్థముఁ దొరంగి పరులఁ గా♦పాడుచుండు
సత్పురుషు నెట్లు వినుతింప ♦ సాధ్య మగును ?" 676

గీ. అనిన విని మాని శ్రీరాము ♦ నభినుతించి
వందనంబుల నర్పించి ♦ పలికె నిట్లు
భక్తులగుణాంబుల గ్రహించి ♦ పలుకు టరయ
జ్ఞానతేజోనిధీ! నీకు ♦ సహజగుణము. 677

గీ. అని యనేకవిధంబుల ♦ నభినుతించి
మహతి మోగించి శ్రీరాము♦మహిమఁ బొగడి
పోయివచ్చెద నని మొక్కి ♦ మునివరుండు
సత్యలోకంబునకు నేగె ♦ సత్వరముగ. 678

గీ. అనిశము దురాశలకుఁ బోక ♦ హరికథాసు
ధారసాస్వాదనంబునఁ ♦ దనివిఁ బొంది
సత్పథంబున నెవ్వాఁడు ♦ సంచరించు
వాఁడు ధన్యాత్ముఁ డని నేను ♦ ప్రస్తుతింతు. 679

గీ. రావణాంతకుఁ డైన శ్రీ♦రాముకథను
వినినఁ బలికినఁ బాడిన ♦ విద్య లేని
మూఢుఁడున్ మోక్షపదవినిఁ ♦ బొందుఁ జూవె
పామరుఁ డాఱుంగఁజాలక ♦ భ్రష్టుఁ డగును. 680

గీ. స్త్రీమనోహరసౌందర్య♦దీపముఁ గని
మూఢపురుషపతంగంబు ♦ పోలియు నకట!
హృదయమా! తుచ్ఛసుఖముల ♦ సేవగించి
ఆశ్రయింపుము శ్రీరాము ♦ నఘవిరాము. 681

చం. రవికులపావనుం డయిన♦రామునికీర్తి నుతించుచేఁ కవి
ప్రవరులజీవనం బనుచు ♦ వాణి పవిత్రముగా రచించితిన్
కవివరులార! రాఘవు జ♦గన్నుతదివ్యచరిత్రవార్ధి నే
కవియుఁ దరింపఁ జాలునె? న♦గంబును పంగువు దాఁట నోపునే?

శా. భ్రాతృప్రేమమయంబు, కామదము శ్రీ♦రామాయణం బంచుఁ బ్ర
ఖ్యాతిం గాంచిననీకు కావ్యము జగ♦ద్వ్యాప్తిన్ బ్రకాశింప మ
చ్చేతఃప్రీతిగఁ బల్కుచుంటిని నినున్ ♦ సేవింపఁ; జేకొ మ్మికన్
శీతాంశోరమృతార్పణం బనుక్రియన్ ♦ సీతామనోనాయకా !

ఉ. పామరుఁడన్ ధ్రువంబుగ న♦వజ్ఞుఁడ, బమ్మెరపోతరాజుఁ బోల్
ధీమహిమాఢ్యుఁ డెవ్వఁడో య♦తిప్రతిభన్ విరచింపఁబోలుఁగా
కేమియు నేరనట్టిమతి♦హీనుఁడ నేను రచింప నౌనె ? శ్రీ
రామ! భవత్కృపాబలము♦ప్రాపున వ్రాయుచునుంటి నీకథన్.

సీ. వానరుఁడు నీదుప్రాపున ♦ వనధి దాఁటె
శిలలు భవదీయమహిమచే ♦ జలధిఁ దేలె
నిన్ను మది విశ్వసించిన ♦ నేను నీదు
కథను వ్రాయుట యబ్రంబె? ♦ ఘనతరంబె?. 685

కం. మారీచఘోరమాయా
ధారాధరవరసమీరా! ♦ దండితరక్షో
వీరా! యాశ్రితభక్తా
ధారా! ధీరాతిధీర! ♦ ధర్మవిచారా!. 686

కం. రామా! సద్గుణముక్తా
దామా! మునివినుతసోమ♦ధామా! నతసు
త్రామా! సునామ! పాపవి
రామా! సంగ్రామభీమ! ♦ రాజలలామా!. 687

చం. సురుచిరదివ్యనీలమణి♦సుందరగాత్ర! పవిత్ర! శత్రుభీ
కర! శతపత్రనేత్ర! వర♦కర్బురగోత్రలతాలవిత్ర! భా
స్కరకులవార్ధిచంద్ర! గుణ♦సాంద్ర! జగన్నుతమానవేంద్ర ! శ్రీ
వర!నిరపాయ! భక్తసదు♦పాయ!దయాహృదయా!మహోదయా!.

మాలిని. మునివినుతముకుందా! ♦ భూసుతానందకందా!
తనురుచిజితకందా! ♦ దండితారాతిబృందా!
జననుతశుభమూర్తీ! ♦ సత్యమార్గానువర్తీ!
దినకరశశికీర్తీ! ♦ దేవతాచక్రవర్తీ!

గద్య.

ఇది శ్రీ భాగవతుల నారసింహాశర్మ విరచిత
శ్రీతులసీరామాయణమునందలి
యారణ్యకాండము
సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు



# "రాష్ట్రేత రాంధ్రులు" Andhras Abroad.

ఇదియొక ఆంధ్రమాసపత్రిక. క్రౌన్ ¼ సైజున ముద్రింపబడుచున్నది. సంవత్సర చందా ఒక రూపాయి ముందుగా చెల్లించవలెను. ఖరగ్పురస్థ ఆంధ్రజనసంఘమువారి యాజమాన్యమున ప్రకటింపబడుచున్నది. దీనికి ముఖ్యసంపాదకులు ఆంధ్రసభారత్న భండారు దండపాణి పంతులుగారు. ఇందు సాంఘిక, ఆర్థిక, విద్యా, ఆరోగ్య, పారిశ్రామిక, నైతిక, వాఙ్మయ మతవిషయములగూర్చిన వ్యాసము లుండును. రాష్ట్రేతరాంధ్రులం దాంధ్రత్వము స్థిరత్వము వహించునటుల జేయుటకును, ఆంధ్రోద్యమ ప్రచారము గావించుటకును, ఆంధ్రులకును ఇతరజాతులవారికిని నడుమ పరస్పరసోదరభావము పెంపొందించుటకును, రాష్ట్రేతరాంధ్రుల సాంఘిక కార్యక్రమములనెల్ల కేంద్రీకరించుటకును నిరంతరకృషి సేయును. రాష్ట్రీయ, రాష్ట్రేతర ఆంధ్రులెల్లరును స్త్రీపురుషవిచక్షణలేక చదువవలసిన పత్రికారాజము. రాష్ట్రేతరాంధ్రుల నడుమ ప్రచారము గోరువారు "రాష్ట్రేతరాంధ్రు"లందు ప్రకటించినచో మనోరథసిద్ధినందగలరు.

వివరములు గోరువారు.—

"ఆంధ్రజనసంఘ గౌరవ కార్యదర్శిగారికి, ఖరగపురము"

అని వ్రాయవలెను.

# ముద్దులమూట

హాస్యరసప్రధానమగు పక్షపత్రిక.

ముద్దులమూటంగట్టు ముద్దులతో కడుపుబ్బనవ్వంబుట్టించు నంశేములతో, పెద్దాపురమునుండి, శ్రీయుత వడ్డి శ్రీరామమూర్తిగారి సంపాదకత్వమున వెలువడుచున్నది. ఇది వియోగులకు రోగులకు నవ్వులో సమాన దివ్యౌషధము. ఇందుగల కథలు, వార్తలు, మృదుమధురపద్యములు చదివినకొలంది చదువవలెనను నాసక్తిం బుట్టించుచుండును. ఇప్పుడాంధ్రదేశమునంగల యత్యంతోపయోగమైన పత్రికలకిది శిరోమణియని ప్రఖ్యాతిం గాంచినది. సం॥ చందా॥ రూ 3-0-0. అర్ధసం॥ చందా॥ రూ 1-12-0 వివరము లెఱుంగఁదలంచినవారు:— శ్రీయుత వడ్డి శ్రీరామమూర్తిగారు,

ముద్దులమూట సంపాదకులు

పెద్దాపురము, తూర్పుగోదావరిజిల్లా అని వ్రాయవలెను.

# దేశబంధు.

ఇదియొక చక్కనిమాసపత్రిక. ఇందు చదువరుల కానందము గలిగించుకథలు రోగ, వైద్యవిషయములు, ప్రహసనములు, ఏకాంకనాటకములు చక్కగానొక్క సంవత్సరములో గీర్వాణ భాషయందు పాండిత్యమును గలిగించు పాఠములు వార్తలు మున్నగు ననేకవిషయములతో పేరుపొందిన పత్రిక.

సం॥ చందా రూ. 3.　　దేశబంధు పత్రిక, వడ్డేపల్లి, తూపురాణపోస్టు

వేగుచుక్క గ్రంథమాల-బరంపురం (గంజాం)

# శ్రీ తులసీరామాయణము

## భగవాన్ తులసీదాసుగారి రామాయణము.

**Mahatmaji Writes in young India dated April 27, 1921.**

"The Ramayana used to be regularly read in our amily. A Brahmin Called Ladha Maharaj used to read t. He was striken with leprosy, and he was Confident that a regular reading of the Ramayana would cure him of leprosy, and indeed he was cured of it."...........

ఈరామాయణముం గూర్చి శ్రీగాంధిమహాత్ముండు "యంగ్ ఇండియా" అను పత్రికలో నిట్లు వ్రాసెను:—

"మాయింటం బ్రతిదినము శ్రీరామాయణమును లాఢా మహారాజను బ్రాహ్మణుండు చదువుచుండెను. అతండు కుష్ఠరోగి. ఈరామాయణపఠనమువలనం దనరోగము నివర్తించు నని విశ్వసించి పఠించుచుండెను. నిజముగ, అతం డారోగమునుండి విముక్తిం గాంచెను"...

The Christian Literature Society వారీగ్రంథప్రాశస్త్యమును, "Divine in carnation as taught by Ramayana of Tulasi Dass" అను గ్రంథముఖమున వెల్లడించినారు. దీనిప్రాశస్త్య మిట్టిదని మే మింతకంటె నధికముగ వ్రాయంజాలము. ఈగ్రంథమును పద్యకావ్యముగ నాంధ్రీకరించుచున్నారము. గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు. సార్థకబిరుదాంకితులగు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికతో, మహాకవి తులసీదాసుగారి పటముతో, ఆంధ్రీకరించిన గ్రంథకర్త ఛాయాపటముతో, శ్రీరామపట్టాభిషేక చిత్రపటముతో, మిక్కిలి సొగసుగ ముద్రింపంబడి

బాలకాండము + అయోధ్యాకాండము రెండుభాగములుఁ గలిపి యొకసంపుటముగా నిండుకేలికో బైండు చేయఁబడుచున్నది. దరిదాపు 3000 పద్యములు. విలువ రూ 3-0-0 మా ఆంధ్రసోదరులు దయయుంచి రూ 1-0-0 అడ్వాన్సుతో సహా ఆర్డరు బుక్ చేసికొనవలెను. కొలదిప్రతులుమాత్రమే కలవు.

☞ బాలకాండము ప్రథమముద్రణము 1000 ప్రతులు సరిపోయినవి. ద్వితీయముద్రణము కొలఁదిప్రతులుమాత్రమే ముద్రించి, అయోధ్యాకాండము రెండుభాగములతోఁ గల్పి కొన్నిప్రతుల మాత్రమే నిండుకాలికో బైండు చేయించుచున్నారము. వలయువారు వేగముగా అడ్వాన్సు పంపుకొనవలెను.

భాగవతుల నృసింహశర్మ,
ప్రొప్రైటర్, వేగుఁజుక్క గ్రంథమాల,
ఖాదిపెద్దివారి వీధి, బరంపురం-(గంజాం జిల్లా)



## ప్రధాన పోషకులు.



1 శ్రీయుత ఇంగుళిగె వేంకటశివరామదాసు పంతులుగారు, మొఖాసాదార్—నరసింగరావుపురము—ఉర్లాము.

2 ,, కే. కృష్ణారావుగారు,
LAND LORD,
బాపురం—బరంపురము.

3 ,, కొచ్చర్లకోట గున్నాథరావుగారు,
Proprietor I. L P. press— బరంపురం.

4 ,, ఆంధ్రనటరాజ, నటభూషణ, కలియుగాంజనేయ బిరుదాంకితులు సి. యస్. నటేశంగారు,
Propiretor
శ్రీకృష్ణమోహన సమాజము,

☞ కం. కలనవల లెన్నిచదివినఁ
గలకాలముఁ గ్రాలు కావ్యకన్యకు సరియా ?
" వెలకాంత లెంద ఱున్నను
కులకాంతకు సాటిరారు గుణవ్వలచెన్నా !."

శాఖోపగ్రంథము:—

# సరసశృంగారము.

(శృంగారకళాసిధి.)

ఈ అపూర్వగ్రంథము పూర్వకవిప్రణీతము-హావభావశృంగారవిలాసప్రదర్శనమున కిది నిదర్శనము—ఆంధ్రపత్రికలోఁ జాలకాలమువఱకు పెక్కువిధములఁ గొనియాడఁబడిన గ్రంథరత్న మిదియే- అపూర్వశృంగారకావ్యరత్నమిది—లండన్ రాయల్ ఎడిషన్—(నిండు కేలికో బైండు) ఫెదర్ వెయిటు కాగితము- చక్కనిఅచ్చు - శృంగారచిత్రపటశోభితము—పరిశుద్ధపండిత ప్రతి.

వి. పి. చందాదారులకు రూ 1—10—0 (ఖర్చులతోసహా)
ఇతరులకు రు 2—8—0

☞ ప్రతిచందాదారు ఈ శృంగారరత్నమును తప్పక స్వీకరింపవలెను. గ్రంథప్రాశస్త్యముఁబట్టి మేమిట్లు నిర్బంధించుచున్నారము. చందాదారులు గ్రంథముఁబఠింపకుండఁద్రిప్పరాదు. చదివి బాగులేదని త్రిప్పివేయఁగలిగినయెడల భరింతుము పలువురు కోరుటఁబట్టియే మాచందాదారులకుఁ జాలచవుకగా ఇచ్చుచున్నారము.

మచ్చునకొక పద్యము :—

"మ. వనితారత్నముచేరి, భర్త యని సద్భావించి, ప్రాణేశ్వరుం
డని ప్రేమించి, మగండు దైవ మనుచున్ ప్రార్థించి, గాఢోపగూ
హనమిఁబోయినయంతఁ బొమ్మని యెలంజాయించు, వేశ్యాంగనా
జనలోలుండు గ్రహించునే కులసతీసంభోగసౌభాగ్యమున్."

సరసశృంగారము.

వేగుఁజుక్క గ్రంథమాల,
బరంపురము, గంజాంజిల్లా.

“స్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాం కో దోషస్సతు గుణగణానామవగుణః
యదేతైర్నిశ్శేషైరపరగుణలుబ్ధైరివ జగ
త్యసావేకశ్చక్రే సతతసుఖసంవాదవసతిః।
యదిక్షుణ్ణం పూర్వైరితిజహాతి రామస్యచరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యోజయతికః
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముపకరిష్యంతి” కవయః”

భవభూతి.

శ్రీరస్తు.

శ్రీయుత, పండిత గాదె శ్రీజగన్నాథస్వామిగారి

—। సుహృత్ప్రశంస ।—

చ. అవిరళవాగ్విలాసరుచి । నార్యులుమెచ్చఁగ, భక్తియుక్తి రా
ఘవచరితంబు నొక్కనవ। కావ్యముగా ఘటియించి, కీర్తిచే
నవనిని జన్మపావనుఁడ । వై చరితార్థుఁడ వైతి వౌర! భా
గవతుల నారసింహకవి! । గౌరవపాత్రుఁడ వౌదు వెల్లెడన్.



THIS CANCELS ALL PREVIOUS RULES.

*Estd in 1911.*

Registered. భాగవతుల నరసింహశర్మ,

ప్రొప్రైటర్,

వేగుంజుక్క

గ్రంథమాల,

పూడిపెద్దివారి వీధి,

బరంపురం (గంజాం)

1929.

NOTE THIS




TRADE MARK

# నిబంధనలు.

1 నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహరనాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముతో, రమ్యమగు అచ్చుతో రెండు మాసముల కొక్కటిగా వెలువడును.

2 గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్క రూపాయికి వి. పి. చేయఁబడును. ఖర్చులు ప్రత్యేకము. ఇతరులకు ప్రతిగ్రంథము రూ 1—8—0 (ఖర్చులుగాక)

3. ఆరుగ్రంథములు (పోస్టేజీలుగాక) సంవత్సరమునకు ఆరు రూపాయలు మాత్రమే. ఈయారురూపాయలు ముందు (అడ్వాన్సుగా) బంపు చందాదార్లకు ఎట్టిఖర్చులుండవు. ఎప్పటికప్పుడు 1 రూ॥ అడ్వాన్సుగా బంపినను ఖర్చులుండవు. ఇందువలన చందాదారులకు రూ 2—4—0 లాభముఁగలదు.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములలో నేయొక గ్రంథమునైనఁ గోరిరేని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే, అట్లుకాక, తాను ప్రవేశించిన పిమ్మటనుండి గ్రంథములఁ బంపఁగోరిరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే!

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన యెంతమాత్రమును లేదు. వారు కోరిరేని (కోరిన

గ్రంథములబట్టి) చౌకగా ఇచ్చెదము.

6. అప్పుడప్పుడు వెలుబడు అనుబంధగ్రంథములు శాశ్వతచందాదార్లకుమాత్రమే యుచితము ప్రతిగ్రంథముం దప్పకుండ స్వీకరించువారు శాశ్వతచందాదారులు.

# గ్రంథరచనా నియమములు

1. Characterisation. 2 Developement of character. 3. New Ideas. 4. Historical Beauties, 5. Description of Nature and other varieties.

గమనింపుడు:—చందాదారులు ప్రతిగ్రంథముం బుచ్చుకొనుట తమకు విధియై యున్నది. తిరపంపించినపిమ్మట గ్రంథము నెంతమాత్రము ద్రిప్పివేయరాదు. ప్రతి గ్రంథమునకు ముందు ఇంటిమేషను పంపుదుము. ఇష్టములేనివారు వెంటనే మాకు దెలియం జేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధ ముచితముగా పంపుదుము. అడ్వాన్సు పంపిన చందాదారులకు ఖర్చులుండవు. (రూ 2-4-0 లాభము.)

నూతనప్రచురములు. (New Publications.)

# శ్రీతులసీరామాయణము

నిర్వచనము—చిత్రపటశోభితము.

వాల్మీకిరామాయణమువలెనే హిందూదేశమునం దంతటం బ్రఖ్యాతిం గాంచిన రామాయణ మిది. వనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయబడినది. బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది. జగద్గురువగు శ్రీగాంధీమహాత్మునిచే నిత్యముం బారాయణము చేయబడు నీరామాయణప్రాశస్త్యకముం జదివినవారనేకవిధముల గొనియాడకపోరు వివిధరసములకు, ఉపాఖ్యానములకు, మనోహరగాథలకు నిది జన్మపీఠ. ఒక్కొక్క కాండముచొప్పున వెలువడును. ఆంధ్రీకృత శ్రీతులసీరామాయణముం బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములు మున్ముందు ప్రచురింపంబడును. బాలకాండము వెలువడినది. కొలదిప్రతులుమాత్రము కలవు. అయోధ్యాకాండము రెండుభాగములు ప్రతి సంపుటము చందాదారులకు రూ 1-0-0 ఇతరులకు రూ 1-8-0 పోస్టేజి ప్రత్యేకము బాల + అయోధ్యాకాండముల నిండు కేలికోబైండు సంపుటము రూ 3-1-0 ఖర్చులు ప్రత్యేకము—అడ్వాన్సు పంపవలెను. అరణ్యకాండము విక్రయమునకు సిద్ధముగనున్నది.

# ఉగ్రభైరవము.

(చిత్రపటములతో సహా) (Calico Cover) (160 పుటలు)

గ్రంథకర్త:—పోడూరి రామచంద్రరావుగారు, బి. ఏ. బి. యల్.

ఇదియొక భయంకరమైన డిటెక్టివ్ నవల. ఆంగ్లమునగల "The Hound of the Baskerviles" అను నవల ననుసరించి మృదుమధురశైలిని వ్రాయబడినది. చిత్రపటశోభితము హంతకుఁడొక జాగిలముద్వారా చేయించిన యత్యద్భుత భయంకర ప్రక్రియ ఇందు నిరూపింపబడినది. తుదవరకుఁ జదువనిదే విడిచిపెట్టరు. గుండెలవియఁజేయుఘట్టములు, వలయువారు వెంటనే వ్రాయవలెను. కొలదిప్రతులుమాత్రమే కలవు. చందాదార్లకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0 ఎల్లరకు పోస్టేజి ప్రత్యేకము.

# సర్వమంగళ

(Full calico) (216 పుటలు.)

గ్రంథకర్త:—వారణాసి నరసింహారావుగారు.

ఇదియొక సరసమైన సాంఘికనవల, ఆరుంధతీ దమయంతుల పరోపకారపాకీణత, సుశీలాసర్వమంగళలభయంకరకష్టములు కామినీభీషణప్రతిహింస, డాక్టర్ భువనసుందరుని దుర్దాంతదురంతకార్యములు, కామవికారప్రక్రియలు. చదివితీరవలెను. ఇంతయేల? ఆంధ్రపత్రికాదిపత్రికలచేఁ బొగడ్తకెక్కిన నవలయిది. చక్కని పెండుకాలికో బైండు, మంచిఅచ్చు, మంచి కాగితము.

# రసపుత్రజీవనసంధ్య

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

బెంగాళీభాషయందు శ్రీరమేశచంద్రదత్తుగారిచే వ్రాయఁబడినది. పైగ్రంథకర్తగారిచే ననువదింపఁబడినది ప్రథమప్రతులన్నియు సరిపోయినవి. ద్వితీయముద్రణమునకు సిద్ధముగానున్నది. వలయువారు వెంటనే తెలియఁజేయవలెను. వెల 0-14-0 పోస్టేజి ప్రత్యేకము. (ప్రతులులేవు- ద్వితీయముద్రణములోనున్నది)

నాటకత్రయము—గ్రంథకర్త—భా॥ నృ॥ శర్మ.

# విజయవిజయము

వీరరసప్రధానమగు నాటకము. కర్ణార్జునుల యుద్ధము. ఎల్లరు భారతముఁ జదివినవారే కాని కర్ణుడెట్టివాఁడో యెఱింగినవారు లేరు. కర్ణునికొఱకే యీనాటకము వ్రాయబడినది. అనేకులుకొనియాడిన నాటకమిది. వెల రు 0-10-0 పోస్టేజిప్రత్యేకము.

-

## 2 ప్రతిజ్ఞావిజయరామరాజీయము

లేక

## విచిత్రవీరబొబ్బిలి

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మ

బొబ్బిలి యుద్ధ నాటకము లనేకములున్నవి. యథార్థములగు వంశములతో విరాజిల్లు నాటకరత్నమిదియే. విజయరామరాజు గారి రాజనీతికి బొబ్బిలివారి పరాక్రమములకు నిది యద్దముపట్టు. వెంగళార్య, రంగారావు, పాపయ్య, మొదలగు వీరుల పద్యములన్ని మాత్రము వర్ణింపబడును. దీని వెల 0-12-0 పోస్టేజి ప్రత్యేకము కొలదిప్రతులు మాత్రమే కలవు

## 3 ప్రతిజ్ఞాచాణక్యము

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మ.

శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు నాటకగ్రంథకర్తలలో పేరు పొందిన ప్రఖ్యాతి నాటకమునకు "చంద్రగుప్త" శిరోభూషణము ఆచంద్రగుప్త నాటకమే యీ ప్రతిజ్ఞాచాణక్యము. అనేక నాటకములవారు నాటక మాడి ప్రఖ్యాతిగాంచిరి. చాణక్య నెయ్యఁగఁ దలంచినవారీ నాటకమును జదివితీరవలెను. దేశభక్తి కిది పుట్టినిల్లు, చందాదార్లకు రు 1-0-0 పోస్టేజి ప్రత్యేకము. స్వరాజ్యాదిపత్రికలచే పొగడఁబడిన నాటకరత్నమిది.

## అభినవ భర్తృహరి

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈ నామముఁబట్టియే యిది భర్తృహరి సుభాషితములంబోలు గ్రంథమని తెలియగలదు. శృంగారాది వివిధరసములకు, నీతిభక్తిజ్ఞాన వైరాగ్యముల కిదిపుట్టినిల్లు మృదు మధురపద్యములు, చక్కని శైలి, మంచికాగితము, సొగసైనఅచ్చు దిట్టమగు నట్టలైను కొలది ప్రతులే యున్నవి. దీనివెల 0-10-0 పోస్టేజి ప్రత్యేకము.

## కామాక్షి సరసము.

గ్రంథకర్త:—శృంగారశిరోమణి, మండా వెంకటేశముగారు.

తారాశశాంకవిజయము, బిల్హణీయము, రాధికాసాంత్వనము, మొదలగు శృంగారప్రబంధములకంటె నిదిమేలు. వ్యవహారభాషమున శృంగారరసముఁ గుమ్మరింపఁ బడినది. వీధిలోకకము, మంచిఅచ్చు, చూడసొంపుగనుండును, మత్తేభమాలిక.

మనోహరశైలి వెల 0-1-0 మాత్రమే.

# గాంధిశతకము

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈశతకము భారతికిపతకమని పెక్కుండ్రు కొనియాడినారు. ఇందు 100 సీసము లున్నవి. వెల 0-4-0 మాత్రమే. మచ్చునకొక సీసము:—

సీ. కోటిరూప్యములిచ్చి । కోమటివానినిఁ
గొనవలెననుమాట యసత్యమగునె?
చక్కనిరాట్నంబు । చనుదెంచెఁ దోవలో
బండి తీయుం డన్న । స్వార్థమగునె?
తలితప్పివచ్చిన । ధాతయునైనను
చేయు మే కానన్న । నింద్యగనదె?
కడకు దైవము తోడు । పడకున్న నూలు వ
తుకఁ దుంచు ననిఁత । దోస మగునె?
గీ. కాల మనుకూలముగ నున్నఁ । గార్యమగును;
పురుషకారంబు ఫలసిద్ధి । మూల మగును;
ఎవ్వరే మనుకొన్న మా । కేమికొంత
సాంధ్రిధీశఁధి! శ్రీశర్మ । చంద్రగాంధి!

# కాంతాపహరణము

కన్యాశుల్కనాటకమును మించిన హాస్యరసప్రధానమైన గ్రంథరత్నమిది- ఇందుకథానాయకుఁడు వెంకటేశము- వేశ్యలతోఁ బ్రసంగించునప్పు డింతటి పరసుఁడు లేడనిపించును. మోసగించినప్పు డింతటి టోపీవాఁడు లేడనిపించును. తుదకీ కథానాయకుఁ డెల్లర నతిచమత్కారముగ వంచించి కాంతాపహరణప్రఖ్యాతి నార్జించును ఇందలి స్త్రీపాత్రలలో కథానాయిక కనకలక్ష్మి- మాణిక్యము- వేశ్యమాత- రాజామణి చెన్నపట్టణపు వారకాంతామణి- వంచింపఁబోయి వెంకటేశముచే వంచింపబడును. అచ్చటచ్చట ముద్దులొలుకు శృంగారరసపద్యములు పాటలుగలవు- ఆటకు అనుకూలముగనున్నది. కొలదిప్రతులుమాత్రమే మిగిలినవి. వెల చందాదారులకు 1-0-0 రూ॥ ఖర్చులు ప్రత్యేకము.

మా అనుమతి బొందకుండ ఈ నాటక మాడరాదు.

ఇట్లు,
భాగవతుల నృసింహశర్మ,
ప్రొప్రైటర్- వేగుఁజుక్క గ్రంథమాల.
పూడిపెద్దివారివీధి బరంపురం, గంజాంజిల్లా.

# కాళీఘట్టరహస్యములు

(The mysteries of Calcutta) 273 పుటలు.

ఇది యత్యద్భుతమైన డిటెక్టివ్ నవల—గ్రంథకర్త:—దామరాజు వేంకటరమణమూర్తిగారు. కలకత్తాలో రహస్యముగ జరగు అత్యద్భుతవిషయము లిందుగలవు.

వెల చందాదారులకు రు 1—0—0

# ప్రణయసామ్రాజ్యము

(The kingdom of Love) ఛాయాపటముతో సహా.

గ్రంథకర్త:—నోవలిస్టు శ్రీయుత కర్లపాలెం కృష్ణారావుగారు.

ఈగ్రంథము సాంఘికనవల మనోహరశైలిఁగలది. తుదివఱకు చదువనిదే విడిచి పెట్టరు. కీ॥ శే॥ ఆంధ్రరత్నము దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి కంకితము గ్లేజుకాగితముపై ముద్రితము.

వెల రూ 1—0—0

ఇపుడే వెలువడినది. పుత్రవంచకుఁడు. (The Righteous Rogue)

గ్రంథకర్త:—కే. యస్. రామమూర్తి ఎమ్. ఏ.

ధర్మముఁదప్పక, నీతివిడిచిపెట్టక, చౌర్యమొక కళయని నిరూపించిన గోపాలశాస్త్రిగారి నీగ్రంథమునఁ జూడఁగలరు. పత్రికలచేఁ గొనియాడఁబడిన గ్రంథరత్నమిది.

విలువ 0—10—0 మాత్రమే.

చందాదారులకు గ్రంథాలయములకు మాత్రమే.

(కొలఁదిదినముల పర్యంతమే.)

ఇందుగల నవలలు—నాటకములు—శతకములు—కోరినయెడల మిక్కిలి చౌకగా నిచ్చెదము. ఈకన్సెషను కొలది కాలము పర్యంతమే. వలయువారు వేగముగ మాకు తెలియఁజేయవలెను. కొలదిప్రతులుమాత్రమే మిగిలియున్నవి. గమనింపవలెను.

వలయువారు:—భాగవతుల నృసింహశర్మ,

వేగుఁజుక్క—గ్రంథమాల, పూడివెద్దివారివీధి.

బరంపురము, గంజాంజిల్లా అని వ్రాయవలెను.

గమనింపుఁడు:—మా చందాదారులు, తమకువచ్చినట్టి పార్సెల్సుపైని, మా చిరునామా బాగుగ గమనించి పిమ్మట సొమ్ముచెల్లించి పుచ్చుకొనవలెను. మా పూర్వప్రచురణములలో, నే కే, వాఁడేవీఁడు, ప్రతులులేవు. అందు విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు 1 కాలూరాయి. 2 కోటీశుతనయ. 3 విభ్రమరాఘవము. (జానకీపరిణయవృత్తాంతము)